మనోతిమిరాన్ని పారద్రోలే పుస్తక డిపోలు



# యండమూరి వీరేంద్రనాథ్

# విమ్మల్ని మీరు గెలవగలరు





నవసాహితి బుక్ హౌస్
ఏలూరు రోడ్ • విజయవాడ-520002



# MIMMALNI MEERU GELAVAGALARU

By :
YANDAMURI VEERENDRA NATH
36, Jayanagar, Road No. 3,
Banjara Hills, Hyderabad-500 034
Phone : 3313676

First Edition :
December, 1992
Fifth Edition :
December, 1998

Publishers :
NAVASAHITHI BOOK HOUSE
Eluru Road, Near Ramamandiram,
Vijayawada-520 002
Phone : 432 885

Printers :
Venkata Satya Printers,
Vijayawada-3

Cover Design :
ART LINES, G. V. RAMANA
Hyderabad

Price :
Rs. **25-00**

28064

# మిమ్మల్ని మీరు గెలవగలరు

ఈ పుస్తకంలో ఏముందంటే—

—పదహారేళ్ళ వయసులో ప్రేమలోపడి, ఆ అమ్మాయితో తన ప్రేమ గురించి ఎలా చెప్పాలా అని బుర్ర పాడుచేసుకునే అబ్బాయిల గురించీ...

—పద్దెనిమిదేళ్ళ వయసులో పెళ్ళి చేసుకుని- ఇరవై ఏళ్ళకే భర్త నిరాసక్తతకు గురైన యువతుల సమస్యల గురించీ...

—పాతికేళ్ళ వయసులో పరాయి స్త్రీతో సంబంధం పెట్టుకుని- ఆ విషయంగా అర్ధాంగితో ఎలా రాజీకి రావాలా అని మథనపడే యువకుల గురించీ...

—ముప్పై ఏళ్ళ వయసొచ్చినా అత్తపోరుతో సతమతమయ్యే గృహిణుల సమస్య గురించీ...

—నలభై ఏళ్ళొచ్చినా ఒక వ్యక్తిత్వం రాక- గుర్తింపు కోసం తాపత్రయపడే అనామకుల గురించీ...

—నలభై అయిదేళ్ళ వయసులో భర్తకి తనకన్నాముందే మరో స్త్రీతో వివాహం జరిగిందని తెలిసిన అభాగ్యుల కన్నీళ్ళ గురించీ...

— యాభై ఏళ్ళ వయసులో- తన జీవితం అయిపోయిందే అంటూ ఏర్పడే దిగులు గురించీ...

—అరవై ఏళ్ళ వయసులో తను పిల్లలు తనని దూరం చేస్తున్నారన్న ఫీలింగ్ వల్ల ఏర్పడే భయాల గురించీ-

ఇంకా...

—దర్శకత్వం నేర్చుకోవటం గురించీ... టి.వి.ల్లో నటన గురించీ- మోసం చేసేవాళ్ళ గురించీ... మోసగింపబడే వాళ్ళ గురించీ- మరెన్నో మానసిక సమస్యల గురించీ-

యక్ష ప్రశ్నలకి - లక్ష సమాధానాలు

# కెరీర్ ప్లానింగ్

## కెరీర్....

కెరీర్ అంటే ఏమిటి? ప్రతి మనిషికీ ఒక కెరీర్ వుంటుంది. అమితాబ్ బచ్చన్‌కి యాక్షన్ కెరీర్, రమేష్ కృష్ణన్‌కి టెన్నిస్ కెరీర్, ఒక ఆటోవాడికి ఆటో డ్రైవింగ్ కెరీర్, ఒక భర్తచాటు భార్యకి కుటుంబ బాధ్యతలు సక్రమంగా నిర్వర్తించటం కెరీర్, ఒక విద్యార్థికి చదువుకోవటం కెరీర్.

ప్రతి మనిషికి వుండే యీ కెరీర్ సక్రమంగా ఏర్పరచుకోవటానికి ప్లానింగ్ చాలా అవసరం. సరైన ప్లానింగ్ లేకపోతే భవిష్యత్తు సజావుగా సాగటం కష్టం. కాంపిటీషన్ ఎక్కువైన యీ రోజుల్లో, అందరూ తమ కెరీర్‌ని సమాజ పరిస్థితులకు అనుగుణంగా మలచుకుంటున్నారు. కెరీర్ గురించి సరైన అవగాహన ఏర్పరచుకొని, తమ జీవితాలకు, జీవన విధానాలకు సరిపడే కెరీర్‌ని ఎంచుకోవాలి.

కెరీర్ ప్లానింగ్‌తో ఎదురయ్యే సమస్యలు అనేకం. అందులో మొదటిది సరియైన అవగాహనశక్తిలేక, సరిగ్గా ప్లాన్ చేసుకోలేకపోవటం. కొందరు ఏదో 'చదువుకుంటున్నాం అంటే చదువుకుంటున్నాం' అన్నట్లు తమ విద్య కొనసాగిస్తారు. స్కూల్ చదువు పూర్తయ్యాక, ఏ సబ్జెక్ట్‌లో సీటువస్తే అదే చదివేస్తారు. అలా కాకుండా ముందునుండి ప్లాన్డ్‌గా వుంటూ ఏ సబ్జెక్ట్‌లో తమకు యింటరెస్ట్ వుందో తెలుసుకోవాలి. తమకు ఏ వృత్తి చేపట్టటం యిష్టమో నిర్ణయించుకొని, దానికి ఏం చదవాలో.... ఎలా చదవాలో, అలా చదవటం మంచిది. ఓ అబ్బాయి బాగా డబ్బు సంపాదిస్తున్న ఛార్టెడ్ అకౌంట్‌ని చూస్తాడు. దానికి ఏం చదవాలో తెలియక, యం.పి.సి. మంచి గ్రూపు కదా! అని అది తీసేసుకొని కష్టపడి చదివిస్తే ప్రయోజనం వుండదు. దానికి కామర్స్ చదివితే మంచిదని, ఆ తరువాత ఆర్టికల్స్ చేయాలని తెలుసుకుని ఎలా చదవాలో ప్లాన్ చేసుకుంటే, అతడు పడే కష్టానికి ఫలితం దక్కుతుంది.

నేను ఎస్సెస్సెల్సీ లెక్కల్లో నూటికి తొంభై మార్కులతో ప్యాసయి కూడా, డాక్టర్ అవ్వాలనుకుని సైన్సు గ్రూపు తీసుకుని, అదిష్టంలేక లిట రేచర్‌తో ఒక సంవత్సరం చదివి, తిరిగి లెక్కలమీద ఇంటరెస్టుతో బి.కామ్. లోకి వచ్చి సి.ఏ. చేశాను. ఇది కెరీర్ ప్లానింగ్‌మీద నాకు గానీ, నా పెద్దవాళ్ళకిగానీ అవగాహన లేకపోవటాన్ని సూచిస్తుంది.

కొందరు పెద్దలు తమ యిష్టానుసారంగా పిల్లలు చదవాలని నిర్ణ యిస్తారు. తాము చిన్నప్పుడు యింజనీర్ కావాలని అనుకుని కాలేకపోయి నందుకు, అదే యింజనీరింగ్ తమ పిల్లలతో చదివించాలని ఆశిస్తారు. పిల్లల అభిప్రాయానికి ప్రాముఖ్యత నివ్వరు. తమ యిష్టానుసారంగా కొడు కును యింజనీరింగ్ చదివించాలని తల్లిదండ్రుల ఆశ. కానీ ఆ కొడుక్కి లెక్కలంటే విసుగు, అతనికి లా అంటే యిష్టం. కాని తండ్రిని ఎదిరించి చదివే ఆర్థిక స్వేచ్ఛగానీ, వాదించగల మెచ్యూరిటీగానీ లేని అతను, అభి రుచి లేని సబ్జెక్టునే నిరాసక్తంగా చదువుతూ వుంటాడు. ఎం. సెట్ పరీక్ష రోజున రాత్రంతా తల్లి తండ్రి మేల్కొని చదివిస్తారు. రిజల్ట్స్ కోసం కళ్ళలో వత్తులు వేసుకుని ఎదురుచూస్తారు. ఎం. సెట్‌లో ఎలిజిబిల్ కాని ఆ అబ్బాయిని తిట్టి, కొట్టి బాధిస్తారు. ఎం. సెట్ పాస్ అవ్వని అతను తను దేనికి పనికిరాని వాడినేమో అన్న నిరాశతో ఆత్మహత్య చేసుకుం టాడు. లేదా పెసిమిస్ట్ అవుతాడు. దానికి కారణం అతనిలో తెలివితేటలు లేకపోవటం కాదు. అభిరుచిలేని విషయం అవగాహన చేసుకొనే శక్తి లేక పోవటం. అలా కాకుండా అతను, తన తండ్రికి నచ్చచెప్పి, ఒప్పించి యిష్టమైన 'లా'నే చదివివుంటే, గొప్ప లాయర్ అయ్యుండేవాడు కదా! ఇలాంటి సమస్య వున్న పిల్లలు ధైర్యంతో పెద్దల మనస్సు మార్చి అను కూలమైన పరిస్థితులు కల్పించుకోవాలి. అంతేకాని యిష్టం లేకపోయినా రాజీపడి పోకూడదు ప్రతి విషయంతోనూ రాజీపడటం పిరికివాళ్ళ లక్షణం. పెద్దవాళ్ళు కూడ పిల్లల అభిప్రాయాలకు విలువ యివ్వటం మరీ ఉత్తమం.

మరొక ముఖ్య సమస్య— ఆర్థిక సమస్య. పిల్లలకి చదువుకోవాలని కోరిక, తల్లిదండ్రులకు చదివించాలని ఆశ. కాని ఆర్థిక సమస్య వారి కోరికలని, ఆశలని అణచివేస్తూంది. అలాటి పరిస్థితులలో చాలామంది

చదువు మానేస్తూ వుంటారు. అలా మానేసే బదులు తమ చదువుకు కావ ల్సిన డబ్బు సంపాదించుకుంటూ కూడా చదువుకోవచ్చు. తమకంటే చిన్న పిల్లలకి ట్యూషన్స్ చెప్తూ, చిన్న సంస్థలలో పార్ట్‌టైమ్ జాబ్ చేస్తూ, అబ్బాయిలైతే న్యూస్‌పేపరు యిళ్ళకు వేస్తూ, పాలప్యాకెట్స్ యిస్తూ, యిలా చాలా రకాలుగా చదువు కొనసాగించవచ్చు. దీన్ని విదేశాల్లో బాగా గమనించవచ్చు. మనసుంటే మార్గాలనేకం. అంతేకాని డబ్బులేదని, తమ భవిష్యత్తును పాడుచేసుకోనక్కర్లేదు, ఆత్మస్థయిర్యంతో సాధించవచ్చు.

ఇంకో ముఖ్య సమస్య– అబ్బాయి, అమ్మాయి అనే తేడాలవలన చాలామంది పెద్దవాళ్ళు అమ్మాయిలని చదివించే విషయానికి మద్దతునివ్వరు. "అది చదివి ఉద్యోగాలు చేయాలా, ఊళ్ళేలాలా? ఎంత డబ్బుపోసి చది వించినా అది సంపాదిస్తే అత్తవాళ్ళకే కాని మాకేంటి?" అంటూ ఆడపిల్ల లను చదువుకోవడానికి ప్రోత్సాహాన్నివ్వరు. మరికొందరు ఆ డబ్బుతో (అమ్మాయిని చదివించే డబ్బుతో) అబ్బాయిని చదివిస్తే తమ నాదుకుంటా డని, అబ్బాయి కాబట్టి వాడే చదువుకోవాలని అనుకుంటారు. కాని చదువ నేది ప్రతి మనిషి జీవితానికి చాలా అవసరం. ఆ విషయంలో 'సెక్సువల్ యిండిఫరెన్సెస్' అనవసరం. అది ఆడా, మగా యిద్దరికీ కావాల్సినదే. చదువు ఉద్యోగానికి మాత్రమే పనికివచ్చే దారికాదు. అది విజ్ఞానానికి అజ్ఞా నానికి మధ్య వారధి. కెరీర్‌కి అర్థం 'వృత్తి' అనే కాదు. 'భవిష్యత్తు' అని కూడా. భవిష్యత్తు చక్కగా వుండటం స్త్రీ, పురుషులకిద్దరికీ అవసరమే. నేటి సమాజంలో స్త్రీకి చదువు చాలా అవసరం. ఎన్నో సమస్యలను తనకు తానే పరిష్కరించుకోగల్గుతుంది. తన కాళ్ళపై తాను నిలబడి, ఎటువంటి పరిస్థితులలోనైనా వ్యక్తిత్వంతో జీవించగల్గుతుంది. ఇటువంటి సమస్యను ఎదుర్కొనే ఆడపిల్లలు, పెద్దవాళ్ళకి నచ్చజెప్పి విద్య ఆవశ్యకతను తెలిపి వారి భావాలను మార్చాలి. తన భవిష్యత్తుకు సక్రమమైన దారి ఏర్ప రచుకోవాలి. అంతేకాని వారి భావాలనే తాము కూడా జీర్ణించుకొని 'ఆడ పిల్లలకు చదువెందుకులే' అనుకుంటూ బ్రతికెయ్యకూడదు.

మనిషి జీవితంలో వర్తమానంకంటే భవిష్యత్తుకు విలువ ఎక్కువ. ఆ భవిష్యత్తుకు పునాదిలాంటి వర్తమానాన్ని సక్రమంగా ప్లాన్ చేసు

కోవాలి. తమ ఆలోచనలకి, అభిరుచులకి, హాబీలకి అనువైన కెరీర్‌ని, ఒక గమ్యాన్ని ఎంచుకొని దానికోసం కృషి చేయాలి. దాన్ని మనం సాధించగల్గుతామో లేదో యిన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్‌తో బాధపడకుండా, ధైర్యంతో సాధించాలి. దానికి ప్లానింగ్ చాలా అవసరం! ఎటుపడితే అటు వెళ్ళి గమ్యం చేరడంకన్నా, ఒక నిర్దిష్టమైన మార్గాన్ని ఎంచుకోవడం శ్రేయస్కరం.

ఇకపోతే కెరీర్ అంటే చదువు ఒక్కటే అనే దురభిప్రాయంతో చాలామంది వుంటారు. ఆ ఉద్దేశ్యంతోనే చాలామంది పెద్దవాళ్ళు పిల్లలను మిగతా ఏ విషయాల జోలికి వెళ్ళనివ్వరు.

హై జంప్ అంటే యిష్టమున్న పిల్లవాడ్ని "ఏమిటా గెంతులు చదువు మానేసి, ఆ ఆటలేమిటి" అంటూ కేకలేస్తూ వాళ్ళ అభిరుచుల్ని ఆదిలోనే తుంచేస్తూ వుంటారు. అలా చేయటం మంచిది కాదు. చదువు జీవితానికి అవసరం. అంతేకాని, చదువే జీవితానికి పరమావధి కాదు.

చదువులోనే కాకుండా ఇంకా ఎన్నో రంగాలలో రాణించవచ్చు. పేరు ప్రఖ్యాతులు సంపాదించవచ్చు. ప్రపంచమంతా మెచ్చుకునే 'రవివర్మ' పోస్ట్‌గ్రాడ్యుయేటేమి కాదు. బోల్డెంత డబ్బు, హోదా వుండే యాక్టర్లెంతమందో గ్రాడ్యుయేట్స్ కాదు. వారి కెరీర్ కేమీ లోపం లేదుకదా! మాండలిన్ శ్రీనివాస్ తండ్రి, సచిన్ టెండూల్కర్ తండ్రి విశ్వనాథ్ ఆనంద్ తండ్రి-ఇదే విధంగా తమ కొడుకుల్ని నిర్దేశించి వుంటే మనదేశం గొప్ప వ్యక్తుల్ని కోల్పోయి వుండేది కదా!

చిన్నప్పుడు బొమ్మలేసే పిల్లల్ని "ఏమిటా పిచ్చిగీతలు, ఇల్లంతా పాడుచేస్తున్నావు" అని కేకలేసి నిరుత్సాహపరిచేకంటే, డ్రాయింగ్‌లో అతని యిష్టాన్ని ప్రోత్సహించి అభివృద్ధి పరచటం మేలు అలా చేస్తే భవిష్యత్తులో అతనో మంచి కళాకారుడయ్యే అవకాశాలున్నాయి కదా! అలా కాకుండా వాడ్ని ఎంతసేపూ కేకలేసి నిరుత్సాహపరిస్తే ఏం బావుంటుంది? ఇష్టం లేకుండా అమృతంకంటే, ఇష్టంతో విషం త్రాగటంవలన ఉపయోగము ఎక్కువ.

భవిష్యత్తుకు బంగారు బాట వేసుకోటానికి ఎమ్మేలు, బియ్యేలు

చదవటం ఒక్కటే మార్గం కాదు. మనకు వచ్చిన, నచ్చిన ఏ విద్యతో అయినా పైకి రావచ్చు. ఎన్నో కష్టాలుపడి, ఇల్లు తాకట్టు పెట్టుకొని చదివిన ఒక పోస్ట్‌గ్రాడ్యుయేట్ కంటే, టెన్త్ చదివి టి.వి.లో, వాచ్చీలో రిపేరింగ్ చేసుకొని బ్రతికే వ్యక్తే నిశ్చింతగా జీవిస్తాడు. దేని ప్రత్యేకత దానిది అన్నట్లుగా ఏ విద్యతోనయినా, ఏ వృత్తితోనయినా మన జీవితాలకు సక్రమమయిన గమ్యం ఏర్పరచుకోవచ్చు.

మరికొంతమంది పెద్దలు తన అభిరుచులను, హాబీలనూ పిల్లలపై రుద్దటానికి ప్రయత్నిస్తారు. నాకు తెలిసిన ఒకావిడకు డాన్స్ అంటే ఇష్టం. అది వాళ్ళ అమ్మాయికి నేర్పించాలని చాలా పట్టుదలగా (నేర్చుకోవల్సిన అమ్మాయికి లేనంత పట్టుదలగా) ప్రయత్నిస్తుంది. ప్రొద్దున్నే ఐదుగంటలకే లేపి, సాధన చేయించి ఆ పిల్లని స్వీట్స్ అవి తిననీయకుండా, ఇంకా ఏదేదో చేసి కష్టపెట్టి డాన్స్ నేర్పిస్తూ వుంటుంది. బక్కపల్చగా వుండే ఆ అమ్మాయి అతి కష్టంపైన కాళ్ళీడుస్తూ నడుస్తూ వుంటుంది. (బహుశా ఆ అమ్మాయి ఎప్పటికీ మంచి డాన్సర్ కాలేదేమో) అటువంటి పరిస్థితుల్లో ఆ పాప సమయాన్ని వృధాచేసి, ఆడుకునే పాప స్వేచ్ఛ హరించేసి, ఇష్టం లేనిపని బలవంతంగా చేయించటం వలన, ఆ తల్లికి వరిగే లాభమేమిటి? ఏమీ వుండదు. తన యిష్టాన్ని కూతురు ద్వారా తీర్చుకుంటున్నాను అన్న సంతృప్తి తప్ప, పాప భవిష్యత్తుకు ఏమీ ప్రయోజనం వుండదు. సమయం శ్రమ వృధా. మరికొంతమంది పెద్దలు, కొన్నిరోజులు డాన్సో, సంగీతమో నేర్పిస్తారు. అది సమాజంలో స్టేటస్ కోసం. "మా అమ్మాయికి పళ్ళెంపై డాన్స్ చేసేవరకూ నేర్పించాం. మా అమ్మాయి కృతులవరకు పాడగలదు" అని చెప్తూ వుంటారు. ఆ తర్వాత-డాన్స్ మానేసిన ఆ అమ్మాయికి వళ్ళు రావటం, నేర్పించిన దానికి డబ్బు వృధా అవటంతప్ప లాభమేమిటి? అలా కాకుండా డాన్స్‌ని, లేదా సంగీతాన్ని తన కెరీర్‌గా మలచుకొనే ఉద్దేశ్యం వుంటే సాధన చేసినా ఫలితం. ఏ ఆర్ట్ అయినా కెరీర్‌గా కాకుండా కాలక్షేపానికో, సరదాకో అయితే శ్రమ, అమూల్యమయిన కాలం దండగ. అందుకే ప్రతి వ్యక్తి తన కెరీర్‌ని, తనే నిర్ణయించుకొని దాని కోసం సరయిన తీరులో కృషి చేయాలి.

## శ్రీపాద శ్రీనివాస్, బొబ్బిలి

ప్ర : నావొక ఓంత సమస్య సార్! నేను స్వతహాగా పదిమందికి సేవ చేయాలనే తలంపు కలవాడిని. 'మరణ మృదంగం' సినిమా షూటింగ్ సమయంలో వాహినీ స్టూడియోలో మీరు డైలాగ్స్ వ్రాసుకుంటున్నప్పుడు మీకు నేను ఒక కరపత్రం కూడా యిచ్చాను. గుర్తుకొచ్చే వుంటుంది. నేను బొబ్బిలిలో చిరంజీవి ఫాన్స్ స్థాపించి నేటికి తొమ్మిది సంవత్సరాలు కావస్తూంది. నా పాకెట్‌మనీ (నెలకు మూడు వందల రూపాయలు. సంవత్సరానికి, 3,600/- రూపాయలు)తో చిరంజీవిగారి చిత్రం రిలీజు రోజు కోలాహలం, రిక్షా కార్మికులకు బట్టలు పంచటం, అన్నదానాలు, వేసవిలో మా అసోసియేషన్ తరఫున చలివేంద్రాలు నిర్వహించడం....ఉత్తమ విద్యార్థికి చిరంజీవిగారి పేరున ప్రతి సంవత్సరం 750/- బహుమతి ప్రధానంలాంటి కార్యక్రమాలు నిర్వహిస్తున్నాను. నేను ప్రతి సంవత్సరమూ ఆరువందల రూపాయలు ఖర్చుపెట్టి చిరంజీవిగారి కోసం మద్రాసు వస్తూనే వున్నాను. నాకు చిరంజీవిగారి సోదరుడు ప్లస్ చిరంజీవి పి. ఎ. అయిన శ్రీ చిక్కాల దుర్గబాబు, మేకప్‌మాన్ శివగారికి నేను బాగా తెలుసు. బొబ్బిలిలోని మా 'చిరంజీవి ఫాన్స్' సేవా కార్యక్రమాలు చిరంజీవిగారికి కూడా స్వయంగా చాలాసార్లు తెలిపాను. కానీ ఆయన వాటిని పట్టించుకోలేదు.

చిరంజీవి సోదరుడు శ్రీ నాగేంద్రబాబుగారి వివాహమునకు, నాకు ఆహ్వానం అందింది. ఆరువందల యాభై రూపాయలతో రాధాకృష్ణుల పాలరాతి విగ్రహం కొని, విజయా శేషమహల్‌లో వివాహ సందర్భముగా ప్రజెంట్ చేశాను. కనీసం ఆ పార్శిల్‌ని విప్పకుండా ప్రక్కన పడేశారు. మా ఊరు మద్రాస్‌కి 987 కి.మీ. దూరంలో వుంది. ఒక రోజంతా ప్రయాణంచేసి, ట్రిప్పుకు అంతంత డబ్బులు ఖర్చుచేసి, చిరంజీవిగారిని కలిసి మా ఫాన్స్ సేవా కార్యక్రమాలు వివరించాలని చూస్తే, ఆయన ముభావంగా ఉంటారు. దాన్ని చూసి మేము ఎంత బాధపడతామో ఒక్కసారి ఆలోచించండి.

ఖైదీ నెంబర్ 786 షూటింగ్‌లో మాత్రం నా చేతిమీద వున్న

'చిరంజీవి' అన్న పచ్చబొట్టు చూసి "ఇంకెప్పుడూ అలాంటి పిచ్చిపనులు చేయకు. నువ్వు బాధపడితే నేను బాధపడినట్లే" అని ఆయన అన్నారు. ఇంతకీ నా సమస్య ఏమిటంటే '98 జనవరిలో చిరంజీవిగారి జన్మదినం సందర్భంగా బొబ్బిలిలో మా ఫాన్స్ తరపున ఉచిత నేత్ర శిబిరం నిర్వహించి వందమంది కంటి రోగులకు ఆపరేషన్లు చేయించాలని సంకల్పించాము. దీనికిగాను విశాఖపట్టణం నుంచి ఇద్దరు కంటి నిపుణులను రప్పించడానికి, రోగులకు కళ్ళద్దాలు, మందులు, మూడు రోజులపాటు భోజన వసతి సౌకర్యాల పర్యవేక్షణకు సుమారు పాతికవేల రూపాయల వరకూ అవుతుంది. మావద్ద కేవలం పదివేలు మాత్రమే వున్నాయి. దీనిపై చిరంజీవిగారు ఎలాంటి సలహా యిస్తారోనని ఆశగా ఎదురు చూస్తున్నాము. చిరంజీవిగారితో ఈ విషయంపై పర్సనల్‌గా మాట్లాడాలని వుంది. ఆ అవకాశం మీరు నాకు కల్పించగలరా? అలా కుదరకపోతే మీరీ విషయాన్ని చిరంజీవిగారికి తెలియచేయగలరా?

జ : నా ఉద్దేశ్యంలో చిరంజీవికి ఇలాంటి అబ్లిగేషన్స్ నెలకు రెండునుంచి మూడువేలవరకూ వస్తూ వుంటాయి. సమస్యను మీవేపునుంచే ఆలోచించారు. కాని, ఎదుటివేపునుంచి ఆలోచించలేదు. ఇదే సమస్య మీలాంటి చాలామందికి వస్తూ వుంటుంది. మీరింత కష్టపడి వ్రాస్తే చిరంజీవి జవాబు ఎందుకు వ్రాయరు? అన్నారు. అతనికి రోజూ కనీసం వంద ఉత్తరాలు వస్తే ఒక్కోదానికి జవాబు రాయడానికి మూడు నిమిషాలు తీసుకుంటే వంద జవాబులుకు రాయడానికి అయిదు గంటలు పడుతుంది. అలా ఆలోచించరు మీరు. రెండు నిమిషాలే కదా జవాబు ఎందుకు వ్రాయడు అని ఆలోచిస్తారు.

మీరు చిరంజీవి అభిమానా? బాలకృష్ణ అభిమానా? నాగార్జున అభిమానా? అన్న విషయం ప్రక్కన పెడితే చిరంజీవినే ఓ స్ఫూర్తిగా తీసుకుని సేవా కార్యక్రమాలు నిర్వహిస్తున్నాను అని వ్రాశారు. దేవుడి పేరుతో చాలామంది భక్తులుకూడా ఈ సేవా కార్యక్రమాలు నిర్వహించడం మన అందరికీ తెలిసిందే. అయితే ఆ భక్తులెవ్వరూ ఆ కార్యక్రమాలన్నింటికి దేవుడినుంచి సహాయం పొందాలనుకోరు.

గంగలో మునిగితే తమ పాపాలన్నీ పోతాయని మునుగుతారు. ఇది నిజమా? భ్రమా? సమాజంలో ఒక అమ్మాయి ఒక అబ్బాయితో స్నేహం చేయకూడదా? వారిద్దరి మధ్య కేవలం స్నేహమే వున్నా అక్రమసంబంధం వుందని ఎందుకు భావిస్తారు? కొద్దిరోజులలో దేవుడు భూమిపై సాక్షాత్కారిస్తాడు అని అంటున్నారు. నిజమా? అబద్ధమా? మనుషులకు స్వార్థం, కోపం, ప్రతీకారం మొదలైనవి ఎందుకు వస్తాయి?

నాకు అందరితోనూ మాట్లాడాలని వుంటుంది. కానీ నేను ఎవ్వరితోనూ మాట్లాడలేను. భయంగా వుంటుంది. నేను నా మనస్సులో వుండే భావాలను ఎవ్వరితోనూ ఖచ్చితముగా చెప్పలేను. మొహమాటపడతాను. ఎవరితోనైనా నా అభిప్రాయాలు చెప్పి, దానిపై వారి అభిప్రాయాలు తెలుసుకోవాలనుకుంటాను. తీరా వారి దగ్గరకు వెళ్ళాక నేను కనుక్కోవలసిన విషయాలు మరచిపోతాను. అప్పుడు నాలో నాకు తెలియకుండానే భయం ప్రవేశిస్తుంది. నిశ్శబ్దంగా వుండిపోతాను. నేను ఒకసారి నాకు 'మెంటల్' అనుకుంటాను. ఒకవేళ ఇది ఏదైనా జబ్బా? తెలియచేయండి.

జ : వేదాంతసారాన్ని బోధించడానికి వచ్చే మత ప్రవక్తలను, బాబాల్ని అడిగినట్లు మీరు ఒక పది పదిహేను అంతర్జాతీయ, సామాజిక, సాంఘిక, మానసిక సమస్యలన్నీ కలిపి అడిగారు. ఒక్కొక్క ప్రశ్నకు సమాధానం చెప్పడానికి దాదాపు ఒక్కొక్క పేజి పడుతుంది. కాబట్టి వాటిని వదిలేసి, మీ సమస్య గురించి మాట్లాడుకుందాం. మీకు అందరితోనూ మాట్లాడాలని వుంది. గానీ భయం అని వ్రాశారు. మీరు పుస్తకాల్ని స్నేహితులుగా చేసుకుంటే మీ ఇంట్రావర్షన్-రికర్వ్‌డ్‌నెస్‌గా మారి అది మీ క్వాలిఫికేషను అవుతుంది.

మాట్లాడతేక మాట్లాడలేకపోవడం వేరు. మాట్లాడగలిగి మాట్లాడకపోవడం వేరు. మొదటిదాన్ని 'ఇంట్రావర్షన్' అంటారు. రెండోదాన్ని 'రిజర్వ్‌డ్‌నెస్' అంటారు. మీరు యీ రెండోది డెవలప్ చేసుకోండి.

మీకు మెంటల్ ఏమీలేదు. మానసికంగా మంచి ఆరోగ్యంగానే వున్నారు. కాబట్టి 'నాకు పిచ్చా?' అని మీరు ఎక్కువగా ఆలోచించుకోకండి. పిచ్చి ఎక్కగలదు.

## జి. శ్రీనివాసులు ఆచార్య, హైదరాబాద్

ప్ర : నేను ఎన్నో పనులు చేయాలి అని అనుకుంటాను. కానీ ఏదీ ఆచరణలో పెట్టలేను. టైమ్ అంతా వృధాగా గడిపేస్తున్నాను. ఇలా ఏ పని అయినా వాయిదాలు వేస్తే, ఆ తరువాత బాధపడవలసి వస్తుందని నాకు తెలుసు. ఇంకోసారి యీ తప్పు చేయకూడదు అని అనుకుంటాను. కానీ అదే తప్పు తిరిగి చేస్తాను. జపాన్‌వాళ్ళ మాదిరిగా ఆపని చేయాలని ఎన్నిసార్లు అనుకున్నానో నాకు తెలుసు. కానీ ప్చ్! ఎంత చిన్న పని అయినా ఆఖరికి మార్కెట్‌నుంచి కూరగాయలు తేవటం అయినాసరే సరిగ్గా చేయలేను. పదిమందిలో మాట్లాడాలంటే భయం. డేల్‌కార్నగీ పుస్తకాలు, 'ఇంప్రూవ్ యువర్ పర్సనాలిటీ' లాంటి పుస్తకాలు చాలా చదివాను. కానీ ఆచరణలో ఏదీ పెట్టలేకపోయాను. నా ఈ సమస్యకు మీరే ఒక పరిష్కారం చెప్పగలరు.

జ : మీరు మీ ప్రశ్నలో రెండు సమస్యలను చెప్పారు మొదటిది-పనులు వాయిదా వేయడం గురించి. రెండు-పదిమందిలో మాట్లాడాలంటే మీకున్న భయం గురించి. మీ రెండో సమస్య గురించి ఇప్పటికే యీ శీర్షికలో యింతకుముందు వివరించాను.

మీరు పనులు వాయిదా వేయడం గురించి చర్చించవలసివస్తే డేల్ కార్నగీ పుస్తకాలే కాకుండా టేలర్ 'టైమ్ మానేజ్‌మెంట్' చదవండి. ఏ పని ఎప్పుడు ఎలా చేయాలన్నది దానిలో వివరంగా వ్రాయబడి వుంది. మనిషి జీవితంలో రెండు రకాల అభిరుచులు వుంటాయి. ఒకటి మనిషిని కష్టపెట్టే అభిరుచులు, రెండు సంతోషపెట్టేవి. దురదృష్టవశాత్తు సంతోష పెట్టే అభిరుచులేకానీ, ప్రొడక్టివ్ అభిరుచులు కావు. ఉదాహరణకు టి.వి. చూడటం, ఫ్రెండ్స్‌తో కాలం గడపటం, క్రికెట్ మ్యాచ్‌ల కెళ్ళటం.... లాంటివి మత్తుని కలిగిస్తాయి. వీటికి అలవాటుపడితే బయటపడటం కష్టం. అందుకని నిజంగా కష్టపడేవారు, వారి టైమ్‌లో ఎక్కువ భాగం వీటికి కేటాయించకుండా ప్లాన్ చేసుకుంటారు. ఇలా కష్టపడగా, కష్టపడగా ఒక దశ కొచ్చాక కష్టపడటంలో సంతృప్తి, సంతోషం లభిస్తుంది. ఆ సంతృప్తి లభించిన వారందరూ జీవితంలో పైకి వచ్చినవారై వుంటారు. ఉదాహర

ణకు రచయిత రాయడం ద్వారా సంతోషం అనుభవిస్తాడు. అలా సంతోషం పొందటం ప్రారంభమయ్యాక స్నేహితులు పార్టీకి పిలిచినా లేదా టి. వి. చూడాలన్నా.... అది కేవలం తన రచనలకు దోహదకారి అయ్యే చర్య గానే చూస్తాడు తప్ప ఎక్కువకాలం అలాంటి పనులకు కేటాయించి ఆనందం పొందడానికి ప్రయత్నించడు. గెలుపు ఇచ్చిన అంత ఆనందాన్ని ఇలాంటి చౌకబారు పనులు ఇవ్వవు అనే స్టేజీకి వచ్చిన మనిషి ఇంతకు ముందే చెప్పినట్లు గొప్పవాడై వుంటాడు.

బి. రాము, సారపాక

ప్ర : నా వయసు ఇరవై సంవత్సరాలు ఎత్తు ఐదుపాయింట్ ఆరు. నా పర్సనాలిటీ బాగానే వుంటుంది. నాకు సినిమాలలో నటించాలని వుంది. కొద్దిగా నాటికలలో నటించిన అనుభవం కూడా వుంది. కానీ ఏ ఇన్స్టి ట్యూట్లోనూ కోచింగ్ తీసుకోలేదు. పెద్ద అందగాడినేమి కాకపోయినా మీడియంగా వుంటాను. డబ్బు ఖర్చు పెట్టడానికి, ఆర్థికముగా బీదవాణ్ణి. సినీ పరిశ్రమలో పరిచయస్తులు ఎవరూ లేరు. ఇప్పటికి రెండువేల రూపా యలు ఖర్చుపెట్టి హైదరాబాద్ వారి (....ఎడిట్) ఫిలింస్ సంస్థ తీసిన "....ఎడిట్" అనే టి. వి. సింగిల్ ఎపిసోడ్లో నటించాను. ప్రస్తుతము ప్రతిరోజూ 'నూతన నటీనటులు కావలెను' అనే ప్రకటన కోసం పేపర్లు చూస్తున్నాను. ఎవరయినా మంచి ప్రొడ్యూసర్ని కలుద్దామనుకుంటున్నాను ఎలా వుంటుంది? ఒక్కోసారి ఆకాశానికి నిచ్చెనలు వేస్తున్నానేమో అని భయంగా వుంది. అసలు ఈ నా జీవితాశయము నెరవేరుతుందా? అందుకు మీ సహాయం ఏమయినా వుంటుందా?

జ : ఆంధ్రదేశంలో సుమారు ఐదులక్షలమంది సినిమా పరిశ్రమలో అడుగు పెట్టాలనుకునేవాళ్ళు వున్నారు. కానీ ప్రస్తుతం కేవలం ఐదుమంది హీరోలు, ఐదుమంది విలన్లు, ఐదుమంది కమేడియన్లు మాత్రమే సినీరం గాన్ని ఏలుతున్నారు. మీరు. టి.వి.లో సింగిల్ ఎపిసోడ్లో నటించానన్నారు. ఆ నటనను చూసి ఏ ప్రొడ్యూసరు మిమ్మల్ని బుక్ చేసుకోడు. నటీనటులు కావాలి అని ప్రకటనలిస్తున్న కుక్కగొడుగుల్లాంటి సంస్థలెన్నో ఈ మధ్య పుట్టుకొస్తున్నాయి. ఇవన్నీ మీ ఆశను క్యాష్ చేసుకుని మనుగడ సాగిం

చేవే తప్ప మిమ్మల్ని పైకి తేవు.... తేలేవు. మీరు నటుడిగా పైకి రావా లంటే మద్రాస్ వెళ్ళి ప్రొడ్యూసర్లు, డైరెక్టర్లు మొదలయిన వాళ్ళ చుట్టూ తిరిగి వాళ్ళను ఇంప్రెస్ చెయ్యగలగాలి. అందుకు డబ్బు, స్టామినా వుండాలి. ప్రస్తుతం మీరున్న పరిస్థితుల్లో అది సాధ్యమా? ఆలోచించండి. మద్రాసులో ఉద్యోగం సంపాదించుకుని ఈ ప్రయత్నం చెయ్యవచ్చు. మీరు నటించిన సింగిల్ ఎపిసోడ్ గురించి ఎంక్వయిరీ చేశాను. ఆ పేరు గలది ఏదీ దూరదర్శన్‌లో రిజిస్టర్ కాబడలేదు. బహుశా కెమేరాలో క్యాసెట్ పెట్టకుండా, షూటింగ్ జరిపినట్టు మిమ్మల్ని మోసంచేసి వుంటారు. అదీగాక దూరదర్శన్‌లో ప్రసారం అవ్వాలంటే మామూలుగా పెళ్ళిళ్ళకి వాడే క్యాసెట్ వాడరు. దానికి వేరే స్పెషల్ క్యాసెట్స్ వుంటాయి. ఖరీదయినవి. మీరు ఆ విధంగా కూడా మోసపోయి వుండ వచ్చు. ఇదే జరిగిన పక్షంలో మీరు నటించిన ఎపిసోడ్‌ని వి.సి.ఆర్.లో చూపించి మీ దగ్గర డబ్బులు వసూలుచేసి వుంటారు వాళ్ళు.

**కిరణ్, హైదరాబాద్**

ప్ర : సర్! నేను ఇంటర్ చదువుతున్నాను. నాకు గత పరీక్షల్లో 86 శాతం మార్కులు వచ్చాయి. నేను ఒక సంవత్సరం క్రితం ఒక అబ్బాయి వలలో పడిపోయాను. తరువాత అతని చెడు తిరుగుళ్ళు, అల వాట్లు అన్నీ తెలుసుకొన్నాను. అతనికి నచ్చచెప్పడానికి చూశాను విన లేదు. పైగా నా చదువు కూడా దెబ్బతినడం మొదలయ్యింది. దాంతో అతనితో మాట్లాడటం మానేశాను. వాడి దగ్గర నేను వ్రాసిన ఉత్తరాలు మూడు వున్నాయి. వాటితో వాడేదో చేస్తాడనే భయం కాస్త వుంది. కానీ నామీద పూర్తి నమ్మకం వుంచిన నా తల్లిదండ్రులను మోసం చేశాను అని నాకు మనశ్శాంతి లేకుండా పోయింది. ఇది జరిగి ఏడు నెలలు అవుతుంది. ఈ మధ్యకాలంలో మా యింటి ముందు వున్న వ్యక్తి ఒకరు, నాతో పరి చయం పెంచుకోవడానికి ప్రయత్నించాడు. చివరకు మాట్లాడాడు. క్రితం అనుభవం జరిగి వుండటంతో ఇతన్ని డైరెక్ట్‌గా అడిగేశాను. 'నామీద' అతని అభిప్రాయం చెప్పమని, దాంతో అతని ముఖం రంగులు మారింది. ఎక్కడ లేని సిన్సియారిటీ అతనికి వచ్చి యిలాంటి వాటివల్ల కెరీర్ పోతుం

దని అవీ ఇవీ చెప్పాడు. అంటే ఈ మగవాళ్ళు వూరికే ఆడపిల్లలు మాట్లాడినంత సేపు మాట్లాడి ఎంజాయ్‌చేసి తరువాత తమ దారి తాము చూసుకొంటారా?

ఈ ఆలోచనలతో చదువుమీద అసలు కాన్‌సెంట్రేట్ చేయలేక పోతున్నాను. ఇదివరకు చదువుతప్ప వేరే లోకం వుండేదికాదు. ఈ ఒక్క సంవత్సరం నా జీవితాన్ని పూర్తిగా అల్లకల్లోలం చేసేసింది. ఇప్పుడు ఆ మగ పురుగులవల్ల నాకీ కర్మ పట్టింది. (నా తప్పు వుంది. ఒప్పుకొంటాను.) చర్చిలో ఫాదర్‌కు చెప్పుకున్నట్లు మీకు నా గురించి అంతా చెప్పుకున్నాను. మంచిగా చదువుకొనే కెపాసిటీ, అన్నీ వున్న నేను పూర్తిగా మారగలనా? నేను మళ్ళీ ఆ ముందు కిరణ్‌ని అవ్వగలనా?

జ : "మగవాళ్ళు వూరికే ఆడపిల్లలు మాట్లాడినంత సేపు మాట్లాడి, ఎంజాయ్‌చేసి తమ దోవ తాము చూసుకొంటారా? నిజాయితీగా ప్రేమించి పెళ్ళి చేసుకొంటారా....?" అనే ఆలోచనలు ఇంటర్ చదివే సమయంలో ముఖ్యంగా ఈ వయసులో అనవసరం.

బాల్యంనుండి యవ్వనంవైపు వెళ్ళేటప్పుడు తనతో అప్పటివరకూ స్నేహితుల్లా వున్న తల్లీతండ్రుల్నీ, మిగిలిన కుటుంబసభ్యుల్నీ వదిలి కొత్తరకం స్నేహం, కొత్తరకం గుర్తింపుని పిల్లలు కోరుకుంటారు. సాధారణంగా ఆ టైమ్‌లోనే యిలాంటి పరిచయాలు పెరుగుతూ వుంటాయి. మీరు ఈ రకం ప్రేమనుండి త్వరగా బయటపడ్డారు. జనరల్‌గా ప్రేమలో మోసగించబడ్డారు. ఓటమినుంచి బయటపడటానికి యింకో స్నేహం సంపాదించుకుని తమమీద తాము నమ్మకం పెంచుకుంటారు. ఈ తరహా మనస్తత్వం గురించి 'లేడీస్ హాస్టల్' అనే నవల్లో క్లియర్‌గా వ్రాశాను. అలా మీరు రెండో అబ్బాయితో స్నేహం చేశారు. పోతే మీకు కలిగిన మొదటి అనుభవం దృష్ట్యా మీరు ముందే జాగ్రత్తపడ్డారు. ఓ రకంగా యింత చిన్న వయస్సులో ఇన్ని అనుభవాలను పొందటం, మీరు మానసికంగా పరిపక్వత పొందటానికి సహాయపడింది.

ఇక ఉత్తరాల విషయమంటారా? సాధారణంగా ఈ తరహా కుర్ర వాళ్ళు-మీరు ఉత్తరాల గురించి ఎంత భయపడ్డారో- అలాగే వాటిని బహి

ర్గత పరచడానికి వాళ్ళు భయపడతారు. కాబట్టి వాటి విషయం మరిచి పోండి.

"నా మీద పూర్తి నమ్మకం వుంచిన నా తల్లిదండ్రులను మోసం చేశానే అని నాకు మనశ్శాంతి లేకుండాపోయింది" అని వ్రాశారు. మీ పేరెంట్స్ మీమీద నమ్మకముంచినది మీ ప్రేమపట్లకాదు. మంచిమార్కులు తెచ్చుకునే వాళ్ళ కూతురి వ్యక్తిత్వం మీద. కాబట్టి పిచ్చి పిచ్చి ఆలోచనలు దగ్గరకు రానివ్వక మంచి మార్కులు తెచ్చుకొని 'మీ వాళ్ళ నమ్మకాని'కి న్యాయం చేకూర్చండి.

"మగ పురుగులు.... నా ఖర్మ.... నన్ను నేను లోకువ చేసు కొన్నాను" అంటూ వ్రాశారు. ప్రతి మనిషికి ఒక స్టేజీ వచ్చాక తల్లి దండ్రుల పరిధి నుంచి బయటపడి తనని గుర్తించే యింకొక స్నేహం కావాలనిపిస్తుంది. అని ముందే చెప్పడం జరిగింది కదా? దానికే మన వ్యవస్థ 'పెళ్ళి' అని ఒక కట్టుబాటు పెట్టింది. కాబట్టి చదువు పూర్తిఅయి పెళ్ళి చేసుకునే వయస్సు వచ్చేవరకూ అప్రస్తుత విషయాలు (అంటే ఈ మగవాళ్ళంతా ఇంతేనని, కేవలం ఎంజాయ్‌మెంట్ కోసమే ఆడవారితో స్నేహం చేస్తారు....వగయిరాలు) ఆలోచించకండి. అలా కాకుండా మీరు ఈ తరహా ఆలోచనతోనే కాలాన్ని గడిపితే భవిష్యత్తులో మీ వివాహం అయ్యాక కూడా అసంతృప్తి మీలో అలాగే వుంటుంది. చదువుమీద కాన్‌సన్‌ట్రేట్ చేస్తే-అనవసర విషయాలకు మీరు ప్రాముఖ్యత ఇవ్వడం తగ్గించి చదువుకు సంబంధించిన అంశాలు ఆలోచించడం ప్రారంభిస్తారు. ఇంటిలిజెంట్ కాబట్టి చదువులో మంచి ఫలితాలు సాధించగలరని నా ప్రగాఢ నమ్మకం.

**రాము, ఆస్పరి**

ప్ర : నా దగ్గర కొన్ని రచనలు వున్నాయి. వాటిని పోస్టులో పంపితే నిర్మాతగానీ, ఎడిటర్‌గానీ కాపీ చేసుకొనే ప్రమాదం వుంది కదా! నా ఫ్రెండ్ అంటాడు- 'ఎవరయినా గెజిటెడ్ ఆఫీసర్‌చేత ఈ రచనలు నీవేనని సర్టిఫై చేయించు' అని! ఇది సరయిన పద్ధతేనా?

జ: నిశ్చయంగా కాదు. ఎందుకంటే సర్టిఫై చేస్తూ గెజిటెడ్ ఆఫీసర్ ఆ రచనని గబగబా చదివేసి తరువాత తానే కాపీ కొట్టవచ్చు కదా? కాబట్టి ఈ అనుమానాలన్నీ వదలి మంచి రచన చేయండి. నిజంగా మీ రచన బావుంటే, మీకే డబ్బిచ్చి, మీచేతే తమకు కావల్సిన విధంగా మరింత బాగా వ్రాయించుకుంటారు నిర్మాతలు. నిర్మాతలుగాని, దర్శకులుగానీ సాధారణంగా కథ 'తమది' అని స్క్రీన్‌మీద వేసుకోవడం తక్కువ!

**జి. రాధాకృష్ణ, టి. నగర్**

ప్ర: సార్! నేను చాలా బీదవాడిని. తండ్రిలేడు. పన్నెండు సంవత్సరాలు మా అమ్మ కష్టపడి ఒక ప్రెస్సులో కంపోజిటర్‌గా వుండి నన్ను పెంచింది. ప్రెస్‌లో నిల్చుని ఆవిడ ఆరోగ్యం దెబ్బతింది. ఆపరేషన్ చేయాలని దానికి పదివేలు ఖర్చవుతుందని డాక్టర్లు చెప్పారు. ఖర్చుకి భయపడి, నగలన్నీ తాకట్టు పెట్టి, మందులతో సరిపెట్టాము. కానీ ఆమె యిక పనిచేయలేదు. భారము నామీద పడటంతో పదవ తరగతి చదువుతో ఆపేసి ప్రొద్దున పేపరు వేయడము, పాలు యివ్వటము, తరువాత కొరియర్‌లో పనిచేస్తున్నాను. సాయంత్రంపూట ట్యూషన్స్ చెపుతున్నాను. ఇంత పనిచేసి యింటికొచ్చి యింటిపని కూడా నేనే చేస్తున్నాను. మొత్తం అంతా కలిపి రు. 690/- వస్తుంది. దీంట్లోనే మేము వడ్డీ కట్టాలి. అమ్మకు మందులు కొనాలి. డబ్బు అసలు సరిపోవడంలేదు. ఒక్కొక్కసారి ఆత్మహత్య కూడా చేసుకుందామని అనిపిస్తుంది. మీకింకో విషయం కూడా చెప్పాలి. చిరంజీవిగారు మాకు దూరపు బంధువులవుతారు. ఒకసారి ఆయన ఇంటికెళ్ళి తిరిగొచ్చేశాను. మనసొప్పలేదు. నేనేం చేయను. నాకు అమ్మ తప్ప ఎవ్వరూ లేరు. రాత్రిళ్ళు బాగా దుఃఖం వస్తుంది.

జ: ఆత్మహత్య చేసుకోవటం వల్ల మీ తల్లిని మీరు కష్టాల్లోకి తోసేస్తున్నారు. ఆ విషయం ఆలోచించారా? ఒక అనాథగా ఆమె భావి జీవితం ఎంతో నరకయాతన అనుభవిస్తుంది. మీరు వూహిస్తే ఈ ఆలోచన మీ మనసులోకి రానివ్వరు.

మీరు చాలామంది కుర్రాళ్ళలా కాకుండా బాగా కష్టపడుతున్నారు. ఇంత చిన్న వయసులో మిగతా కుర్రవాళ్ళు ఆనందించే సుఖాలు వదులు

కొని, ఒక కర్తవ్యం నిర్వహిస్తున్నారు. కష్టపడి పనిచేసేవారికి ఎల్లప్పుడూ కష్టాలుండవు. ఏదో అద్భుతం జరుగుతుందని నేననను కాని, మంచి మాత్రం జరుగుతుంది.

మీ ఆత్మాభిమానం మెచ్చుకోతగినది. మీ ఉత్తరాన్ని చిరంజీవికి చూపించాను. మీరు చెప్పినదంతా నిజమైన పక్షంలో తను మీకు తప్పక సహాయం చేస్తానన్నారు. ఇది కేవలం మీకు ఆయన బంధువయినందువల్ల చేస్తున్న సహాయంకాదు, ఒక సమస్యని ఎదుర్కోవడాని కోసం మీరు పడుతున్న శ్రమని, సిన్సియారిటీని చూసి.... కాబట్టి వీలయితే ఆయన్ని మీరు కలుసుకోండి.

## ఎన్. శుభ, పిఠాపురం

ప్ర: నాకు లెక్కలంటే భయం. ఎంత చేసినా గుర్తుంచుకోలేను. ఎంతోమందిని దీని గురించి అడిగాను. 'ట్రై చెయ్యి' అనేవారేగాని సరయిన మార్గం చూపించినవారు లేరు. ఈ లెక్కల భయాన్ని నేను నాతోటి వారు కొందరిలో కూడా చూశాను. గణితాన్ని సునాయాసంగా భయం లేకుండా చేయడానికి మార్గం చెప్పండి.

జ: పరీక్షలు పాసవటం రెండు రకాలు. విషయాన్ని బట్టీపట్టడం ఒక పద్ధతి. తార్కిక జ్ఞానం ఉపయోగించి సమాధానాన్ని చిన్న చిన్న పాయింట్స్‌గా విడగొట్టి ఆ పాయింట్స్ గుర్తు పెట్టుకొని పరీక్షహాల్లో విశదీకరించటం రెండవ పద్ధతి.

గణితంలో—ఆన్సర్ అనే గమ్యం చేరుకోవటానికి- తార్కికంగా ఆలోచించి (అలా ఆలోచించటానికి మీకు తెలిసిన సూత్రాలను ఉపయోగించుకోవడం) మంచి పద్ధతి. సూత్రాలను మాత్రం రోజు సుప్రభాతం లాగా చదువుకోవలసిందే. జీవితంలో పైకొచ్చినవారు చాలామంది లెక్కలలో మంచి మార్కులు సాధించినవారే.

## కె. పద్మావతి, విజయవాడ

ప్ర: నేను ఐదవ తరగతి నుండి పదవ తరగతి వరకూ రెసిడెన్షియల్ స్కూల్‌లో చదివేదాన్ని. నాకు బయటప్రపంచంలో ఎలాగుండాలో,

అందరితో ఎలా ప్రవర్తించాలో కూడా తెలియదు. మా అక్కయ్య ఒక సార్ యింటికి వెళ్ళి, ట్యూషన్ చెప్పించుకునేది. నేను తోడు వెళ్ళే దాన్ని. ఒకరోజు సార్ నన్ను, "నీవు నన్ను ప్రేమిస్తావా?" అని అడి గారు. నేను సమాధానం చెప్పలేదు. ఆ తరువాత అతను నాతో ఎక్కు వగా మాట్లాడలేదు. నేను బాధపడి అతని ట్యుటోరియల్స్‌కు 'ఐ లవ్వు' అని ఉత్తరం వ్రాశాను. కానీ యిప్పుడు ఏమి చేయాలో తోచటంలేదు. అతను ఓ.కె. చేశాక నాకు అతన్ని ప్రేమించాలని లేదు. అతను నాతో సరిగ్గా వుంటాడనే నమ్మకంలేదు.

నేను శలవుల్లో మా అత్తయ్య ఊరు వెళ్ళాను. మా అత్తయ్య యింట్లో చాలామంది అబ్బాయిలు రూమ్ తీసుకుని వుండేవారు. ఒకరోజు నేను, మా పిన్ని సినిమాకు వెళ్ళాలనుకొన్నాము. నేను చూడాలనుకున్న సినిమా మా పిన్ని చూసింది. అందువల్ల వేరే సినిమాకు వెళ్ళింది. నాతో పాటు రూమ్‌లో ఒకబ్బాయి తోడు వచ్చాడు. నేను ఆ అబ్బాయి సినిమాకు వెళ్ళాము. సినిమాహాలులో ప్రక్క ప్రక్కనే కూర్చున్నాము. అతడు నా చెయ్యి పట్టుకున్నాడు. నేను ఏమీ అనలేకపోయాను. అతడు లెటర్ వ్రాయమని అడ్రస్ యిచ్చాడు. నేను వ్రాస్తానని చెప్పి, వ్రాయలేదు. నేను ఎవరితోనైనా తొందరగా మాట్లాడలేను. వారు నాతో క్లోజ్‌గా మాట్లాడితే నేను మాట్లాడతాను. వారు నన్ను వేరేగా అర్థం చేసుకొంటారు. నాకు ప్రస్తుతం ఎవ్వరినీ ప్రేమించాలని లేదు. హాయిగా చదువుకొని, మంచి ఉద్యోగం వచ్చిన తరువాత ఎవరినైనా ప్రేమించి పెద్దల యిష్టప్రకారం పెళ్ళి చేసుకొందాం అనుకొంటున్నాను. ఏ విషయాన్ని అయినా సూటిగా చెప్పాలంటే ఏం చెయ్యాలి? నేను ఎవరితోనైనా క్లోజ్‌గా వుంటే వారితో కొద్దిరోజుల తరువాత విడిపోతాను. ఎవ్వరితోనూ ఎక్కువరోజులు ఫ్రెండ్ షిప్ చెయ్యలేను. మీరు సలహా యిస్తే నేను తప్పకుండా చదువుకొని మంచి మార్కులతో పాసయి మంచి ఉద్యోగం సంపాదించుకొని, మీ పేరు అందరికీ చెప్పుకొంటాను.

జ : బాగా చదువుకొని మంచి మార్కులతో పాసవటానికి వేరే సలహా ఏముంది? సాధారణంగా ఫ్రెండ్‌షిప్ మొదలయినపుడు మనలోని

మంచి గుణాలే బయట పెట్టుకుంటాము. నెమ్మదిగా లోపాలు తెలుస్తాయి. విడిపోవాలనిపిస్తుంది. కాబట్టి పరిచయమైనాక కొన్నాళ్ళవరకు మీది క్లోజ్ ఫ్రెండ్‌షిప్ అనుకోకపోవటం మంచిది. ప్రతి మనిషికి ఒక 'రెకగ్నిషన్' కావాలని వుంటుంది. ఈ స్నేహాలు అనేవి మనల్ని అవతలవాడు రిక గ్నైజ్ చేస్తున్నాడు అన్న యిగో సాటిస్‌ఫాక్షన్. మీరు అవతలివాళ్ళ దగ్గర గుర్తింపబడాలనే కోరిక వుండి వుండవచ్చు. అందుకే మొదట క్లోజ్‌గా దగ్గరై తరువాత లోపాలు తెలిశాక దూరమైపోతున్నారు. ఇక మీ ట్యూషన్ మాష్టారు విషయానికొస్తే ఇది సినిమాల ప్రభావం-హీరో అడ గ్గానే హీరోయిన్ 'నో' అనడం-యింటర్వెల్ టైమ్‌కి హీరో ప్రేమని ఆమె అంగీకరించటం. ఇదే మీ విషయంలో జరిగింది. ముందు అడగడం ఆ తరువాత మౌనంగా వుండటం వలన అమ్మాయిలే తమను వెదు కుంటూ వస్తారనేది మగవాళ్ళ టెక్నిక్. మీ అక్కయ్యతో ఈ విషయం చెప్పండి. ఆయన ఈవిడను కూడా 'ఐ లవ్ యూ' అన్నాడేమో కను క్కోండి. అలాటి వార్త తెలిస్తే కంగారుపడకండి. అతనికి పెళ్ళవకుండా వుంటే మీ పెద్దవాళ్ళకూ మీ అక్కయ్యే చెబుతుంది.

## రంగనాయకి, హైద్రాబాద్

ప్ర: నాకు రచయిత్రి కావాలని వుంది. కానీ ఎన్ని రచనలు పంపినా ప్రచురణ కావటం లేదు. పత్రికల్లో పడుతూన్న ప్రస్తుత కథల కన్నా ఎంతో మెరుగు.

జ: అని మీరు అనుకుంటూ వుండి వుండవచ్చు. ఎడిటర్ అలా అనుకోవాలి కదా! ఆగండి.... మీరు వెంటనే అడగబోయే ప్రశ్నలుకూడా తెలుసు. 'మేము పంపినవన్నీ అసలు ఎడిటర్ చదువుతారా? పేరున్న వాళ్ళయితే చదవకుండానే వేసుకొంటారు కదా'.... ఇలాంటి అనుమానా లకి తావివ్వకండి. ఈ సంశయాలు మీలో సృజనాత్మకశక్తిని తక్కువ చేస్తాయి. మంచి కథని ఏ ఎడిటరూ వదులుకోడు.

## కె. రమేష్, వరంగల్

ప్ర: సినిమాలలో హీరో వెనకాల డాన్స్ చేసే బృందంలో చేరా

లని వుంది. దానికేం చేయాలో చెప్పగలరు. అలాగే దర్శకుడు కావా లంటే ఏమి చేయాలి?

జ: మొదటిదానికి మద్రాసులో డాన్స్ అసిస్టెంట్సుగా పేరు నమోదు చేయించుకోవాలి. తరువాత ప్రముఖ నాట్య దర్శకుల ప్రాపకం కోసం ప్రాకులాడాలి. అన్నిటికన్నా ముఖ్యంగా మీకు నృత్యం వచ్చి వుండాలి.

ఇక మీరు దర్శకుడిగా అవ్వాలంటే, మరో పెద్ద దర్శకుడి దగ్గర క్లాప్ అసిస్టెంట్‌గాను, అసిస్టెంట్ డైరక్టర్‌గాను కొన్ని సంవత్సరాలపాటు పని చేయాలి. దాదాపు మొదటి సంవత్సరం ఫ్రీగా చేయాల్సి వుంటుంది. అప్రెంటిస్‌షిప్‌లో అన్నమాట! తరువాత అసోసియేట్ డైరక్టర్‌గాను, ఆ తరువాత మీలో ప్రతిభనుబట్టి కో-డైరక్టర్‌గాను ప్రమోట్ చేయబడతారు. అప్పుడు నిర్మాతలకి మీ మీద నమ్మకం వుంటే దర్శకత్వం ఛాన్స్ వుంటుంది. ప్రస్తుతం అగ్ర దర్శకుల దగ్గర ఖాళీలు లేవు. అందువల్ల ఆ ప్రయత్నాన్ని నేసి, టైమ్ వేస్టు చేసుకోకండి. మీకు బాగా తెలిసిన నిర్మాత ఎవరయినా వుంటే, దర్శకుడితో నిమిత్తం లేకుండా ఒక పిక్చర్‌కి అబ్జర్వ రుగా పనిచేసి, రెండో పిక్చర్‌కి స్వయంగా మీరే దర్శకత్వం చేపట్టే వీలు వుంటుంది. అయితే ఈ షార్ట్‌కట్‌లో ఆ నిర్మాత మూడో పిక్చర్ తీయలే నంతగా నష్టపోయే ప్రమాదం వుంది.

వి. శ్రీధర్‌స్వామి, గజ్వాల్

ప్ర: నేనొక వీడియో ఫిల్మ్ తీయాలనుకొంటున్నాను పూర్తి వివ రాలు తెలుపగలరు.

జ: రెండు గంటల వీడియో ఫిల్మ్‌ల తాలూకు స్క్రిప్టులను దూరదర్శన్ ప్రస్తుతం అంగీకరించలేదు. రెండు సంవత్సరాల వరకు అంగీకరించకపోవచ్చు. ఆ తరువాత ప్రకటన వస్తుంది- వేచి చూడండి.

ఈ లోపులో మీరు స్వంత వీడియోఫిల్మ్ తీయదల్చుకొంటే, దానికి ఎంత ఖర్చవుతుందో లెక్క కట్టండి. వివిధ ప్రకటన సంస్థలనుంచీ అడ్వర్ టైజ్‌మెంట్లు సంపాదించండి. మన వీడియో సినిమాల్లో వేస్తారే ఆ రకంగా అన్నమాట! ఆ తరువాత మీరు వీడియోఫిల్మ్ తీసి, ఏదయినా

ఏజెన్సీకి, (కిరణ్, అంజలి, జాంబినో వగైరా) అమ్మటంకోసం కమీషన్ ప్రాతిపదికపై యివ్వచ్చు....వారు ఒప్పుకుంటే, ప్రకటనల మీద వచ్చే ఆదాయం మీ ఖర్చుకి సరిపోతే, అమ్మకం మీద వచ్చే ఆదాయం మీకు లాభంగా మిగులుతుంది.

## సి హెచ్. సత్యనారాయణ, నిడమానూరు
## కొంపల్లి హరి శ్రీనివాస్, హైదరాబాద్

ప్ర : కొంతమంది ఎంత ప్రయత్నించినా ఫలితం శూన్యంగానే వుంటుంది. కొంతమందికి అప్రయత్నంగానే సకల సంపదలు ఒనగూడు తూంటవి. ఇలా జరగటం వారి వారి జాతకం అంటారు. అసలు జాతకాలు, జ్యోతిషం, వాస్తులాంటివి వున్నాయా?

జ : ఉన్నవని కొందరంటారు, లేవని కొందరంటారు. (అది నాకు తెలుసు. 'మీ అభిప్రాయం ఏమిటో చెప్పండి'- అని మీరు ప్రశ్నిస్తారని నాకు తెలుసు! చివర్లో చెబుతాను ఆ విషయం.)

జాతకాలు, జ్యోతిషం, వాస్తు మొదలైనవి వున్నవని వాదించేవారు గాలి కనపడుతుందా? ఆత్మ కనపడుతుందా? నీకు కనపడినదంతా అవాస్తవమేనా? అని గద్దిస్తారు.

జ్యోతిషం మీద నమ్మకం లేనివారు 'ఏదీ- నాకు చెప్పమనండి. చూద్దాం' అని వాదిస్తారు. 'రాజీవ్‌గాంధీ మరణం ముందే ఎందుకు చెప్ప లేదు ఈ జ్యోతిష్కులు' అని హేళన చేస్తారు. అరచేయి ముడుచుకోవ టానికి అనుగుణంగా ఏర్పడిన గీతలే హస్తరేఖలు అని తర్కిస్తారు.

'ఎందరో విద్వాంసులు, పండితులు, మేధావులు ఎంతో సమయాన్ని వెచ్చించి, మేధస్సు రంగరిచ్చి, రూపొందించిన శాస్త్రం హస్తసాముద్రికం. కొందరు మూర్ఖులు హేళన చేయటం వలన దీని ప్రాముఖ్యత తగ్గదంటారు వీరు. మనిషి మానసికంగా బలహీనుడు అయినప్పుడు యీ వాస్తుల్నీ, జ్యోతిష్కులనీ నమ్ముతాడు. దాన్ని వాళ్ళు అందంగా క్యాష్ చేసు కొంటారు' అనంటారు వాళ్ళు.

గ్రహాల చలనం మనిషిమీద కలుగచేసే ప్రభావం గురించి వార ఫలాలు వ్రాస్తారు కొందరు. శాస్త్రం కరక్టేనా అన్న చర్చలు జరుపుతారు పత్రికల్లో మరికొందరు. ఒక విషయాన్ని మాత్రం ఎవరూ కాదనలేరు.

జాతకము, జ్యోతిష్కము కరెక్టయితే మనిషి భవిష్యత్తు ఎలా వుండాలో అది ముందే "నిర్దేశించి" వుంటుంది. దాన్ని ఎవ్వరూ మార్చలేరు. జాతకము, జ్యోతిష్కము కరెక్టు కాకపోతే అసలు గొడవే లేదు. చేతులూ, జాతకాలు చూపించి మన జాతకాలు తెలుసుకోవటంవల్ల వచ్చే లాభం ఏ మాత్రమూ లేదు, మానసిక సంతృప్తి తప్ప! వారఫలాలు వివిధ మాసపత్రికలలో చదవటం వలన కలిగే మానసిక సంతృప్తి అలాంటిదే. 'మంగళవారంనాడు ప్రయాణాలు మానుకోండి' అని వారఫలాల్లో వ్రాసి వుండి, ఆ మంగళవారమే మన మరణం ఒక జాతకంలో వ్రాసి పెట్టబడి వుండినట్లయితే మనం మంగళవారంనాడు తప్పక ప్రయాణం చేసి ఛస్తాం! (జాతకము, వారఫలము కరెక్టయిన పక్షంలో)

కాబట్టి మన భవిష్యత్తు ఎలా వుంటుందో, మన జాతకాలు దేవుడు ఎలా వ్రాశాడో అని మథనపడకుండా విజయంకోసం మనం ఎంత కష్టపడదామని ఆలోచించే మనిషి జీవితాన్నీ, జాతకాన్నీ దేవుడు తప్పక బాగా వ్రాసే వుంటాడు. ఈశాన్యంవేపు గోడ కూలగొట్టడంకన్నా నైరుతివేపు గోడ లేపటం అభివృద్ధికి నిదర్శనం అని నమ్మే మనిషి వాదోపవాదాలతో సమయాన్ని వృథా చేసుకోడు.

## యన్. శ్రీనివాసరావు, (ఊరి పేరు లేదు)

ప్ర: నా అభిరుచులన్నీ మీకు వ్రాస్తున్నాను. జాగ్రత్తగా చదివితే నావన్నీ ప్రత్యేకమయిన అభిరుచులుగా మీరు గుర్తిస్తారు. బి.కామ్. పాసయ్యాను. ఉద్యోగం కోసం ఎన్నో పరీక్షలు వ్రాసా. ఫలితం లేదు. డబ్బులు పెట్టి కొనుక్కుని 'విజయా మిల్క్' తాగాలని కోరిక. కానీ ఎవరినీ చేయ సాచి అడగను. నాకు చిన్నప్పటినుంచి హార్డ్‌వర్క్ అంటే యిష్టం. నా జీవితంలో నాకు తృప్తి లేదు. చిన్నప్పుడు కష్టపడితే పెద్ద అయ్యాక సుఖపడతారు అంటారు. నేను చిన్నప్పటినుంచీ కష్టపడుతూనే వున్నా.

జ: అని మీరనుకొంటున్నారు. కానీ అది నిజం కాదేమో అనిపిస్తుంది. మీ తల్లిదండ్రులు మీకు తిండికీ, చదువుకీ డబ్బులు పంపుతున్నా

మీరు విజయా మిల్క్‌లో ఫ్లేవర్డ్ పాలు తాగాలనే కోరికని 'అందని' కోరికగా వూహించుకొని ఆ డబ్బులు పొదుపు చేయటం ద్వారా మీ తల్లిదండ్రులకి ఏదో పొదుపు చేస్తున్నానన్న భ్రాంతిలో వున్నారు. చేయి సాచి అడగకపోవటం మీ గొప్పతనంగా భావిస్తున్నారు. ఇదంతా కాకుండా మీరే చిన్న పార్టు టైంచేసి (ప్రైవేట్లు చెప్పటం లాంటివి) కాస్తో కూస్తో డబ్బు సంపాదించి వుంటే, కనీసం వారానికోసారి ఫ్లేవర్డ్ మిల్క్ తాగగలిగి వుండేవారు. అంతకన్నా ముఖ్యంగా చిన్న వయసులో డబ్బు సంపాదించటంలో వుండే ఆనందం మీకు తెలుస్తూ వుండేది. మీ నాలుగు పేజీల ఉత్తరంలో మెలంఖలీ అప్పుడు లేకపోయి వుండేది.

మీ అభిమాన నటి జయలలిత అని వ్రాస్తూ, మీవన్నీ ప్రత్యేకమైన అభిరుచులుగా అభివర్ణించుకొన్నారు. మీ అభిమాని జయలలిత అయినా, చిరంజీవి అయినా అదేమీ ప్రత్యేకత కాదు కొన్ని అభిరుచులు మనకి మానసికమైన సంతృప్తినిస్తాయి. కొన్ని అభిరుచులు మన మనోవికాసానికి తోడ్పడుతాయి. తలుపులన్నీ వేసుకొని బ్రేక్ డాన్స్ చేయటం మొదటి రకం. వయసుతోపాటు పెరిగే అభిరుచి కాదది! దానివల్ల మీ భావి జీవితంలో ఏ లాభము వుండదు కూడా. పుస్తకాలు చదవటం, చిత్రలేఖనం మొదలైనవి రెండో రకం.

మీరు చిన్నప్పటినుంచి కష్టపడుతూనే వచ్చానన్నారు. ఈ ఆలోచన మీకు గొప్ప సంతోషాన్ని యిస్తూ వుండివుండవచ్చు. కానీ హోటళ్ళలో కప్పులు కడుగుతూ, ప్లాట్ ఫారంమీద పడుకునే కుర్రవాళ్ళని గమనించండి. మీ కష్టపు సాంద్రత ఎంత ఎక్కువైందో మీకే తెలుస్తుంది. మీకు ఇప్పటికీ సంతృప్తి లేకపోవటానికి కారణం- మీ భావనా లోకాల్లో మీ బలహీనతల్ని గొప్పవిగా వూహించేసుకోవటం మరోవేపు వాటి పెళుసుదనం మీకు తెలియటం.

బ్రతుకున్నంతకాలం జీవితం అయిపోదు. ఐసెన్‌హోవర్ గొప్ప ఫుట్‌బాల్ ప్లేయర్ అవుదామనుకున్నాడు. మోకాలుకి దెబ్బ తగిలి చివరి దశలో ఆట మానేయవలసి వచ్చింది. తర్వాత అమెరికా ప్రెసిడెంట్ అయ్యాడు. అంతేకానీ కృంగిపోలేదు. కాబట్టి ఇప్పటినుంచీ నిర్ణీతమైన

వ్యక్తిత్వం పెంచుకోవటానికి ప్రయత్నించండి. ప్రముఖుల జీవితచరిత్రలు చదవటం ప్రారంభించండి. మైకెల్ జాక్సన్‌లా డాన్స్ చేయటం సరే.... ఈ మధ్య అతనిమీద ఒక పుస్తకం రిలీజయింది. ఏ స్థితినుంచి అతనీ స్థితికి వచ్చాడో చెప్పే పుస్తకం- దాన్ని చదవండి.

సంతృప్తి అనేది ఎక్కడో లేదు.... మన కళ్ళలోనే వుంది చూడ గలిగితే.

కె. వి. నరసింహమూర్తి, భీమవరం

ప్ర : శ్రీ యండమూరి వీరేంద్రనాథ్‌గారికి మహాత్మాగాంధీ (పునర్జన్మించిన) వ్రాయునది-

నేను పూర్వజన్మలో మహాత్మాగాంధీనని తెలియచేయుటకు సంతోషించుచున్నాను. గాంధీ నా వయసులో అచ్చం నాలా వుండేవారు. ఫోటోలు ఈ ఉత్తరంలో జతపరుచుచున్నాను.

పూర్వజన్మలో స్వాతంత్ర్యం తెచ్చినట్లుగా ఈ జన్మలో పేదరికాన్ని నిర్మూలించాలని నా ఆశ. ప్రస్తుతం తిలక్, గోఖలే లాంటి గురువులు నాకు లేరు. నెహ్రూ, పటేల్ లాంటి శిష్యులు లేరు. ఈ సమాజం రాజ్‌ఘాట్‌లో నా సమాధి కిస్తున్న విలువను, మళ్ళీ పుట్టిన నాకు యివ్వటం లేదు. నాకిద్దరు కూతుళ్ళు వారికి వివాహం చేయాలి. జాతిపితనయిన నేను రాజకీయాల్లో పాల్గొనాలంటే ఉద్యోగానికి రాజీనామా చేయాలి.

మీరు బాలకృష్ణతోగాని, కృష్ణగారితో కాని చెప్పి పదిలక్షలు సహాయ మిప్పించవలెను. ఉద్యోగానికి రాజీనామా చేసి, ఆ డబ్బుతో ఒక ఆశ్రమం నిర్వహిస్తాను. నేను భవిష్యత్తులో ప్రధానమంత్రి కాకపోయినా అంత స్థితికి ఎదగగలను. అప్పుడు వడ్డీతో కలిపి మీ డబ్బు మీకిచ్చేస్తాను. నాకు డబ్బు, అధికారం లేకపోవటం వలన నన్నెవరూ గుర్తించటంలేదు.

జ : మన అభిప్రాయాలు సమాజానికి నవ్వు గొలిపించేవిగా వుంటే వాటిని మనం ఎంత గాఢంగా నమ్మినా సరే. అవసరమైతే తప్ప వాటిని బయటకు వెల్లడి చేయకపోవటమే మంచిది. మీ సమస్యని రెండు రకాలుగా పరిశీలిద్దాం.

మీరు గాంధీ అని ఒక కోణంలో

మీరు గాంధీ కాదు అని మరో కోణంలో

మీరు గాంధీ కాకపోయిన పక్షంలో, గాంధీ అనుకోవటం వల్ల మీకు నిరంతర వ్యధ (....అయ్యో దేశానికి ఏమీ చేయలేకపోతున్నానే అని) తప్ప ఏం సంతోషం మిగులుతుంది? ఆత్మల గురించి, పునర్జన్మల గురించి, నమ్మని వ్యక్తులు మీకు అల్లుళ్ళుగా వచ్చారనుకోండి, "గాంధీ గారిని అడిగి పండక్కి ఒక స్కూటర్ని పంపమను కొంపదీసి రాట్నం పంపిస్తారేమో" అని మీ అల్లుళ్ళు మీ కూతుళ్ళని దెప్పిపొడిచే ప్రమాదం వుంది. ఇలా నిరంతరం మీ చుట్టూ వున్నవాళ్ళు మిమ్మల్ని పరోక్షంగా ఎగతాళి చేస్తూ మీ వాళ్ళముందు మాట్లాడతారు. మీరు గాంధీ కాకపోయిన పక్షంలో, ఆ భ్రాంతినుంచి బయటపడటానికి మీకు కొంత తర్కం ఉపయోగపడుతుంది. మీ పుట్టుకకీ, గాంధీగారి మరణానికీ మధ్యకాలంలో ఆయన (మీ) ఆత్మ ఎక్కడ తిరిగింది? ముప్పైఏళ్ళ వయసులో మీరూ గాంధీగారు ఒకేలా వుండటం ఒక్కటేనా లేక యింకేమైనా ఋజువులు వున్నాయా? గాంధీగారిలా వున్నవాళ్ళు వందలమంది వుండవచ్చు. అందరూ గాంధీగారి పునర్జన్మలు కాలేరు కదా. అదీగాక, ఒక వ్యక్తి పునర్జన్మ నిచ్చినప్పుడు అదే ఆకృతి వస్తుంది అని మీరు నమ్మినట్లయితే అందరూ అలెగ్జాండరూ, శివాజీ, నెహ్రూ, హిట్లర్ లాంటివాళ్ళే ప్రపంచంలో కనపడాలి కదా- ఎవరూ లేరే? అన్న ప్రశ్నలు వేసుకోండి.

ఇలాంటి తర్కంలో మీరు మీ భావనా లోకంలోంచి బయటపడటానికి ప్రయత్నించండి. మీరు నిజంగా గాంధీ అయినా సరే. ఆ భావంలోంచి బయటకొస్తే కొన్ని లాభాలున్నాయి. అవేమిటో కింద వివరిస్తాను.

మీరు నిజంగా గాంధీయే అనుకోండి. గాంధీగారు స్వాతంత్ర్యం కోసం బాలకృష్ణనిగానీ, కృష్ణనుగానీ అప్పు అడగలేదు. తన లాయరు ప్రాక్టీసు (ఉద్యోగం) గురించి ఆలోచించలేదు. అన్నిటికన్నా ముఖ్యంగా మీలాగా తాను ప్రధానమంత్రి అయ్యేటంత ఉన్నత స్థితికి ఎదగలేదు. అన్న ఆలోచనలో పని ప్రారంభించలేదు.

జాతిని పునర్నిర్మించటానికి పదిలక్షల ఆశయం అవసరం లేదు. మీరు మీరుగా నడుం కట్టండి. గాంధీ దక్షిణ ఆఫ్రికా నుంచి ప్రారంభించి నట్లు మీరు మీ భీమవరం నుంచీ సంస్కరణలు చిన్న ఎత్తుతో ప్రారంభించండి. మీ ఆశయం సఫలీకృతమయి మీరు మరో జాతిపిత అయితే, అప్పుడు అశేష భారత ప్రజల్ని ఉద్దేశించి మీరు చెప్పొచ్చు-

"నా చిన్నప్పుడు నేను గాంధీనన్న భావం ఈ రోజు నన్నీ స్థితికి తీసుకొచ్చింది. నా భావం తప్పో కాదో కానీ నా కష్టం మాత్రం అసత్యం కాదు. అప్పటి నా భావానికి- ఇప్పుడు శిరసువంచి నమస్కరిస్తున్నాను" మీరలా చెప్పగలిగిన రోజు జనం మీకు జేజేలు పలుకుతారు.

### బి. రమేష్, తిరువెంగళాయిపల్లి

ప్ర : నేను పదవతరగతి చదువుతున్నాను. నేను ఒకమ్మాయిని ప్రేమించాను. ఒక సస్పెన్సు పద్ధతిలో ఆమె మరణించింది. ఆమె ఆత్మకు శాంతి రావటం కోసం నేను ఒక నవల వ్రాద్దామనుకొంటున్నాను. మీ సలహా ఏమిటి?

జ : పదిహేనేళ్ళ వయసులో ప్రియురాలి మరణాన్ని సస్పెన్సు పద్ధతిలో మీరు వ్రాస్తే, ఒక ఆత్మ సంతోషిస్తుందేమో కానీ, బ్రతికున్న చాలా ఆత్మలు క్షోభిస్తాయి. కాబట్టి.... వద్దు.

### గంగాధరం, నాగాయలంక

ప్ర : నేను, నా స్నేహితుడు కలిసి నాలుగు సంవత్సరాల క్రితం వ్యాపారం ప్రారంభించాం. అప్పటికి పదహారు సంవత్సరాలనుంచి మేము ప్రాణస్నేహితులం. ఏ రాతకోతలు, అగ్రిమెంట్లు లేకుండా మేము వ్యాపారం కొనసాగిస్తున్నాం. కానీ, గత ఏడాదినుంచి మా మధ్య చిన్న చిన్న సమస్యలు, అభిప్రాయభేదాలు మొదలయ్యాయి. అవి రోజురోజుకీ పెరిగి పెద్ద వవుతున్నాయి. నాకు డబ్బుపోయినా ఫరవాలేదుగాని, స్నేహం పోవడం బాధగా వుంది. నా స్నేహితుడు పూర్వంలా యిప్పుడు వుండడంలేదు. అతనిలా ఎందుకు మారాడో నా కర్థం కావటంలేదు. వ్యాపారం మొత్తం

నేనే చూసుకుంటాను. బహుశా మోసం చేస్తున్నాననే భావన అతనికి వున్న ట్లుంది. ఈ సమస్యకి పరిష్కారం ఏమిటి?

జ : స్నేహం అనేది లిట్మస్ పేపర్ లాంటిది. అది ఏ పరీక్షకు ఏ రంగు మారుతుందో ఎవరూ చెప్పలేరు. సాధారణంగా ఏ సమస్య రాన ప్పుడే సజావుగా సాగిపోతుంది. మీరింకా నయం. వ్యాపారం ప్రారంభించి మూడేళ్ళయినా కలిసి వున్నారు. చాలామంది– చాలా గొప్పగా భావించే స్నేహాన్ని కూడా చిన్న విపత్కర పరిస్థితులకే పోగొట్టుకుంటారు. ఇక పోతే, అతను గత సంవత్సరంనుంచి ఎందుకిలా మారాడో అర్థం కావడం లేదని రాశారు. బహుశా మీ గురించి కూడా అతనిలాగే భావిస్తూ వుండ వచ్చు. దాన్నే 'కమ్యూనికేషన్ గ్యాప్' అంటారు. మేం చదువుకున్న కామర్స్‌లో 'పార్టనర్ షిప్' అనే ఛాప్టర్ వుంది. దాంట్లో మొట్టమొదటి పాయింట్ యిదే చెప్తారు. ఒక వ్యాపారంలో ఇద్దరు వ్యక్తులు భాగస్వాము లుగా చేరేటప్పుడు వాళ్ళిద్దరూ అవతలి వ్యక్తిని పరస్పరం- ప్రపంచంలో కెల్లా అతిగొప్ప మంచి వ్యక్తిగా, నిజాయితీపరుడుగా వూహించుకుంటారు. కానీ, కాలం గడిచేకొద్దీ ఆ భ్రమలు తొలగిపోతాయి. అందువల్లే 'అగ్రి మెంట్' అనేది యిద్దరిమధ్యా తప్పనిసరిగా ఒకటుండాలి అని కామర్స్‌లో చెప్తారు.

ఇప్పటికైనా మించిపోయింది లేదు. ఇద్దరూ కలిసి అసలు ఏ విష యంలో కమ్యూనికేషన్ గ్యాప్ వచ్చిందో చర్చించుకోండి. మొదట 'ఏం లేదు', 'ఫరవాలేదు' అనే వాటితో ప్రారంభమైనా అయిదు నిమిషాలు గడిచే సరికి 'నువ్విలా చేశావు', 'నువ్విలా చేయలేదా' అన్న వాదనలోకి దిగు తుంది. అప్పుడు యిద్దరి మనసులలో వున్నది బయటపడుతుంది. ఒక పెద్దమనిషి మధ్యవర్తిత్వంలో యిద్దరు చర్చించుకొని ఒక 'అగ్రిమెంట్' రాసుకోండి. మీమధ్య విభేదాలు యిప్పుడే ప్రారంభమైనాయంటున్నారు. కాబట్టి, మొదట్లోనే పరిష్కరించుకుంటే యిద్దరూ సజావుగా సాగవచ్చు, లేదా స్నేహితులుగా విడిపోవచ్చు.

వ్యక్తిగత సమస్యలు : ఇవి రెండు రకాలు. వ్యక్తిగత సమస్యలు, సామాజిక సమస్యలు.

మిమ్మల్ని మీరు వేరు చేసుకుని చూడండి. అంటే మిమ్మల్ని మీరు మరో వ్యక్తిగా భావించి అతను చేసే ప్రతి పనీ, మాట్లాడే ప్రతి మాటా గమనించండి. మీ మాటల్లో అది "నేను చెయ్యలేను" అదృష్టమే వుండి వుంటే గనుక"........ "ఇది తప్ప వేరే దారి లేదు" లాంటి మాటలున్నాయా?

మనమీద మన అవగాహన వలనా, మన అంతరాత్మవలనా మన మేమిటో మనకు తెలుస్తుంది. మన బలహీనతలూ, మన బలాలు ఏమిటో మనకు తెలుస్తుంది. అప్పుడు బలహీనతలని తొలగించుకోవటం వలనా, మన బలాలను సమర్థవంతంగా ఉపయోగించుకోవటం వలనా సృజనాత్మక శక్తి, ఇండిపెండెన్స్‌ని వాడటం వలనా కొన్ని ఆశయాలను యేర్పరచుకొని వాటిని మన పూర్తి శక్తితో మనస్ఫూర్తిగా సాధించటం వలన మనకు బలమైన వ్యక్తిత్వం ఏర్పడుతుంది. దీనివల్ల మనమీద మనకు అధికారం, ఇంకా ఎక్కువ బాధ్యతల్ని నిర్వర్తించగల సామర్థ్యం ఏర్పడుతుంది. తెలివి, నేర్పు, కోరికా మన ఆధీనంలోకి వస్తాయి.

గమ్యాన్ని దృష్టిలో వుంచుకొని ప్రారంభించండి. మీ జీవితం చివరికి ఎలా వుండాలి అనే వూహని, దృశ్యాన్ని, మనస్సుని ఒక కొలబద్ధగా ఏర్పరచుకోండి. దీనితో మీ ఈ రోజు బిహేవియర్, రేపటి బిహేవియర్, పనీ అన్నీ కొలవచ్చు. మీ చివర క్లియర్‌గా మీ మనస్సులో వుంటే మీరు చేసే ప్రతీ పనీ ఆ డైరెక్షన్‌గా సాగి మీ లక్ష్యాన్ని తీర్చేవిగా

జరుగుతాయి. అలా చివరికంటా సాగితే మీ జీవితం మీరు కోరుకున్న విధంగా రూపుదిద్దుకుంటుంది.

మనిషి విల్ చాలా శక్తివంతమైనది. అసాధ్యాలను సాధించగల శక్తి దానికుంది. అది మనిషి తనకు తను యిచ్చేవిలువనుబట్టి వుంటుంది. అంటే మీరుచేసే పనులు మీ మూడ్‌నిబట్టి కాక, మీకు ఇష్టంలేకపోయినా ఏది ముఖ్యమో అది మాత్రమే చేయటం. మీ పనులన్నీ ప్రాధాన్యతను బట్టి ఒక వరుసలో ఏర్పరచుకుని ఆ ప్రకారం చెయ్యటం ఇది మీకు మీరు ఎంత ఎక్కువ విలువిస్తే అంత సులభంగా జరుగుతుంది.

**సామాజిక విజయం :**

సామాజిక విజయం వ్యక్తిగత విజయం మీదే ఆధారపడి వుంటుంది. ఒకసారి వెనక్కి తిరిగి చూసుకుంటే మనం అనుకున్న అంతానికి ఎంత దూరంలో వున్నాం? ఎటువైపు వెళ్తున్నాం? అనేది తెలుస్తుంది. మన లక్ష్యాన్ని చేరుకోవడానికి ఎటువంటి దగ్గరి దార్లులేవు. అంత దూరము నడుచుకుంటూ వెళ్ళాల్సిందే తప్పదు.

సెల్ఫ్ కంట్రోల్, క్రమశిక్షణ యితరులలో మంచి సంబంధాలూ ముఖ్యం. నిజంగా మంచి వ్యక్తిత్వమున్న వ్యక్తికి మాత్రమే యితరులతో మంచి సంబంధాలుంటాయి. అన్ని మానవ సంబంధాలలో కెల్లా పరస్పర లాభాన్ని పొందటం అనేది గొప్పది. మనకూ మన ఎదుట వారికి లాభం జరగటం వల్ల మనకు వారికీ సంతోషమే. జీవితాన్ని ఒక స్పర్ధలాకాకుండా ఒక సమన్వయంలా చూడటం అలవాటు చేసుకోవాలి. బలమా, బలహీనమా, జయమా, అపజయమా అనే ఆలోచన ప్రాజాకంగా తప్పు. దాని ఆధారం పవరు పొజిషను. అంతేకానీ ప్రిన్సిపుల్ కాదు.

మన విజయం యింకొకరి అపజయం కాకూడదు. ఒకవేళ యిది సాధ్యం కాకపోతే చెయ్యాల్సింది 'నో డీల్'. నీవు నేను సామరస్యంగా

లేకుండా వుండి తరువాత బాధపడే కన్నా యిద్దరం విడిపోవటం మనిద్దరికీ మేలు అనేది.

గెలుపుకి మూడు ముఖ్యమైన అర్హతలున్నాయి. 1. ఇంటెగ్రిటీ, 2. మెచ్యూరిటీ, 3. సమర్థమైన మానసిక స్థితి. ఇంటెగ్రిటీ అంటే మనకేమికావాలో ఎదుటివాళ్ళకు నిర్ద్వంద్వంగా తెలియజేయటం. (ఒకవేళ దాస్తే సంబంధాల మధ్య వుండాల్సిన నమ్మకం దెబ్బతింటుంది.)

మెచ్యూరిటీ అంటే ఎదుటివాళ్ళ అవసరాలను దృష్టిలో వుంచుకొని మన ఫీలింగ్స్‌ని వ్యక్తీకరించటం.

సమర్థమయిన మానసిక స్థితి అంటే మన మీద మనకు గాఢమయిన విశ్వాసం, విలువ, అందరికీ సరిపోయినంత వుందనే మానసిక స్థితి దీనివల్ల అవకాశాలూ, ఛాయిస్ వస్తాయి.

మొదట ఎదుటివారిని అర్థం చేసుకుని మనం ఎదుటివారికి అర్థం అవ్వటానికి ప్రయత్నించడం తరువాతి ముఖ్య విషయం. మీరు చేసే పని ముఖ్యం. మాటలు కాదు. ఎందుకంటే చేతలు వ్యక్తిత్వాన్ని ప్రతిబింబిస్తాయి కనుక. మీరు ఒక వ్యక్తిని అర్థం చేసుకుంటే ఆ వ్యక్తిని గౌరవిస్తున్నట్లు. ఒకసారి అది జరిగిందంటే ఎదుటి వ్యక్తిని మీరు సులభంగా ప్రభావితం చేయవచ్చు. ముందు ఎదుటి వ్యక్తి గురించి అన్ని విషయాలూ తెలుసుకుని అతడ్ని జడ్జి చెయ్యాలి. ఎదుటి వ్యక్తి అర్థం చేసుకుంటే ఆతను మిమ్మల్ని అర్థం చేసుకునే అవకాశాలే ఎక్కువ.

తరువాత ముఖ్యమైనది మనుషుల మధ్య వ్యత్యాసాల్ని గుర్తించి వాటిని గౌరవించటం. బలహీనతలని చేతనైతే బాగుచెయ్యటం, బలాలని (ప్లస్ పాయింట్స్) పెంచుకుని సమర్థవంతంగా ఉపయోగించటం. ఈ తేడాలనేవి ఏవైనా కావొచ్చు- మానసికమైన, ఎమోషనల్, మరేదైనా. ఇంకో విషయం ఏమిటంటే మనుషులు- "ప్రపంచం ఎలా వుందో" అలాకాక "వాళ్ళెలా వున్నారో" అలాగే చూస్తారు.

తరువాతది మీ అవకాశాల్ని నాలుగు కోణాల్లో తెలివైన విధంగా వాడుకోవటం? నాలుగు కోణాలు అంటే శారీరక, సామాజిక, ఆధ్యాత్మిక విషయాలు. ఈ కోణాల్ని వృద్ధిచేసుకోవటం మనల్ని మనం వృద్ధి చేసుకోవటమే. ఎంత సమయాన్ని దీనికై కేటాయిస్తే అంత మంచిది.

ఈ విధంగా మన జీవతాన్ని సరియైన సూత్రాల మీద ఆధారం చేసుకుని మనం చెయ్యాల్సిన పనీ, దాన్ని చేసే విధానంమీద సమతుల్యమయిన దృక్పథాన్ని ఏర్పరచుకోవటంవల్ల మన జీవితాన్ని మనం సమర్థవంతంగా నిర్వహించుకోగలం.

**ఘోరాం శివ శంకర సింహ ప్రసాదరావు, విశాఖపట్టణం**

ప్ర: నేను ఇ.యస్.ఐ. హాస్పిటల్‌లో పని చేస్తున్నాను. నా యింటి విషయాలు, ఆఖరికి బెడ్‌రూమ్ సంగతులు కూడా నా ఆఫీసులో కొలీగ్స్ అందరికీ తెలుస్తున్నవి. రాత్రి మేము యింట్లో చర్చించుకున్న విషయాలు కూడా తెల్లవారి నేను ఆఫీస్‌కి వచ్చేసరికి వాళ్ళకి చేరిపోతున్నాయి. ఇది ఎలా సాధ్యమో నాకు అర్థం కావటంలేదు. ఈ రహస్యాన్ని తెలుసుకోవడం ఎవరితరమూ కాదని మా ఆఫీస్ సూపరింటెండెంట్ కూడా ఛాలెంజ్ చేశాడు. మా ఇంటి ప్రక్క వాటాలోనే ఒక లేడీ సబ్ ఇన్‌స్పెక్టరు వుంది. ఆమె ఏమైనా అధునాతన పరికరాలను ఉపయోగించి నా రూమ్‌లో ఏమి జరుగుతున్నదీ వీడియో తీస్తే మా స్టాఫ్ దాన్ని రోజూ చూస్తున్నారా అని అనుమానంగా వుంది. 1972లో విడుదలయిన హిందీ సినిమా "రాజా-జానీ"లో విలన్ కూడా ఇలాగే హీరో హీరోయిన్లు గదిలో వుంటే, వీడియో తీసి హీరోకి చూపిస్తాడు. ఆ సమయంలో హీరో పరిస్థితిలా వుంది ప్రస్తుత నా స్థితి. దయచేసి ఇది ఎలా సాధ్యమో చెప్పగలరు?

జ: మీ సుదీర్ఘమైన ఉత్తరం చదివితే, మీరు ఒక రకమయిన భ్రాంతిలో వున్నట్లు నాకనిపించింది. మీ ఇంట్లో చిన్న ట్రాన్స్‌మీటర్ పెట్టుకుని మీ ఇంటి విషయాలు వినడం సాధ్యమవుతుందేమోగాని,

వీడియో ఫిల్మ్ మాత్రం కుదరదు. సినిమాలలో అయితే నిర్మాత డబ్బు లిస్తాడు కాబట్టి విలన్ హీరో హీరోయిన్స్ గదిలో వుంటే వీడియో తీస్తాడు. ఊహ నిజమే అయితే, ఆ లేడీ సబ్ ఇన్స్పెక్టర్ ఆ విధంగా చేయడానికి ఎవరు డబ్బులిస్తున్నారో తార్కికంగా ఆలోచించండి, మీ ఇంటి గోడకు కన్నం పెట్టి, అందులో కెమెరా వుంచి వీడియో తీయడానికి మీ ఇంట్లో లైటింగ్ కూడా సరిపోదు. మీ ఆఫీసులో అందరికీ మంచి కాలక్షేపం ఇవ్వడం తప్పించి ఆ లేడీ సబ్ఇన్స్పెక్టర్‌కి వేరే పని లేదా? మీరు యీ అనవసరపు అనుమానాలతో మీ భార్యను కూడా ఇబ్బంది పెడుతున్నా రేమో అని నా అనుమానం. మీరు తార్కికమైన ఆలోచన ద్వారా ఈ ఫోబియా నుంచి బయటకు రాగలరు. మీ ఇంటి విషయాలు మీ ఆఫీసు లోని వ్యక్తులు ఎలా తెలుసుకుంటున్నారు? అనే రహస్యాల్ని ఎవరూ తెలుసుకోలేరని మీ సూపర్నెంట్ ఛాలెంజ్ చేశారని అన్నారు. అదే విష యాన్ని వ్రాసి ఇవ్వమని చెప్పండి. ఆ ఆధారంగా ఆయనమీద చట్టపరంగా చర్య తీసుకోవచ్చు.

## స్వప్న, ఊరి పేరు వ్రాయలేదు

ప్ర : సర్! నేను ఇంటర్ సెకండ్ ఇయర్ చదువుతున్నాను. ఎనిమిదవ తరగతి వరకు నా ముఖము చాలా బాగుండేది. ఆ తర్వాత మొటిమలు రావడం మొదలు పెట్టాయి. ఇప్పుడు మొటిమలు తగ్గినా, మచ్చలు పోవటంలేదు. నాకు దూరపు వస్తువులు మసగ్గా కనబడతాయి. దాంతో కళ్ళజోడు పెట్టుకోవలసి వస్తుంది. తలనొప్పి రావడంతో జుట్టు కూడా బాగా ఊడిపోయింది, కొంచెం లావుగా వుంటాను.

ఇప్పుడు నేను బయటకు వెళ్ళాలన్నా, నలుగురితో మాట్లాడాలన్నా చేయలేకపోతున్నాను. ఫ్రీగా వుండలేకపోతున్నాను. నా శరీరం స్థితి మీద బయటి వ్యక్తులు సలహాలిస్తుంటే నాకు చాలా బాధగా వుంటుంది. ఈ అవస్థలో చివరికి ఇంట్లో వాళ్ళతో కూడా నేను మాట్లాడలేకపోతున్నాను.

పుస్తకం తెరిచినా మూసినా, ప్రతి నిమిషము నా రూపం, నన్ను అందరూ అనే మాటలు గుర్తుకువస్తాయి. దాంతో ఏడుపు వస్తుంది. నాతో చదువు కొనే వాళ్ళందరి ముఖాలు చాలా అందంగా వుంటాయి. వాళ్ళతో నన్ను పోల్చుకుంటే నాకు తెలియకుండానే నామీద నాకే ఏదో కసిగా వుంటుంది నేను ఒక్కపూటే అన్నం తింటున్నాను. కళ్ళు లోతుకుపోతున్నాయి తప్ప లావు తగ్గటం లేదు.

నాకు చనిపోవాలని వుంది. నా ఇంట్లోనే నేను మాట్లాడలేను. బయట మగపిల్ల లెవరైనా ఏడిపించినా ఇంట్లో చెప్పాలంటే బాధ, సిగ్గుగా వుంది. నాకు ఫ్రెండ్స్ ఎవరూ లేరు. నేను ఏ పనిచేసినా నెమ్మదిగా చేస్తాను. త్వరగా ఎవరి మాటలు అర్థం చేసుకోలేను. మా అమ్మా, నాన్న గారు నన్ను ఫ్రీగా వదిలేస్తారు. ఎక్కడికైనా పంపిస్తారు. అయినా అంద రిలా తిరగలేను. నా సమస్యలకు సమాధానం యివ్వండి.

జ : రాజీవ్‌గాంధి, బుష్, కపిల్‌దేవ్ లాంటివాళ్ళు తప్ప చాలా రంగాలలో ఉన్నత స్థానాల నలంకరించిన వారందరూ అందవిహీనంగానే వుంటారు. జాగ్రత్తగా గమనించి చూస్తే మీకే అర్థమవుతుంది. ఒక రకంగా వారు పైకి రావడానికి యీ ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్ తోడ్పడుతుంది. అంటే వారంతా తమకంటూ ఒక ప్రపంచం నిర్మించుకుని, దానితో రాజు లవడానికి ప్రయత్నిస్తారన్నమాట. ముఖ్యంగా మీరు రచయితలు, రచ యిత్రులను చూస్తే ఏదో ఒక కాంప్లెక్స్‌తో బాధపడుతున్నవారై వుంటారు. అలాగే మీకు అభిలాష వున్న ఒక రంగాన్ని ఎంచుకుని అందులో కృషి చేయడం ప్రారంభిస్తే, కొద్దికాలం పోయాక మీ వ్యక్తిగత రూపం ద్వారా కాకుండా, వ్యక్తిత్వం ద్వారా ఎదుటివారికి ఆకర్షింపగలరు. ఎవరైనా మిమ్మల్ని చూసినప్పుడు 'ఆమె ఎంత అందగత్తె?' అనే భావం కాకుండా 'ఎంత మేధావి!' 'పైకి రావడానికి ఎంత కృషి చేసింది' అనే భావం వీరిలో మీరు కలగజేయగలిగితే మీలో ఆత్మవిశ్వాసం పెరుగుతుంది. అలా

ఒకసారి 'సెల్ఫ్‌కాన్ఫిడెన్స్' పెరిగినట్లు మీరు గుర్తిస్తే ఈ ఇంట్రావర్షన్, సెల్ఫ్‌డెఫిషియన్సీ.... ఇవన్నీ తగ్గిపోతాయి? మీ తల్లిదండ్రులు మిమ్మల్ని ఫ్రీగా ఆలోచించనిస్తారు అంటున్నారు కాబట్టి వారి సహకారంతో మీ కృషి కొనసాగిస్తే ఉభయకుశలోపరి.

## సి హెచ్. జె. జమాలాపురి, సికింద్రాబాద్

ప్ర: నా వయస్సు ఇరవై ఆరు. నేను కిరాణాషాపు నడుపుచున్నాను. నా సమస్య ఏమిటంటే ఏ చిన్నపనికయినా, సమస్యకయినా తొంభైఅయిదు శాతం ఎక్కువగా ఆలోచిస్తాను. ఏ ఆలోచనకయినా నాకు తిరిగి తిరిగి ఆలోచించడం బాగా అలవాటు అయ్యింది. అలా ఒకోసారి రెండు మూడు రోజులు ఆలోచిస్తాను. దాంతో ఆ పనిపట్ల శ్రద్ధ తగ్గి దాన్ని వదిలివేస్తాను. మరో పని గురించి ఆలోచన మొదలవుతుంది. ఇలా ఒకదానికి మరొకటి ఏ సంబంధమూలేని విధంగా ఆలోచన పరంపర సాగుతున్నది.

నాలో మరో ఆలోచనా విధానం కూడా వుంది. నేను నాకంటే ఉన్నత స్థితిలో వ్యక్తులను లేదా నాకంటే ఎక్కువ చదువుకున్న వారిని గాని కలుసుకున్నాననుకోండి. నేను వాళ్ళలా లేనని నన్ను, నా పరిస్థితిని తక్కువగా వాళ్ళు అంచనా వేస్తారని నాతో నేను అనుకుంటాను. అప్పుడు నా మనసులో పిరికితనం మొదలవుతుంది. ఈ స్థితిలో నన్ను నేను సముదాయించుకోవడానికి వాళ్ళకంటే ఎక్కువ ప్రతిష్ట, డబ్బు, చదువు సాధించినట్లుగా నాలో నేను ఊహించుకుంటాను. ఈ స్వీయ అనుభూతిలో నాలుగు నుండి ఎనిమిది గంటలు అలాగే వుంటాను. ఈ ఊహను ఒకసారి నా పని చేసుకుంటూ, మరోసారి ఏ పని చేయకుండా ఖాళీగా కూర్చుండి సాగిస్తాను. పనిచేస్తూ ఇలా ఆలోచిస్తుంటే చేస్తున్న పనిమీద మరియు పరిసరాల మీద యాభై శాతం ఏకాగ్రత, శ్రద్ధ లోపిస్తుంది. ఈ ఆలోచన

విరమించి తరువాత అలా చేసినందుకు నన్ను నేను అసహ్యించుకుంటాను.

ఆలోచన తరువాత మెడ, తల విపరీతమైన నొప్పి పెడతాయి. నరాలు పీకుతాయి. అప్పుడు బయట విషయాలన్నీ గందరగోళంగా అన్పిస్తాయి. ఈ సమస్య నా పన్నెండవ ఏటనుంచి వుంది. అప్పుడు బాగానే అన్పించేది. కానీ ప్రస్తుతం దీనివల్ల విపరీతమైన బాధలు మరియు నష్టాలు జరుగుతున్నాయి. ఈ 'ఆలోచనా విధానము'ను విరమించుకోవాలని గత నాలుగు సంవత్సరాల నుండి ప్రయత్నిస్తున్నాను. సైకియాట్రిస్టుని కూడా సంప్రదించాను. గీత కూడా పారాయణం చేసినాను. అయినప్పటికి పూర్తి కంట్రోలు కాలేదు. నేను ఆశించిన స్థితికి చేరడానికి, చేస్తున్న పనిమీద ఏకాగ్రత మరియు ఇంట్రెస్టు మరియు మానసిక క్రమశిక్షణ కుదరాలంటే నేను ఎలాంటి చర్యలు తీసుకోవాలో తెలుపగలరు.

జ : ఏదైనా సమస్య వచ్చినప్పుడు దాని గురించి ఎక్కువగా ఆలోచించడమనేది చాలా చేస్తుంటారు. అసలు సమస్య లేకుండా, దాని గురించి ఆలోచించేవారు కూడా వుంటారు. ఉదాహరణకి సాయంత్రం ఏడుకి గోదావరి ఎక్స్‌ప్రెస్‌కి వెళ్ళాలనుకోండి. మధ్యాహ్నం రెండింటి నుంచే సామాన్లు మాటిమాటికీ సర్ది చూడటం, మాటిమాటికీ టైమ్ చూసుకుంటూ ట్రైన్ అందుతుందో లేదో అని హడావుడి పడటంలాంటి వన్నీ చేస్తుంటారు. వాటన్నింటికి ఒక్కటే పరిష్కారం. ఆ సమస్యను తాత్కాలికంగా మరచిపోవడానికి దానికంటే పెద్ద పనిని సృష్టించుకుని, దానిలో లీనమైపోవడం. అప్పుడు ఈ అ....న....వ....స....ర....పు.... ఆలోచనలు వుండవు.

మీ రెండో సమస్య : మీకంటే ఉన్నతమైన వ్యక్తులను కలుసుకోవడం గురించి, ఆ సమయాలలో మీలో వున్న పిరికితనం మిమ్మల్ని ఊహాల్లోకానికి పంపుతున్నది. దాంతో మీరు వారికంటే ఎక్కువ సాధించి

నట్లు 'ఊహించు' కోవడం ద్వారా ఆత్మ సంతృప్తి పొందుతున్నారు. ఇలాంటి అనుభవాలు ఔత్సాహిక రచయితలో వస్తుంటాయి. ఔత్సాహిక రచయితలు తమ మొదటి రచనలు చూపిస్తుంటారు. ఏ కొద్దిపాటి మార్పులు చేసినాడు తన అద్భుత కళాఖండాన్ని మార్చేమని బాధపడుతుంటారు.

తనమీద తనకు కాన్ఫిడెన్స్ వుండటం మంచిదే. కాని దానికి పునాది లేదని అవతలి అనుభవజ్ఞులు చెప్పినప్పుడు, దాన్ని వొప్పు కోవాలంటే దానికి చాలా 'ప్రాక్టికల్ థింకింగ్' కావాలి. ఇలాంటి ఆలో చనా విధానాన్ని మీరు అలవరచుకోండి. మీరు కలుసుకునే గొప్పవారు, చదువుకునేవారు అంత పెద్ద స్థితికి వెళ్ళడానికి ఎంత కష్టపడ్డారో ఆలో చించండి. ఇక్కడ నా నవలలో వ్రాసిన వాక్యాన్ని ఉదహరిస్తాను. రాత్రికి రాత్రి ఎవరూ గొప్పవారు కాలేరు. ప్రపంచమంతా నిద్రపోయిన తరువాత ఒకో రాత్రి మేలుకుని ఒకో మెట్టు ఎక్కి శిఖరాగ్రం చేరుకున్నారు.

మీకు తలనొప్పి, బాధలూ అన్నీ యీ రకమైన ఆలోచనా ధోరణి వలనే వస్తుందనేది మీ భ్రాంతి. 'నాకు తలనొప్పి వస్తుంది.... వస్తుంది.... నేను తలనొప్పితో బాధపడుతున్నాను' అని మీరు వూహించుకొనడం వలనే వస్తుందని నా ఉద్దేశ్యం. వీటన్నింటికి ముఖ్య కారణం మీకు సరయిన పని లేకపోవడం. గీతాపారాయణం చేసినా, సైకియాట్రిస్టుని కలిసినా వారేమి చేయలేరు. మీకు మీరుగా విపరీతమైన పనిలో మునిగిపోండి. ఆ పనికూడా డబ్బు సంపాదన, లేక చదువుకోవడం లాంటివైతే మీకు మంచి సంతృప్తి తోపాటు ఏ సమస్యలు వుండవు.

**పట్టాభి, అనంతపురం**

ప్ర : ఇలాంటి ప్రశ్నలు-జవాబుల వలన ఎవరికయినా ఉపయోగం వుందా? ఏమయినా తాము సమస్యలో వుంటే నా దగ్గరికి రండి- నయం చేస్తాను అనే సమాధానాలే ఎక్కువచూస్తూ వుంటాము. ఇది స్వార్థంకాదా?

అందరి సమస్యలూ తీర్చడానికి మీరేమీ భగవంతులు కాదే! కేవలం ఇదంతా మనుష్యుల బలహీనతలమీద ఆడుకోవటంగా నేను భావిస్తున్నాను.

జ : చాలామంది మనుష్యులు మానసికంగా బలహీనులు. ఏదో ఒక పాయింట్‌లో మానసికంగా "బ్రేక్" అవుతుంటారు. అటువంటి పరిస్థితుల్లో అవతలవాళ్ళు తమకున్న పుస్తక, ప్రాపంచిక పరిజ్ఞానంతో అనుభవంతో సలహా యిస్తే తప్పేముంది? దాన్ని పాటించటం, పాటించకపోవటం అడిగే వాళ్ళ యిష్టం. ఇక ప్రతి విషయానికి 'నా దగ్గరికి రండి' అనేవాళ్ళు ప్రొఫెషనల్స్ రోగుల్ని నయం చేయటం కదా వారి వృత్తి! అడిగేవాళ్ళంరూ కూడా తూ.చ. తప్పకుండా ఆచరించటం కోసం అడగరు. తమకు నచ్చితేనే ఆచరిస్తారు. ఆ మాటకొస్తే మనిషి యీ 'అడగటం' విషయంలో భగవంతుడిని కూడా పూర్తిగా నమ్మడు. అందుకే "నాకీ కాంట్రాక్ట్‌లో పది లక్షలు వస్తే- నీ హుండీలో లక్ష వేసి గుండు చేయించుకుంటాను" అని మొక్కుకుంటాడే తప్ప ముందే వెళ్ళి గుండు గీయించుకొని లక్ష హుండీలో వేసి ప్రార్థించడు.

## ప్రదీప్, వైజాగ్

ప్ర : నాకు 18 సంవత్సరాలు. ఇక్కడ చాలా హోమ్‌సిక్‌గా వుంది. ఆత్మీయులు, రక్త సంబంధీకులు గుర్తొచ్చి చదువుమీద ఏకాగ్రత నిలపలేక పోతున్నాను. కలలు కూడా బాగా వస్తుంటాయి. ఏం చేయాలో సూచించ గలరు.

జ : మీరు వైజాగ్ హాస్టల్‌లో వున్నట్టున్నారు. నిజమేనా? చిన్న తనపు వాతావరణం నుంచి ఒక్కసారిగా బయటికొస్తే పాత జ్ఞాపకాలు అమితంగా బాధపెట్టడం సహజమే. తల్లి, తండ్రీ, చెల్లి, తమ్ముడూ, అమ్మ చేతివంటా అన్నీ గుర్తొచ్చి....కదిలిస్తే చాలు ఏడుపొచ్చేలా వుంటుంది. ఆ వయస్సులో పరిస్థితి కానీ ఒక్క విషయం గుర్తుకు తెచ్చుకోండి. పెళ్ళిలో అంపకాలప్పుడు కన్నీరు మున్నీరుగా ఏడుస్తూ పుట్టింటి నుంచి అత్తారింటికి

కెళ్ళే కొత్త పెళ్ళికూతురు, ఆషాఢమాసానికి వచ్చినప్పుడు ఎప్పుడెప్పుడు తిరిగి వెళ్ళిపోదామా అని చూస్తూ వుంటుంది. కారణం.... కొత్త బంధం. అంత గొప్ప అనుబంధం అవసరంలేదుగానీ కొత్త వాతావరణాన్ని ప్రేమించటం కోసం మీరు అక్కడ మంచి స్నేహితుల్ని ఎన్నుకోండి. మీకు అభిరుచి వున్న క్రీడల్నీ, కళల్నీ ఆ క్రొత్త వాతావరణంలో వెతుక్కోండి. భవిష్యత్తులో యింకా సుదీర్ఘ తీరాలకు పయనించవలసి రావచ్చు. దానికి యిప్పటినుంచే పునాది వేసుకోండి. ఇంటి బెంగని మర్చిపోవటం కోసం హాస్టల్‌లో తాగుడూ, పేకాట లాంటివి అలవర్చుకొంటే అవి వ్యసనాలుగా మారే ప్రమాదం వుంది. జాగ్రత్త!

ఎం. ఎల్. నరసయ్య. ప్రొద్దుటూరు

ప్ర : మాది మెడికల్ బిజినెస్. నాకు ఇందులో పైకి రావాలనుంది. నాది అదోలాటి మనస్తత్వం. ఒకరోజు ఒక ఫ్రెండ్ ఉదయం ఎనిమిది గంటలకు వచ్చి "నీ స్కూటర్ యివ్వు, పది నిమిషాల్లో తిరిగి తెస్తాను" అని తీసుకువెళ్ళాడు. తిరిగి రాత్రి పది గంటలకి స్కూటర్ యిచ్చాడు. నా అవసరాలకి స్కూటర్ లేక నడుచుకుంటూ వెళ్ళాను. 'స్కూటర్ ఇవ్వను' అని చెప్పి వుంటే బాగుండేది. మొహమాటానికి పోయి నడవాల్సి వచ్చిందని బాధపడ్డాను. ఆ తర్వాత యింకోసారి అడిగినా కూడా 'ఇవ్వను' అనలేను. ఏమనుకుంటాడో అని యిస్తాను.

జ : ప్రతివాళ్ళతో 'మంచి' అనిపించుకోవాలన్న కోర్కె కలిగివుండటానికి మరో పేరే 'మొహమాటం'. నేను మొహమాటస్తుడిని అని చెప్పుకోవటం క్వాలిఫికేషన్ కాదు- బలహీనత. దీన్ని అధిగమించటానికి ప్రయత్నించాలి. మీరు మానవ సంబంధాలన్నీ ఇచ్చి పుచ్చుకోవటం మీదే ఆధారపడి వున్నాయి. మీరెంత మంచివాడిగా ప్రొజెక్ట్ చేయబడినా మీవల్ల ఉపయోగం లేకపోతే మీకెవ్వరూ సహాయం చేయరు. మీరు మొహమాటంవల్ల

మాట్లాడినా, మీవల్ల ఉపయోగం వుంటే మీతో పరిచయాన్ని పెంచుకోవా అని చూస్తారు. మరీ అలా మెటీరియలిస్ట్‌గా మారమని నేననడం లేదు. మీరు ఇతరులకు ఏదయినా యివ్వదలుచుకుంటే మీకు నష్టం రాకుండా చూసుకోండి. 'మొహమాటం వదిలేయట మన్నది' ముందు దగ్గరివాళ్ళవద్ద మొదలుపెడితే నెమ్మదిగా క్రొత్తవాళ్ళ మీద కూడా ప్రయోగించవచ్చు. ఆ విధంగా ప్రయత్నించి చూడండి.

సంతోష్‌కుమార్, మచిలీపట్టణం

ప్ర : నేను ఇంటర్మీడియెట్ చదువుతున్నాను. నాకు జీవితం బోర్‌గా వుంటుంది. ఎప్పుడూ డిప్రెషన్‌గా ఫీలవుతాను. ఎందుకీ చదువు? అని పిస్తుంది. దేనిమీద ఆసక్తి వుండటం లేదు. మా అమ్మా, నాన్నలు నేనేమడిగినా కాదనరు. నాకే ఎందుకో దేనిపట్లా ఉత్సాహం వుండటంలేదు. నాకు లెక్కలు బోర్, ఇంగ్లీషు భయం. నాకు ఏం చేయాలో తోచటంలేదు. అసలు జీవితం అంటే ఏమిటి? ఎందుకు జీవించాలి?

జ : 'జీవితం అంటే ఏమిటి?' అనే ప్రశ్నకి చాలామంది చాలా రకాలుగా అర్థాలు చెబుతారు. 'కష్టపడి ఒక గమ్యం సాధించి, నలుగురిచేత 'శభాష్' అనిపించుకోవటానికి' అని కొందరంటారు. 'మానవజన్మ భగవత్ సాన్నిధ్యానికి ఆఖరి మెట్టు' అని కొందరంటారు. 'ఎవర్నీ బాధపెట్టకుండా, మనం వీలయినంత వరకూ ఆనందించడానికి దేముడిచ్చిన వరం జీవితం' అని కొందరు నమ్ముతారు. ఏది ఏమయినా ఏదో ఒక నమ్మకం వుండటం, ఆ నమ్మకాన్ని మనసారా ఆచరించటమే మనిషి చేయవలసినది. దురదృష్టవశాత్తు చాలామంది ఈ లక్ష్యాన్ని 'మిస్' అవుతారు. ఉదాహరణకి జీవితం అనేది ఆనందించటానికి అని మీరు నమ్మేవారు అనుకోండి. మీ దృష్టిలో ఆనందం అంటే ఏమిటి అనేది నిర్ణయించుకోండి. (అది కాలాన్ని బట్టి మారుతూ వుండవచ్చు.) అలా నిర్ణయించుకున్నాక మీ శక్తిని ఆ ఆనందం కోసం ఎలా వినియోగించుకోవచ్చో ఆలోచించండి.

అన్నిటికన్నా ముందు అసలు మీకు ఏమేమి యిష్టమో విశ్లేషించు కోండి. పార్టీల్లో పాల్గొనటమా? ఒంటరిగా మ్యూజిక్ వింటూ పుస్తకాలు చదవటమా? ఏదయినా గేమ్‌లో పాల్గొనటమా? బ్రేక్‌డాన్స్ చేయటమా? స్కూటర్ రిపేర్ చేయటమా?

అలాగే మీకేం యిష్టం లేదో విశ్లేషించండి. లెక్కలు చేయటం, ఇంగ్లీషు చదవటం, ఇతరుల సుత్తి భరించటం, సినిమాలు చూడటం వగైరా. వీటిని వరుసగా, ముఖ్యమైన వరసలో వ్రాసుకోండి.

నాకు ఇష్టమైన పనులు

1

2

3

4

నాకు ఇష్టంలేని పనులు

1

2

3

4

ఇలా మీకు యిష్టమున్నవి- యిష్టంలేనివి విడదీయటం వలన అనవసరంగా ఆలోచించవలసిన విషయాల సంఖ్య తగ్గిపోతుంది. తమ కిష్టంలేని పనులు చేస్తూ జీవితంలో స్థిరపడ్డవాళ్ళ మొహంలో నిరంతరం నిర్లిప్తత కనబడుతూనే వుంటుంది- గమనించండి. రెండువందల కోట్ల రూపాయల అప్పుకి, అధికారినై, చండీఘర్ నుంచి కన్యాకుమారి వరకూ జ్యూరిస్ డిక్షన్‌తో, నెలకి అయిదు అంకెల జీతంతో వున్న

నేను, బ్యాంక్ ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి స్వేచ్ఛగా వ్రాసుకోవటానికి బయటకొచ్చిన రోజు చాలా సంతోషంగా రిలాక్సయ్యాను. ఒక్కొక్క మనిషికి ఆనందం ఒక్కొక్క రకంగా వుంటుంది. మీకు ఏ రకంగా వస్తున్నదో తెలుసుకోండి చాలు. "నేను ఏం అవ్వాలనుకొంటున్నాను" అని ఒక లిస్టు వ్రాసుకోండి. మీకు తెలియని శక్తి మీ పక్క స్నేహితులు గుర్తించి వుండవచ్చు. 'ఒరేయ్ నువ్వు నిజంగా గొప్ప లాయర్‌వి అవుతావురా' అనో, 'ఈ వయసులోనే టేప్‌రికార్డర్ బాగుచేశావా గ్రేట్' అనో మీ వాళ్ళు అంటే, ఆ రంగంపట్ల మీకు ఉత్సాహం వుంటే- మొదటి లిస్ట్, రెండో లిస్ట్, మూడో లిస్టులతో ఒక పాయింట్ దగ్గర "స్ట్రయిక్" అవుతారు.

అదే మీ గమ్యం.

ఎప్పుడయితే మీ గమ్యం మీకు ఇష్టమైందో, మీలో ఉత్సాహం దానంతట అదే వస్తుంది. బి. ఇ. లో సీటురాక బి. ఏ. చదివి, ఆ పైన ఎమ్.ఏ. లో సీటురాక ఎల్. ఎల్. బి. చదివి లాయరుకంటే, ఇంటర్మీడియట్ చదివే టైమ్‌లోనే లాయర్ అవ్వాలనుకొని ఆ వివరాలన్నీ సేకరించేవారు మంచి అడ్వకేట్లు అవుతారు.

**షేక్ బాషా, దరిశి తాలూకా**

ప్ర : సార్ నాదో ప్రాబ్లమ్. నేను ఎవరితోనయినా మాట్లాడేటప్పుడు ఏమిటో అదొక భయము. మాటలు తడబడుతూ వుంటాయి. 4-5 గురు మనుష్యులు కనక వుంటే మాటలు రావు. ఎదుటివారి కళ్ళల్లో కళ్ళుపెట్టి, సూటిగా మాట్లాడలేను. నా మాటలు తడబడేటప్పుడు ప్రక్కనున్నవారూ నవ్వితే నన్ను గుర్తించేనని బాధపడుతూంటాను. భగవంతునిమీద కోపం వస్తుంది, ఆ రోజు ఆకలికాదు. జీవితంమీద విరక్తి పుడుతుంది. నా సమస్యకి పరిష్కారం వుందా?

జ : మీ మనసులోకి ఏదయినా అభిప్రాయం వచ్చి, దాన్ని ఇతరు

లకి చెప్పాలనుకున్నప్పుడు, చెప్పేముందు, ఒక్కక్షణం ఆగండి, 1) ఒక్కసారి పునరాలోచించుకోండి. 2) అవతలివాళ్ళకి ఎలా చెబితే అర్థమవుతుందో మనసులో అనుకోండి. 3) వరుసక్రమం నిర్ణయించుకోండి– దీనంతటకి అయిదు, పది సెకన్లకంటే ఎక్కువకాలం పట్టదు. పెద్ద పెద్ద వాక్యాలు మాట్లాడకండి. కన్‌ఫ్యూజ్ అవుతారు. చిన్నవాక్యాలలో స్పష్టత ఎక్కువ.

మీ సంభాషణలో వేరు వేరు విషయాలు కలపకండి. అద్దంలో మీ కళ్ళలోకి మీరు చూసుకొంటూ మాట్లాడటం ప్రాక్టీస్ చేయండి. మీ దగ్గర టేప్‌రికార్డర్ వుంటే, మీరేం మాట్లాడుతున్నారో ఒకసారి వినండి. ఒక్క విషయం గుర్తుంచుకోండి. మనుషులు ఒక రోజంతా మాట్లాడిన దాంట్లో 90 శాతం ఎవరికీ ఉపయోగముండదు. కాబట్టి మీరు అనుకొన్న దానిలో 10 శాతం మాట్లాడితే చాలు. మాట్లాడేది స్పష్టంగా మాట్లాడండి. మరొక విషయం తెలుసా మీకు? ఎక్కువ మాట్లాడే మనుషులకన్నా, తక్కువ మాట్లాడే మనుషులు ఎక్కువ తెలివయిన వాళ్ళని మిగతా మనుష్యులు అనుకొంటారు.

### ఎస్. వంశీకృష్ణ

ప్ర : నా సమస్య ఎవరికయినా చెపితే, గేలి చేస్తారేమోనని మీకు చెపుతున్నాను.

ఈ మధ్యనే నాకు ఒకబ్బాయి పరిచయం అయ్యి క్లోజ్ అయ్యాడు. మా ఎదురింటి ఆంటీని నేను చిన్నప్పటి నుంచీ చూస్తున్నాను. చాలా మంచిది. కానీ ఒకరోజు నా యొక్క కొత్త ఫ్రెండ్, మరియు మా ఎదురింటి ఆంటీలను చాలా దగ్గరగా చూశాను. అప్పటినుంచీ నాకు తెలియని బాధ కలుగుతుంది. నా స్నేహితుడిపై ఈర్ష్యలేదు. ఆంటీపై కోపంలేదు. మరి నాకు బాధ ఎందుకు కలుగుతోందో? నేను బాధపడటం ఈర్ష్యవల్లనా?

లేక నైతిక విలువలు పోతున్నాయనా? పరీక్షల సమయంలో కూడా యివే ఆలోచనలు. నేనెందుకు ఇలా బాధపడుతున్నానో చెప్పగలరు.

ఇదేమన్నా మానసిక వ్యాధా?

జ : కాదు. నిశ్చయంగా కాదు. మీ వయసులోనే కాదు. ఏ వయసు వారికయినా యిది సహజమే. మనం నమ్మే నైతిక విలువలు వేరు. మనం ఆచరించే నైతిక విలువలు వేరు. మీరు మీ ఆంటీని ఒక ఐడియల్‌షీగా వూహించుకున్నారు. ఒకవేళ ఆమెతో మీ స్నేహం పరిధులు దాటి వుంటే మీరు యింకోరకంగా (క్షమించాలి) ఆలోచించి వుండేవారు. ఇంకోవిధంగా ఆత్మవంచన చేసుకొని మీ ప్రవర్తనని సమర్థించుకొనేవారు.

మీరు ఏ రకమైన వ్యక్తో ముందు విశ్లేషించుకోండి. మీకు విలువల పట్ల బాగా నమ్మకం వుంటే ఒక పద్ధతి. లేకుండా మీరూ ఒక ఫ్లర్ట్ అయితే మరో పద్ధతి. మీ ఉత్తరం బట్టి మీరు మొదటి రకానికి చెందిన వ్యక్తిగా నేను భావిస్తున్నాను. మీకు ఒక కథ చెబుతాను.

ఒక భక్తుడి ఎదురు యింట్లో ఒక వేశ్య వుండేదట. ఆమె దగ్గరికి ఎందరు విటులొస్తున్నారో, ఆ భక్తుడు ప్రతీరోజూ లెక్కలు కట్టేవాడుట. చివరికి మరణించి నరకానికి చేరుకున్నాడుట. "నీకు దైవప్రార్థన కన్నా వ్యభిచారి చింతన ఎక్కువ అయింది. అందుకే నీకు ఈ నరకం ప్రాప్తించింది" అన్నాడుట యముడు.

మీరు ఎక్కువ ఆలోచిస్తే పరీక్షల్లో యిదే రిజల్టు వస్తుంది.

వీలయినంతవరకూ మీ స్నేహితుడి నుంచి దూరం అవండి. మీ ఆంటీకి నీతి పాఠాలు చెప్పే ప్రయత్నాలు ఏమి చేయకండి. ఏ పుట్టలో ఏ పాముందో చెప్పలేము. తప్పు కన్వీనియంట్‌గా మీ మీదకు తోసివేయబడే ప్రమాదం వుంది. అన్నిటికన్నా ముఖ్యంగా మీరు ఏదో ఒక రంగంలోనో, చదువులోనో మీ స్నేహితుడిని అధిగమించటానికి ప్రయత్నించండి. అప్పుడు మీ మనసులో ఈర్ష్యని 'గెలుపు భావం' డామినేట్

చేస్తుంది. 'అతడు ఆమె స్నేహాన్ని అనుభవిస్తున్నాడు....నేను చదువులో వుండే ఆనందాన్ని అనుభవిస్తున్నాను' అనే ఆహ్లాదకరమైన, ఆనందకర మైన ఫీలింగ్ మీకు కలుగుతుంది.

## వై. సురేంద్రనాథ్, తణుకు

ప్ర : నేను పాలిటెక్నిక్ రెండవ సంవత్సరం చదువుతున్నాను. నాకు సబ్జక్ట్‌ను బట్టీ పట్టకుండా మామూలుగా చదివి అర్థం చేసుకుని పరీక్షల్లో వ్రాయటం చేతకాదు. మొదట్లో బాగానే వుండేది కానీ యిపుడు ఇంగ్లీషు మీడియంలో అది చాలా కష్టమవుతుంది. ఎంత బట్టీపట్టినా అది గుర్తుండటం లేదు.

నా రెండో సమస్య. నేను దిలీప్ వెంగ్‌సర్కార్‌గారి అభిమానిని. ఈమధ్య ఆయన రిటైర్‌మెంట్ వార్త విన్న తరువాత నేను అస్సలు చదవలేకపోతున్నాను. ఏదో విలువైన వస్తువును పోగొట్టుకున్నట్లు అని పిస్తుంది. నాకు పరిష్కార మార్గం చూపించగలరు.

జ : దిలీప్ వెంగ్‌సర్కార్ రిటైర్ అయింది ఫస్టుక్లాస్ క్రికెట్ నుంచే తప్ప, క్రికెట్ నుంచిగానీ, సంసారం నుంచిగానీ, జీవితం నుంచి గానీ కాదు. ఈ విషయం మీరు ఆలోచించి, ఆ బాధనుంచి బయటకు రాగలిగితే సరే అలాకాని పక్షంలో మీరొకసారి వెళ్ళి అతడిని కలుసు కోండి. అయిదారొందలు ఖర్చవుతుంది. అక్కడ అతడెంత మామూలుగా సంతోషంగా వున్నాడో మీకు కనపడుతుంది. తన రిటైర్‌మెంట్ వలన తనకు వ్యక్తిగతంగా కానీ, దేశానికిగానీ ఏ విధమైన నష్టమూలేదనీ, చరిత్ర సముద్రం లాంటిదనీ, ముందుకొచ్చిన కెరటం వెనక్కి వెళ్ళక తప్పదనీ, అతని మాటలు స్వయంగా వింటే మీరు మామూలు మనిషవ్వ లేరు. ఇక మీ మొదటి సమస్య 'బట్టీపట్టటం' గురించి.

బట్టీపట్టి చదివి ప్యాసయిన వాళ్ళెవరూ జీవితంలో ఎంత పెద్ద చదువులు చదివినా మేధావులు కాలేరు. ముఖ్యంగా లెక్కలు, ఫిజిక్సు,

అకౌంటెన్సీ లాటి సబ్జక్టులకు 'తర్కం' చాలా అవసరం. బట్టీ పట్టడం అనేది ఈ తర్కాన్ని తగ్గిస్తుంది. ఒక లెక్కకి ఒక ఆన్సర్‌ని సాధించాలంటే ఎట్నుంచి ప్రారంభించాలి? అన్న వ్యూహ రచనని 'బట్టీ పట్టటం' అనేది చంపేస్తుంది.

ముఖ్యంగా- చిన్న తరగతుల్లో ఫర్వాలేదుకానీ ప్రొఫెషనల్ కోర్స్‌లకి వచ్చేసరికి అంత 'చదువుని' బట్టీపట్టి యథాతథంగా గుర్తుంచుకోవడం కష్టం. పైగా చిన్న వయసులో మెదడుకున్నంత హోల్డింగ్, కెపాసిటీ పెద్దయ్యాక వుండదు. అదే మీ విఫలతకి కారణం.

శరీరం అధిక శక్తిని చిన్న కొవ్వు పొరగా మార్చుకొని తనలో నిక్షిప్తపరుచుకుని అవసరం అయినప్పుడు తిరిగి కేలరీలుగా మార్చుకుంటుంది. అలాగే మీరు సబ్జక్ట్‌ని "పాయింట్లు"గా కుదించుకుని మెదడులో భద్రపరచుకోవాలి. అవసరమైనప్పుడు దాన్ని బయటకు తీసి విస్తృతం చేసుకోవాలి. ఇలా అయితే మెదడుమీద ఒత్తిడి తగ్గుతుంది. మీకూ అనలైజేషన్ శక్తి పెరుగుతుంది. అప్పుడు మీకు ప్రస్తుతం చదువుతూన్న చదువే కాకుండా, చిన్నప్పుడు చదివిన సబ్జక్టులు కూడా గుర్తుంటాయి. జీవితంలో ఇది చాలా లాభిస్తుంది. కాబట్టి మీ పాఠ్యాంశాలని చిన్న చిన్న పాయింట్లుగా రాసుకుని గుర్తుంచుకోండి. పరీక్షలో వ్యాసాలుగా విస్తృతపరచండి. బెస్టాఫ్‌లక్.

**సీత, తణుకు**

ప్ర : నేనో హాస్టల్‌లో వుంటున్నాను. నాలోని బలహీనత ఏమిటంటే నా మనసులో ఏ విషయాన్నీ దాచుకోలేను. నా అభిప్రాయాలన్నీ నా స్నేహితులకు చెప్పేస్తాను. ఆడవాటి నోట్లో ఆవగింజకూడా దాగదన్న నానుడి ఎలాగూ వుంది. ఇలా చెప్పడంవల్ల నేను చాలా నష్టపోవాల్సి వస్తూంది. ఏ వ్యక్తిని నమ్మాలో, ఏ వ్యక్తిని నమ్మకూడదో తెలియటంలేదు.

జ : 1. ఏ వ్యక్తినైనా అవసరం అయినంతవరకే నమ్మండి.

2. ఒక వ్యక్తి మీద మీ అభిప్రాయాన్ని మరో వ్యక్తి దగ్గర చెప్పకండి.

3. మీ గురించి మీరు అవతలి వ్యక్తికి ఎంత చెప్పుకుంటే అంత ఎక్కువ తేలిక అవుతారు.

మానవ సంబంధాల్లో ఈ మూడు విషయాలకీ ప్రాధాన్యత యిస్తే మనిషి ఆనందంగా వుండగలడు. 14-16 వయసులో స్నేహితురాండ్రను గమనించండి. ఇరవై నాలుగ్గంటలూ ఒకర్నొకరు విడవకుండా వుండాలనుకుంటారు. ప్రపంచంలోని విషయాలన్నీ మాట్లాడేసుకుంటారు. అవతలి వ్యక్తి అంత మంచివారు ఇంకొకరు లేరనుకుంటారు. అలాంటి స్నేహితురాలు దొరకటం అదృష్టం అని భావిస్తారు. వయసు పెరిగేకొద్దీ మన భావాలు కొన్ని మనసులోనే దాచుకోవాలనిపిస్తుంది. కాస్త రిజర్వ్‌డ్‌నెస్ వస్తుంది. మరికొంచెం వయసు పెరిగే మనిషిలో కృత్రిమత్వం, కుత్సితం కొద్దిగా పెరుగుతుంది. ఈ పరిణామక్రమం ఒక్కో వ్యక్తిలో ఒక్కో విధంగా వుంటుంది.

'లతకి కోపం కాస్త ఎక్కువ' అని కేవలం ఒక వాక్యం మీరు మీ రూమ్మేట్టు లక్ష్మితో అన్నారనుకోండి, లక్ష్మి ఏదో ఒక సందర్భంలో లతతో 'నీకు బాగా కోపం ఎక్కువటే సీత అన్నది చిన్న విషయానికి కూడా అవతలి వాళ్ళని విసుక్కుంటావట. నీతో స్నేహం చేయటం కష్టమట' అని చెపితే మీరేమీ ఆశ్చర్యపోనవసరంలేదు. ప్రతి మనిషిలోనూ ఆ మాత్రం సాడిజం, ఓర్వలేనితనం వుంటుంది. 'ఒక మనిషిని మరొక మనిషి నుంచి దూరం చేయటంద్వారా మనం దగ్గరవ్వచ్చు' అన్న మనస్తత్వం రాజకీయాల్లోనే కాదు నిజ జీవితంలో కూడా కనపడుతుంది.

ఒక నిజాన్ని అదే రూపంలో చెపితే దాంట్లో థ్రిల్ వుండదు. అందుకనే కాస్త "మసాలా" చల్లి చెపుతారు. మీలాంటి "భోళా" మనుష్యులు దీనికి బలి అవుతారు. ఈ విషయం తెలుసుకోక అందర్నీ నమ్మినంతకాలం మీకు బాధ తప్పదు.

జి. విశ్వనాథం, బాపట్ల

ప్ర : మా యింట్లో నేను పార్టీ యిచ్చినప్పుడు మా యింటికి నా మిత్రుడు తన మిత్రుడిని తీసుకొచ్చాడు. అతనికి వాస్తులో బాగా ప్రవేశ ముందట. ఆ కొత్త మిత్రుడు మా యింటిని చూడగానే ఈశాన్యంవైపు ఎత్తుగా వుందని, అక్కడ గోడ కొట్టించి వేయాలని చెప్పాడు. ఆ గోడ కొట్టించేస్తే మొత్తం గది కూలిపోతుంది. నాకు నలభై, ఏభై వేలవరకు ఖర్చవుతుంది. అంత ఖర్చుపెట్టే స్థితిలో లేను. అదే విషయం చెప్తే అతను "అందువల్లే నీకు చాలా అనర్థాలు జరుగుతున్నాయని" చెప్పి వెళ్ళిపోయాడు. నిదానంగా ఆలోచించుకుంటే అతను చెప్పింది నిజమేనేమో అనిపించింది. గత మూడు సంవత్సరాల నుంచి మా తల్లిగారికి ఆరోగ్యం బాగాలేదు. నాకు ఆఫీసులో చికాకులుగా వున్నాయి. మా పెద్దబ్బాయి పరీక్ష పోయింది. ఇప్పుడు నన్నేం చేయమంటారు.

జ : మీరు వాస్తుని నమ్మితే నేను చేయగలిగిందేమీలేదు. మీరు తార్కికంగా ఆలోచిస్తానంటే ఒక పాయింట్ చెబుతాను. మీరు మరో వాస్తు శాస్త్రవేత్తను పిలిచి ఈ విషయం వివరించి నేను ఏభైవేలు ఖర్చుపెట్టే స్థితిలోలేను అని చెప్పండి. అతను "అవసరం లేదు. రెండు వందల రూపాయలు పెట్టి అక్కడొక నీళ్ళట్యాంక్ కడితే సరిపోతుంది" అని సలహా యిస్తాడు. ఇంకో వాస్తు శాస్త్రవేత్తను పిలిస్తే "ఆగ్నేయం మరింత ఎత్తు చెయ్యి. అప్పుడు ఈశాన్యం పల్లం అవుతుందికదా సరిపోతుంది" అంటాడు. కాబట్టి మీకు ఏది కన్వీనియంట్‌గా వుంటే అది చేయించుకోవచ్చు. ఇవన్నీ మనం ఖర్చు పెట్టగల డబ్బుమీద ఆధారపడి వుంటాయి. బాగా డబ్బుంటే మీరు పూర్తిగా ఇల్లే కూల్చేయవచ్చు.

ఇకపోతే గత మూడేళ్ళనుంచి మీ కుటుంబంలో అరాచకాలు జరుగుతున్నట్లు రాశారు. మీ సుదీర్ఘ ఉత్తరాన్ని చదివితే మీరు ఇల్లుకట్టి పదిహేను సంవత్సరాలైంది అని తెలిసింది. ఈ పదిహేనేళ్ళనుంచి లేని అరాచకాలు గత మూడేళ్ళనుంచే వస్తున్నాయా? మీ పెద్దకొడుకు పరీక్ష పోయిందన్నారు. అతను బాల్యంనుంచి బాగా చదివేవాడుకదా? కేవలం ఈ ఒక్క

ఏడాదే అతని పరీక్ష పోయిందా? మీ ఈశాన్యంవైపు ఎత్తుగా వున్నట్ల యితే ప్రతి ఏడాది మీ అబ్బాయి పరీక్ష పోతూవుండాలి కదా. అలాగే మీ వయసు ఏభై ఏళ్ళని రాశారు. అలాంటప్పుడు మీ తల్లిగారి వయసు నిశ్చ యంగా డెబ్బై సంవత్సరాలకు పైనే వుంటుంది. అలాంటప్పుడు ఆవిడ అనారోగ్యంగా వుండటంలో ఏ విధమైన ఆశ్చర్యంలేదు కదా. ఇక్కడ నేనొక చిన్న ఉదాహరణ చెబుతాను

మీ ఇంటికి మీ మిత్రుడు తన మిత్రుడిని తీసుకొచ్చినట్లే, నా యింటికి నా మిత్రుడు తన మిత్రుడిని తీసుకొచ్చాడు. మా కొత్త మిత్రుడు వాస్తుశాస్త్రంలో ప్రవేశుడట. ముందు అతను తూర్పువైపు కూర్చొని పేక ఆడటం ప్రారంభించాడు. రెండువందల రూపాయలు పోగానే అతను తూర్పుకన్నా ఉత్తరం మంచిదని చెప్పి ఉత్తరంవైపు కూర్చొని మరో మూడొందలు పోగొట్టుకున్నాడు. ఆ తర్వాత తూర్పుకి ఉత్తరానికి మధ్యగా కూర్చుని మరో మూడొందలు నాకు అప్పుపెట్టి వెళ్ళిపోయాడు. అంతేకాదు "ఫేట్" అనేది దీన్నంతటినీ నిర్ణయిస్తుందనీ వాస్తు దానిని కొంతవరకు మార్చటానికి సాయపడుతుందనీ అన్నాడు. వాస్తు శాస్త్రవేత్తల మాటలన్నీ ఇలాగే వుంటాయి.

వాస్తుశాస్త్రం వుందా? లేదా? దానిలో నిజమైన శాస్త్ర ప్రవీణులు న్నారా? లేదా? అనేది నేనిక్కడ చర్చించదలుచుకోలేదు. నేను చెబుతు న్నది మన నమ్మకాల గురించి! మనకి కాస్త కష్టంరాగానే- ఏదో ఒక దానిమీద ఆధారపడాలనే మన బలహీనత గురించి!

**వెంకటభవాని, కాకినాడ**

ప్ర : మా యింటికి కాలేజీ చాలా దూరం. నేనూ, నీరజ కలిసి ఆమె లూనామీద వెళుతుంటాం. మేమిద్దరం మంచి స్నేహితులం కూడా. కానీ ఒకరోజు మామూలుగా వాళ్ళింటికి వెళ్ళాను. మా మరో స్నేహితురాలితో మాట్లాడుతున్న నీరజ "నువ్వు ఈరోజు బస్సులో వెళ్ళవే మాకు కొద్దిగా పనుంది. కాలేజీకి కూడా నేను ఆలస్యంగా వస్తాను" అని చెప్పింది. నేను వెళ్తుంటే వెనకనుంచి ఏదో కామెంట్ చేసుకుంటూ, నవ్వుకుంటూ వాళ్ళు

నన్ను క్రాస్ చేయడం జరిగింది. నాకు చాలా కోపం వచ్చింది. అప్పటి నుంచి మేమిద్దరం మాట్లాడుకోవడంలేదు. నేనూ ఒక లూనా కొనుక్కొని నీరజ ముందునుంచీ వెళ్ళాలనుకున్నాను. నాన్నగారిని అడిగితే "ఇప్పుడు కాదమ్మా. అంత డబ్బు లేదు" అన్నారు. ఏం చేసైనా సరే కొత్త లూనా కొని, నీరజ ముందునుంచి వెళ్ళాలి అనే కోరిక రోజు రోజుకీ నాలో పెరుగుతోంది. అంతేకాకుండా నేను ఒంటరిగా వెళుతుంటే స్నేహితులతో కలిసి కామెంట్ చేస్తుంది. ఆమెను ఏ విధంగానైనా అవమానపరచాలి. మీరేమైనా సలహా యివ్వగలరా?

జ : మీ యిద్దరి విభేదాలకి కారణం చిన్నది. అప్పటివరకు మిమ్మల్ని లూనాపై తీసుకువెళ్ళిన అమ్మాయి ఒకరోజు తీసుకెళ్ళలేదు అన్న కారణం కాకుండా మీ వెనుకనుంచి వినపడ్డ కామెంట్స్ మూలంగా మీరిద్దరూ దూరమయ్యారు. అసలవి మీపైనో కాదో మీకు తెలీదు. ఈ విషయాన్ని పక్కనుంచితే, మీరు నీరజ యింటిముందు నుంచి కొత్త లూనాలో వెళ్తారు, బాగానే వుంది. వాళ్ళనాన్నగారు నీరజకు కొత్త నెక్లెస్ చేయిస్తే మీరు మీ నాన్నగారితో పోట్లాడి అలాంటి నగ చేయించు కుంటారు. ఆమె కొత్త షల్వార్ కమీజ్ కొనుక్కుంటే మీరు అంతకంటే మంచిది కొనేవరకూ మీ నాన్నగార్ని వేధిస్తారు. ఇదేరకంగా మీరు స్నేహితులతో వున్నప్పుడు రోడ్డుమీద ఒంటరిగా వెళుతున్న నీరజను చూసి కామెంట్ చేసి ఏడిపించాలనుకుంటారు. ఆ తర్వాత నీరజ కూడా మళ్ళీ అదేపని మీరు చేసినదే చేస్తుంది. దీన్నిబట్టి జరిగేదేంటంటే మీ జీవిత కేంద్రం నీరజే అవుతుంది. ధ్యేయం నీరజను ఎలా బాధపెట్టాలా అన్నది అవుతుంది. దీనికన్నా పెద్ద ఆశలు ఆశయాలు పెట్టుకుంటే యింకా బాగా సుఖంగా మీరుండగలరు. కానీ ఒక్క విషయం యిక్కడ చెప్పదలచుకున్నాను. చెప్పడానికి మేం యిలాగే చెప్పినా మా మెచ్యూరిటీ, మా వయసుకి కూడా మేమిలాగే ప్రవర్తిస్తాం. ఫలానా రచయితల పుస్త కాలు ఎన్ని ప్రచురించావు? అని పబ్లిషర్‌ని అడిగితే అంతకన్నా ఒక్క

కాపీ ఐనా ఎక్కువ మాటివేయాలి అని వత్తిడి చేస్తాం. అక్కడ వరకూ ఫర్వాలేదు గానీ ఫలానా రచయితకన్నా నాది ఒక కాపీ ఎక్కువ అచ్చయింది అని ఆ రచయితకి తెలియాలి అని శతవిధాలా ప్రయత్నిస్తుంటాం. వీటినుంచి బయటపడటం మానసికంగా ఎదుగుదలకి తోడ్పడివుంటుంది. మీరు నీరజతో తిరిగి స్నేహం చేయదల్చుకుంటే వెళ్ళి మాట్లాడండి లేదా మర్చిపోండి. దీని గురించి టైం వేస్టు చేసుకోకండి.

## రామచంద్రా రెడ్డి, హైదరాబాద్

ప్ర : నా ఆఫీసులో నాకింద అయిదారుగురు క్లర్క్స్ పని చేస్తున్నారు. ఒక్కొక్కరూ ఒక్కోరకం. కొంతమంది ఏ రోజూ శలవు పెట్టకుండా సిన్సియర్‌గా ఆఫీస్‌కి వచ్చి వెళ్తారు. కానీ కొంతమంది చాలా తెలివితేటలతో పని చేస్తుంటారుగానీ సాధారణంగా చెప్పిన మాట వినరు. ఎక్కువసార్లు శలవు పెడుతూ వుంటారు. మరికొంతమంది ఆఫీసు సమయంలో బాతాఖానీ కొట్టడం మరేదో పర్సనల్ పనులు చేసుకోవడం చేస్తుంటారు. నేను సిన్సియర్‌గా వున్న వాళ్ళని వదులుకోలేను. అలాగని బాగా పనిచేసి ఎక్కువ శలవు పెట్టేవారిని వదులుకోను. మరోవైపు ఆఫీసు సమయంలో మాటలతో గడిపేవారిని ఎలా కంట్రోల్ చేయాలో అర్థం కావడం లేదు, ఈ విషయమై మీరు సలహా చెప్పగలరు.

జ : మీరు మీ ఉద్యోగస్తులకు జీతమిస్తున్నది, వారిద్వారా మీ పని పూర్తవడం కోసం. ఆ వరసలో మీరు వాళ్ళని గ్రేడింగ్ చేసుకోవలసి వస్తుంది. ఏ క్లర్క్ ద్వారా మీకు ఎక్కువ పని జరుగుతూ వస్తుందో, అతను మీ దగ్గర నయాలు చూపిస్తున్నాడా, నిర్లక్ష్యంగా వుంటున్నాడా- యిదంతా మీ కనవసరం. మీపట్ల ఎక్కువ అభిమానంతో, మీ అడుగులకు మడుగులొత్తడం వల్ల మీ కెక్కువ మానసిక సంతృప్తినిస్తే అతని వల్ల మీకు ప్రొడక్టివిటీ లేకపోయినా కూడా అతన్ని మీరుంచుకోవచ్చు. అది కేవలం మీ మానసిక ఉల్లాసం కోసం. పోతే ఒక అధికారిగా మీకు

ఎవరి దగ్గర నుంచైతే ఎక్కువ వర్కు వస్తుందో వారిని అభిమానించడం మీకు మంచిది. (మూడో గ్రేడయిన) బాతాఖానీతో టైమ్ వేస్ట్‌చేసి పని చేయకుండా వుండేవాళ్ళు— సిన్సియర్‌గా పనిచేసిన వాళ్ళమీద దెబ్బ తీస్తారు. 'వాళ్ళకీ, మాకు ఒకే జీతం వస్తున్నప్పుడు వాళ్ళు పని చెయ్యక పోతే మేం ఎందుకు చేయాలి' అనే భావం మిగతా సహచరులకు వస్తే, అది తరువాత్తరువాత చాలా ప్రమాదమవుతుంది. వారికి మెమోలనివ్వడం ద్వారానూ, వార్నింగ్ లివ్వడం ద్వారానూ కంట్రోల్ చేయవలసి వుంటుంది. మీ ఆఫీస్ ఏంటో, మీ వర్కర్స్ యూనియన్ ఎంత స్ట్రాంగ్‌గా వుంటుందో చెప్పలేదు కాబట్టి, యింతకన్నా సలహా యివ్వడం కుదరదు.

## దీపిక, ప్రొద్దుటూరు

ప్ర : నా పేరు దీపిక. నేను బి. ఎ. సెకండియర్ పరీక్ష వ్రాశాను. ఒక సంవత్సరం నుండి నేను తెలుసుకున్న భయంకరమయిన నిజాన్ని మీ ముందుంచుతున్నాను. నా తమ్ముడు యింటర్ ఫస్టియర్ పరీక్షలు వ్రాశాడు. ఒకరోజు అర్థరాత్రి నాకెందుకో మెలకువ వచ్చింది. కళ్ళు తెరిచి చూస్తే, నా పావడాను పైకి జరుపుతున్నాడు. నాకు మెలకువ రావడంతో వెళ్ళిపోయాడు. ఇంకోసారి వాడి చేయి నా గుండెమీద పడింది. ఒకసారి అంటే పొరపాటు. మళ్ళీ మళ్ళీ కూడా యిలా జరిగిందంటే యేమను కోవాలి? మేము మధ్యతరగతి కుటుంబీకులం. మంచాలన్నీ అందరం ఒకే చోట వేసుకుంటాం ఫ్యాన్ క్రింద. నేను ఒక్కదాన్ని యింట్లో పడుకుంటా నంటే, అమ్మా, నాన్న అరుస్తారు. ఒక్కదానివి ఎలా పడుకుంటావని. నేను అసలు విషయం ఎలా చెప్పగలను? నా తమ్ముడికి నాకు పడదు. వాడు నాతో మాట్లాడక రెండు సంవత్సరాలు అవుతోంది, నేను అందంగా వుండను. ఐదురోజుల క్రితం మా నాన్న, అన్నయ్య ఊరికెళ్ళారు. ఇంట్లో మగతోడు లేదని మా పెదనాన్న కొడుకుని పిలిచారు. యింట

నీరింగ్ పూర్తయ్యింది. నాకంటే నాలుగేళ్ళు పెద్ద. అతను పైన పడు కున్నాడు. మేము క్రింద వసారాలో పడుకున్నాము. అర్ధరాత్రి మెలకువ వచ్చి చూస్తే నా కాలిని నిమురుతున్నాడు. నేను కళ్ళు తెరవడం చూసి నీళ్ళు తాగి పైకెళ్ళిపోయాడు. సార్....మీరు చెప్పండి, నిజంగా మనుషుల మధ్య అన్న, చెల్లి, అక్క, తమ్ముడు యిలా ఆప్యాయతలు వున్నాయా? నా భవిష్యత్తు ఏమిటి? ప్రతిరోజూ కలలు వస్తున్నాయి, నన్ను ఎవరో వెంటాడుతున్నట్లు, వారికందకుండా పారిపోవాలని ప్రయత్నిస్తున్నట్లు, చివరికి వారికి చిక్కిపోతున్నట్లు.

నావైపు చూసేవారి కళ్ళు కామంతో వుంటాయేగాని ప్రేమతోగాని, స్నేహంతోగాని వుండవు. జీవితానికి సెక్స్ అంత ముఖ్యమా?

జ : ఇంటర్ ఫస్టియర్ రాసిన మీ తమ్ముడు మీలో స్త్రీత్వాన్ని గమనించడమనేది, అతని వయసు పొరపాటు. స్త్రీలో ఏదో తెలుసుకోవాలి అనే కుతూహలం ఆ వయసు కుర్రవాళ్ళందరికీ వుంటుంది. వాటి వరసలు గుర్తించకుండా దాన్ని మీనుంచే తెలుసుకోవాలనుకోవడం కొంత దురదృష్ట కరం. మీరు మీ తమ్ముడితో మాట్లాడకుండా వుండటం కూడా ఒక విధ మైన దూరాన్ని పెంచి వుంటుంది.

ఈ సమస్యకు రెండు పరిష్కారాలు వున్నాయి.

మొదటిది మీరు మీ తమ్ముడితో బాగా మాట్లాడుతూ, చిన్న చిన్న బహుమతులు కొనివ్వండి. మాటి మాటికి తమ్ముడు, తమ్ముడు అంటూ మీరు తనకేమవుతారన్నది గుర్తుకొచ్చేలా ప్రవర్తించడం, ఒక పద్ధతి. అప్పటికీ అతనిలో యే మార్పు రాని పక్షంలో అమ్మగారితో చెపితే, ఆవిడ స్త్రీ కాబట్టి అర్థం చేసుకుంటుంది.

ఇకపోతే మీ పెదనాన్నగారబ్బాయి సంగతి, మిగతా మగవారు సంగతి ఎందరో మగవాళ్ళు మీ గురించి ప్రయత్నం చేస్తున్నారన్న భావంతో అందరూ ఒకలాగే వుంటారని, మనుష్యుల మధ్య స్నేహాలన్నీ, కామంతోగాని, సెక్స్‌తోగాని ముడిపడి వుంటాయి అన్న దురాలోచన

బియ్యే రెండవ సంవత్సరం చదువుతున్న ఈ వయసులో తెచ్చుకుంటే, ఈ ఆలోచన ముందు ముందు మీకు మానసికమైన ఆరోగ్యాన్నివ్వదు. ఆ భావాలన్నీ మనసు నుంచి తుడిచేసి, మీ చదువు మీద ఏకాగ్రత నిలపండి.

## శశిధర్, పాలమూరు

ప్ర : సార్! నాకు ఓ విచిత్రమైన మిత్రుడు వున్నాడు. అతను అభిమానించే వ్యక్తులు, వారి వారి రంగాలలో ఎంత విఫలమైనా ఏదో ఒక పిచ్చి సమాధానం యిచ్చి సమర్థించుకుంటాడు. ఆ సమర్థన వింటే మనకి పిచ్చెక్కేట్లుగా వుంటుంది. ఉదాహరణకు క్రికెట్ వరకూ ఆయన మంజ్రేకర్ అభిమాని. ఏ మాచ్‌నైనా మంజ్రేకర్ విఫలమైతే ఆయనకి 'టీమ్ స్పిరిట్' వుంది. కనుక యితరులకు అవకాశం యివ్వడానికి తొందరగా అవుట్ అయ్యాడు అంటాడు. ఓ వేళ మంజ్రేకర్ ఆట మంచిగా వుంటే యిక అతని గర్వానికి, పొగడ్తలకు అంతు వుండదు. ఆ సమయంలో ఇతరులు వినకున్నా, వదలకుండా వెంటపడి చెబుతాడు. అదే నేను అభిమానించే కపిల్, టెండుల్కర్‌లు బాగా ఆడితే వాళ్ళ అదృష్టం బాగుండి ఆడారు. కానీ మంజ్రేకర్‌లా ఆడలేరు అంటాడు. ఇతన్ని ఏమని అనాలో మీరు చెబితే బాగుంటుంది.

జ : ఆయన అలా వాదించుకోవడం వల్ల మీకేమీ నష్టం లేదుకదా ప్రతివ్యక్తి తను నమ్మిన సిద్ధాంతాలను, అభిప్రాయాలను మార్చుకోవడానికి అంత త్వరగా యిష్టపడరు. మీ మిత్రుడు ఈరోజు అలవాటును కొద్దిగా ఎక్కువ పాళ్ళల్లో కలిగి వున్నాడంటే మనం చెప్పేదానికంటే, అవతలి వారు చెప్పేదానిలో తర్కం వుంటే దాన్ని అంగీకరించి మన అభిప్రాయాలను, సిద్ధాంతాలను మార్చుకోవాలంటే, మనలో గొప్ప 'మెంటల్ బాలెన్స్' వుండాలి. దాన్ని మీరు అలవరుచుకోండి.

మీ మిత్రుడు మంజ్రేకర్ గురించి మాట్లాడినప్పుడు మీరు టెండూల్కర్ గురించి మాట్లాడకుండా వుండటం ఉత్తమమైన పద్ధతి. మీ అభిప్రాయాలు మీకున్నట్లు ఆయన అభిప్రాయాలు ఆయనకుంటాయి.

అందులో కొద్దిగా మూర్ఖత్వం వుందని మీకనిపిస్తే అన్పించవచ్చు గాక జనంలో ఆమాత్రం మూర్ఖత్వం లేకపోతే యిక వాదనలూ, చర్చలూ, రాజకీయాలు, గుళ్ళు, మసీదు గొడవలూ, క్యాపిటేషన్ ఫీజుని సమర్థించే ఊరేగింపులు ఎందుకుంటాయ్?

## ఎమ్. శ్రీనివాస్, ఏలూరు

ప్ర : నేను బి. యల్. ద్వితీయ సంవత్సరము చదువుతున్నాను. నాకీ మధ్య అప్రస్తుతమైన తాడు బొంగరం లేని ఆలోచనలు ఎక్కువ అవుతున్నాయి. "ఈ రోజు చదవాలి" అని మనసులో అనుకొని పుస్తకాల ముందు కూర్చుంటాను. పుస్తకం చేతిలోనే వుంటుంది. నా ఆలోచనలు మాత్రం ఎక్కడెక్కడో తిరుగుతాయి. ఉదాహరణకు నేను గ్రేడ్ సెకండ్ ప్రిలిమినరీ పాసయ్యాను. మెయిన్ పరీక్షలు తరువాత వుంటాయి. నా మనసు ఈ పరీక్షల మీద వుండటంలేదు. మెయిన్స్ కూడా పాసై ఇంట ర్వ్యూకి వెళితే అక్కడ ఎలా? లేదా వున్న పొలం అమ్మేసి లంచం యిచ్చి యే గవర్నమెంట్ జాబో సంపాదించాలి? ఆ తర్వాత మోటార్ సైకిల్ కొనాలి. ఆ తర్వాత మంచి కంపెనీల షేర్ల బిజినెస్ చేయడం ద్వారా లక్షలు సంపాదించాలి. ఇలా యేవేవో ఆలోచనలు. ఈ ఆలోచన పరం పరకు కారణం నాకున్న "పుస్తక పఠనం" అలవాటు కారణమా? చదువుకు సంబంధించిన ఏ పనయినా వాయిదా వేసే అలవాటు యీ మధ్యన ఎక్కు వయ్యింది. అలా అయితే నేను జీవితంలో యేమీ సాధించలేనని తెలు సండీ. కానీ కంట్రోల్ చేసుకోలేకపోతున్నాను. నా టార్గెట్ నాకు క్లియ ర్‌గా తెలుసు. దాన్ని సాధించాలన్న "ఇంటెన్షన్" మనసులో బలంగా వుంది. అందుకు తగ్గ ప్లానింగ్ కూడా వుంది. అయినా చదవలేకపోతు న్నాను. నేనెందుకిలా అవుతున్నానో నా కర్థం కావటం లేదు. మీ సమా ధానం నన్ను బాగుపరచగలదని ఆశిస్తున్నాను.

జ : మీ టార్గెట్ సాధించడానికి తగ్గ ప్లాన్ మీ దగ్గర వుంద న్నారు కేవలం "అదే" లేదు అన్పిస్తోంది. చదువయ్యాక యేం చేయాలి? కారు కొనాలి. ఎయిర్ కండిషన్ యిల్లు కట్టాలి. ఇలాంటి పగటి కలలు చాలామందికి సర్వసాధారణం. చదువయ్యాక యివన్నీ చేయడానికి వీలవు

తుందన్న సత్యాన్ని ముందు మీరు గ్రహించాలి. పోతే మీ ఆలోచనా దృక్పథాన్ని రెండుగా విడగొట్టుకోవాలి. ఒకటి- మనకి ఆనందాన్నిచ్చే వూహల్లో బ్రతకడం. రెండు- అలాంటి వూహల్ని నిజం చేసుకోవాలంటే యేం చేయాలో తెలుసుకుని కష్టపడటం "అప్రస్తుతమని" మీరే అన్నారు. తెలిసి కూడా సమయం వృధాచేసే యీ ఆలోచనలు మీరు ఆలోచించవలసినవి కావు. మీ తల్లిదండ్రుల గురించి మీరే విషయం ప్రస్తావించలేదు. ఉన్న పొలం అమ్మేస్తే వారి జీవనాధారం ఏమిటి? చెప్పలేరు. అసలీ ఆలోచనలన్నీ డిగ్రీ ద్వితీయ సంవత్సరంలోనే ఎందుకు? అనవసరం.

నేను ఈ రోజు యీ పాఠం చదవాలనుకుంటున్నాను అని డైలీ ఒక టార్గెట్ పెట్టుకుని, రాత్రి ఎంతసేపయినా పూర్తి చేయడం మంచి పద్ధతి!

మీ పుస్తక పఠనం మీ ఆలోచనలకు ఆరోగ్యకరమైన విధంగా వుండే పుస్తకాల నెంచుకోవడం మీ చేతిలో పని. అలా కాకుండా కలల్ని అమ్మే నవలలు చదవడమే మీ పుస్తక పఠనమైతే, దాన్ని కాస్త తగ్గించుకోండి.

## యన్. నాగేశ్వరరావు, హైదరాబాద్

ప్ర : రేపు నా పుట్టినరోజు. నా ఇరవై ఒక్క సంవత్సరాల ఒంటరి వెధవ బ్రతుకు. బ్రతకాలో, చావాలో రేపు నిర్ణయించుకుంటాను. కానీ ఒకటి నిజం....మీరు సమాధానం వ్రాసేంతవరకు చావను.

జ : మీ ఇరవై రెండు పేజీల ఉత్తరం చదివాను. మీరు పంపిన సొంత అడ్రస్ కవర్‌ను చింపేశాను. నా నుండి రిప్లయి వచ్చేవరకు బ్రతికే వుండండి.

## యం. అప్పారావు, విశాఖపట్టణం

ప్ర : నాది ఒక వింత సమస్య. నా వయస్సు పద్దెనిమిది. కానీ నేను వయసుకు తగ్గట్టుగా అందరి కుర్రవాళ్ళలా లేను. చాలా సన్నగా, బక్కగా వుంటాను. ఎక్కువగా పనిచేయలేను. పని ఎక్కువైతే జ్వరం వస్తుంది.

ఎప్పుడూ నీరసంగా వుంటుంది. తగవులు వేరే వారివయినా, లేక మావి అయినా నాకు భయమేస్తుంది. తగవులు లేనప్పుడు మాత్రం చాలా ధైర్యంగా మాట్లాడతాను. ఇలా ఎందుకు జరుగుతుందో అర్థం కావటం లేదు.

జ : మీ భౌతికమైన ఆరోగ్యం కోసం మంచి డాక్టర్‌ని సంప్రదించండి. మీ మానసిక ఆరోగ్యం కోసం మంచి పుస్తకాలు చదవండి. (తగవులకు దూరంగా వుండటం మంచిదే) మీ సమస్య కిదే పరిష్కారం.

**ఎ. శ్రీనివాసరావు, విజయవాడ**

ప్ర : డిగ్రీ మరియు బి.ఇడి. చేశాను. నేను చదువుకునే రోజులలో ట్యూషన్ చెప్పి నా ఫీజుల్ని నేనే కట్టుకున్నాను. చదువు పూర్తయ్యాక కూడా ఎవరి మీదా ఆధారపడలేదు. ఒక లిమిటెడ్ కంపెనీలో సేల్స్ రిప్రజెంటేటివ్‌గా చేరాను. ఆ కంపెనీ తన ఉత్పత్తులను డోర్ మార్కెట్ చేస్తుంది. కస్టమర్ల మాటలు, కంపెనీలో హెరాస్‌మెంట్ భరాయించలేక ఒకటిన్నర సంవత్సరం తర్వాత ఆ ఉద్యోగం మానేశాను. నా ఉద్యోగ సమయంలో ముప్పైవేల రూపాయలు మిగిలినవి. వాటితో ఏవో షేర్లు తీసుకున్నాను.

నాకు మొహమాటం ఎక్కువ. అందువల్ల అన్నయ్య వాళ్ళింట్లో కూర్చుని తినడానికి యిష్టంలేక ఒక హోటల్లో నాలుగువందల యాభై రూపాయలకు కంప్యూటర్ ఆపరేటర్‌గా చేరాను. ఈ ఉద్యోగంలో ఎవరితోనూ మాట పడనవసరం లేదు. కానీ తక్కువ జీతం కావటంతో జాబ్ శాటిస్‌ఫాక్షన్ లేదు ప్రభుత్వ ఉద్యోగాల మీద ఆశలేదు.

నా చిన్నతనం నుంచి బిజినెస్ చేయాలని, బాగా డబ్బు సంపాదించాలని వుంది. తినడానికే సరిగ్గా తిండిలేని వాళ్ళం, ఇక వ్యాపారం నేను ఎలా చేయగలను. అన్నయ్య ఓ బ్యాంక్ ఉద్యోగి. అలా లోన్ వస్తుందేమోనని చూశాను. ఆ బ్యాంక్ మేనేజర్, క్లర్కు కలిసి పది లక్షల

వరకూ బ్యాంక్‌ని ముంచేశారు(ట) అందుకని తను లోను కుదరదన్నాడు. కొంతమంది "క్రిషి" ద్వారా, "గ్రామోదయ" ద్వారా ట్రై చేయమన్నారు. ఇవన్నీ నిజంగా యిస్తారంటారా?

ప్రతి క్షణం ఆలోచనలు. నాకు మనశ్శాంతి వుండటంలేదు. ఒక సినిమాకు వెళ్ళాలనిపించదు. గెడ్డం చేసుకోవాలనిపించదు. మంచి బట్టలు వేసుకోను. ఒకరితో మాట్లాడాలనిపించదు. నేను నవ్వడం మరిచిపోయి చాలా కాలమైంది. ఒకచోట కూర్చోను. నిల్చోను. రోడ్డుమీద పిచ్చాడిలా పోతూ వుంటాను. రాత్రి రెండు గంటలవరకు ఆలోచనతో నిద్ర పట్టటం లేదు. బట్టతల పూర్తిగా వచ్చేసింది. నన్ను చూస్తే ౨౫ సంవత్సరాలు అని ఎవరూ అనుకోరు. ముప్పై అయిదు అంటేనూ, నలుగురు పిల్లలు అంటేనూ నమ్ముతారు.

చేతిలో చిల్లిగవ్వలేదు. అనుభవం లేదు. వ్యాపార సంబంధమైన చదువులేదు. తెలిసిన పెద్దవాళ్ళు నాకు ఎవరూ లేరు. నాకు టాటా, బిర్లాల్లాగా ఎదగాలని వుంది. రోజుకి ఇరవై నాలుగుగంటలూ కష్టపడమన్నా పడతాను. నేను బాగా డబ్బు సంపాదించాలి. మా వాళ్ళందరూ నన్ను చూసి "స్టన్" అయిపోవాలి. వీడు చాలా గ్రేట్ అనుకోవాలి. డబ్బురాని చిన్న ఉద్యోగాలు చేస్తూ బ్రతకలేను. నన్ను ఏం చేయమంటారు? నాకో మంచి సలహా యివ్వండి.

జ : మీ సుదీర్ఘమైన ఉత్తరం చదివాక మీరు ఐయామ్ నాట్ ఓ.కె. యువార్ నాట్ ఓ.కె. అదే దశలో వున్నారనిపించింది. దానికి తోడు సెల్ఫ్ సింపతి మీలో ఎక్కువగా తోస్తోంది. అందుకే మీరు "నా ఫీజులన్నీ నేనే కట్టుకున్నాను, నేను ఎవ్వరిమీద ఆధారపడటంలేదు" అంటూ ఎక్కువగా వ్రాసుకున్నారు.

మీరు 'టాటా, బిర్లాగా ఎదగాలని' వుంది అని వ్రాశారు. అలాగే కావచ్చు. కానీ దానికి తగిన కృషి మీరు చేయాలి. ఇంకొద్ది రోజులలో షేర్ బిజినెస్ బాగుండబోతోంది. అప్పుడు మీ షేర్లమీద డబ్బును వెనక్కి పొందగలరు. ఆ డబ్బుతో మీరు మంచి సెంటర్‌చూసి గాజులు, హాయి

జరీలాంటి చిన్న షాపు ప్రారంభించండి. చిన్న కిళ్ళీ కొట్టుమీద లక్షలు సంపాదించిన వారు చాలామంది వున్నారు. ఏమైనా మీరు వూహించుకున్న స్థాయికి పెరగడానికి యిది ప్రారంభమవుతుంది.

సేల్స్‌లో 'హెరాస్‌మెంట్' మీరు వ్రాసినంత వుంటే ప్రపంచం లోని సేల్స్‌మన్స్ అందరూ ఉద్యోగాలు మానేసి యిళ్ళలో కూర్చోవాలి. కానీ ఎవరూ అలా చేయటం లేదుకదా మీ ప్రక్కవీధిలో రోడ్డుప్రక్కనే వున్న వెల్డింగ్ షాపులో పనిచేసే కుర్రవాడి నెవరినైనా అడగండి— "పనిలో వుండగా ఎప్పుడయినా తనకి ఇనుపముక్కలు గుచ్చుకున్నాయా" అని. అతను దయనీయమైన అనుభవాలు చెప్తాడు. అలా ఏ పని చేసే వాడు, ఆ పనిలోని కష్టనష్టాలను కూడా భరించగలగాలి.

మీరు కస్టమర్ల మాటలు భరించలేకపోయానన్నారు. మీది విజయ వాడ కాబట్టి ఏ సాయంత్రమైనా వీలుచూసుకుని బీసెంటురోడ్డుకు వెళ్ళండి. ఏ షాపుముందు ఆగి గమనించినా కస్టమర్లతో (ముఖ్యంగా ఆడవాళ్ళతో) ఆ షాపు సేల్స్‌మెన్‌లు పడే కష్టాలు అర్థమవుతాయి. అవన్నీ ప్రొఫెషన్ బాధలు. బాధలులేని ప్రొఫెషన్ అసలు లేదు. కాబట్టి మీరు మనుష్యులతో పనిచేయాలనుకుంటే మానసికంగా 'రెసిస్టెన్స్' పెంచుకోండి. ప్రతి చిన్న మాటకు హైరానా పడిపోకండి. మీరు వ్యాపారం పెడదామనుకుంటున్నారు కదా! రేపు మీ వ్యాపారం ప్రారంభమయ్యాక కస్టమర్ వచ్చి ఉద్రేకంగా మాట్లాడితే సేల్స్ జాబ్ వదిలినట్టు మీరు మీ వ్యాపారాన్ని వదిలేస్తారా? ఈ విషయంలో 'నేను చాలా సెన్సిటివ్‌ని' అన్న ఆత్మన్యూనతా భావంతో మీరు తప్పు చేస్తున్నారు.

ప్రతిక్షణం ఆలోచనలతో మనశ్శాంతి వుండటంలేదు.... అని వ్రాశారు. అందరికీ, ఆఖరికి టాటా, బిర్లాలకూడా సమస్యలు వుంటాయి. అందరూ పరిష్కారాలకోసం ఆలోచిస్తారు. కానీ మీలా ఇరవై నాలుగ్గం టలూ ఆ....లో....చి....స్తూ....నే....కూర్చోరు. ఆలోచనలను అమలు పరచడానికి ప్రయత్నిస్తారు. మొదట్లో మీ ఆలోచనలన్నింటినీ ఆచరణలో వుంచటం సాధ్యం కాకపోవచ్చు. కానీ మీలో ప్రాక్టికాలిటీ పెరిగినకొద్దీ మీ పనులు మంచి రిజల్ట్స్ యివ్వటం ప్రారంభిస్తాయి.

"మా వాళ్ళందరూ నన్ను చూసి స్టన్ అయిపోవాలి. నన్ను చూసి 'చాలా గ్రేట్' అనుకోవాలి" అన్న మీ కోరిక కూడా తెలిపారు. ప్రపంచంలో ఎవరూ గొప్పవాళ్ళయిపోదామని పనులు చేయరు. వాళ్ళు సాధించిన విజయాలనుబట్టి ప్రపంచం వారికి గొప్పతనాన్ని ఆపాదిస్తుంది.

ఒక బీద యువకుడు అయిదు సంవత్సరాలు పోయాక, హఠాత్తుగా ఇంటిముందు ఫ్లీమత్ కారులో హీరోలా దిగడం అనేది సినిమాల్లోనూ, నవలల్లోనూ మాత్రమే సాధ్యం. కాబట్టి ఈ ఆలోచన మాని, మీ లక్ష్య సాధనలో నిమగ్నమవ్వండి. ముందు సెల్ఫ్ డిసిప్లిన్ అలవరచుకోండి. చిన్నపిల్లవాడు నడక నేర్చుకోడానికి ఎంత ప్రయత్నిస్తాడు. ఎన్నిసార్లు క్రిందపడతాడు, లేస్తాడు దెబ్బలు తింటాడో అలాగే జీవితంలో పైకి రావాలన్నా అంత కష్టపడాలి. ఎదురుదెబ్బలు తినాలి. క్రిందపడ్డాను కదా ఎలా? అని ఆలోచిస్తూ కాలాన్ని వృధా చేయకూడదు. మీరు మీరే ఎనలైజ్ చేసుకొని, ఆ తప్పు మరోసారి రిపీట్ కాకుండా చూసుకోండి. ఖచ్చితంగా విజయం మీదే.

**ఆర్ ఎమ్., తెనాలి**

ప్ర : నేను ప్రభుత్వోద్యోగిని. మా వారిది ప్రభుత్వ ఉద్యోగం కాదు. పైగా ఏ పనిలోనూ నిలకడగా కొంతకాలమైనా వుండరు. నా జీతమంతా తన చేతికి యివ్వాలంటారు. ఏం చేశారని ఆయనను లెక్క అడగకూడదు. మా పుట్టింటివారికి నేను తప్ప వేరే ఆధారం లేదు. వారికి నేను ఖచ్చితంగా ప్రతి నెలా ఎంతో కొంత సహాయం చేయాలి. కానీ మా వారు అందుకు ఒప్పుకోవడంలేదు. "పెళ్ళయినాక పుట్టింటివాళ్ళను పట్టించుకోవాల్సిన అవసరం నీకు లేదు" అంటున్నారు. ఆడదంటే భర్త చెప్పు క్రింద తేలులా పడివుండాలి అంటూ రోజూ కొడుతున్నారు. తిట్లతో మానసికంగా ఎంతో హింస పెడుతున్నారు. ఇలాంటి స్థితిలో నేనేం చేయాలి? బాధలలో వున్న పుట్టింటివారి బాధ్యతలు కొంతకాలం షేర్ చేయడం

తప్పంటూరా? నా మీదకంటే నా డబ్బుమీదనే ఎక్కువ ప్రేమ చూపిస్తున్న నా భర్తకే నా సంపాదన మొత్తం ఇవ్వమంటారా?

జ : ఎకనమిక్స్‌లో 'మార్షల్స్ థియరీ ఆఫ్ మార్జిన్ యుటిలిటీ' అని వుంటుంది. మనం ప్రస్తుతం జీవిస్తున్న విధానంకంటే కొత్త రకమైన జీవితం మనకి సంతృప్తినిస్తుంది అనుకున్నప్పుడు ఆ కొత్త రకపు జీవితాన్ని అనుసరించాలి. లేదా ఈ జీవితమే బాగుందనుకుంటే దీనిలోని కష్టనష్టాలను భరాయిస్తూ జీవించాలి. మీ ఆయన మిమ్మల్ని ఎంతో కొడుతున్నారు, తిట్లతో మానసికంగా హింసిస్తున్నారు అని వ్రాశారు. అయినా కూడా భరాయిస్తూ ఆయనతో ఎందుకు కలిసి వుంటున్నారంటే బహుశా సమాజంలో ఆయన భార్యగా ఓ స్టేటస్ ఆయన యిచ్చే సెక్యూరిటీ ఫీలింగ్ మీలో ఎక్కువగా వుండి వుంటాయి. అందుకే ప్రభుత్వ ఉద్యోగి అయి, స్థిర సంపాదన వున్నా మీరు ఏ సంపాదనా లేక ఒక మగాడితో కలిసి వుంటున్నారు. ముందు మీరు మీ భావాలలో ఏమైనా మార్పు తెచ్చుకోగలగడానికి ప్రయత్నించగలరేమో ఆలోచించండి.

తరువాత మీ ఉత్తరములో ఎక్కడా మీరు మీ పుట్టింటివారి ఆస్తి వివరాలుగాని, స్థితిగతులుగాని చెప్పలేదు. పుట్టింటి వాళ్ళందరికీ తోడుగా మగవాళ్ళు వున్నారా? వుంటే ఆ మగవాళ్ళు డబ్బు సంపాదిస్తున్నారా? సంపాదించి వాళ్ళ భార్యలకు మాత్రమే వాళ్ళు ఖర్చుపెట్టుకుంటున్నారా? ఇవేమీ వ్రాయలేదు. నిజానికి మీరు మీ వాళ్ళకి డబ్బు పంపించాల్సిన అవసరం వుండి, వారంత దైన్యస్థితిలో వుంటే తప్పకుండా వాళ్ళకి డబ్బు పంపండి. మీ పట్ల ఆయన తన ప్రస్తుత విధానము యధాతథంగా కొనసాగించేటట్లయితే భవిష్యత్తులో పరిణామాలు చాలా తీవ్రంగా వుంటాయని ఈసారి మీ భర్తతో కరాఖండిగా చెప్పండి. సామ దాన భేద దండోపాయాలు అన్న సామెత తెలుసు కదా మీకు.

విమల, వెంకటాపురం

ప్ర : నా వయసు ఇరవై మూడు సంవత్సరాలు. నేను డిగ్రీ చది వాను. బి. ఇడి. కూడా పూర్తయింది. ప్రస్తుతం ఒక రికగ్నైజ్డు కాన్వెం ట్‌లో చేస్తున్నాను. నా తండ్రిని తండ్రి అని చెప్పాలన్నా బాధగా వుంది. సమాజంలో ఏ ఆడపిల్లా 'నాన్నా నా పెళ్ళి చేయవా?' అని తన తండ్రిని నిలదీయదు. నేనూ అంతే. నాకు ఇప్పటివరకూ ఆయన ఒక్క సంబం ధము చూడలేదు. చూసే ఉద్దేశం వున్నట్లు నాకెక్కడా అనిపించలేదు. ఎవరయినా నా పెళ్ళి గురించి ఆయన్ని అడిగితే "గవర్నమెంట్ జాబ్ వచ్చేవరకూ పెళ్ళిచేయను" అంటారు. నాతో చదువుకున్న నా స్నేహితు రాళ్ళందరికీ పెళ్ళిళ్ళు అయిపోయాయి. పిల్లలు కూడా వాళ్ళకి. వాళ్ళు నాకు ఎదురు పడినప్పుడల్లా నేను చాలా సిగ్గుగా ఫీలవుతాను.

పిల్లలమీద అంతా పెద్దవాళ్ళ యిష్టమేనా? మాకు ఆశలు, కోరికలు వుండవా? మా నాన్నకు తన పద్దెనిమిదవ ఏట పెళ్ళయ్యింది. ఇప్పటికి పెళ్ళికి ఎదిగిన కూతురు ఇంట్లో వుందన్న జ్ఞానం ఆయనకు వుండదు. అసహ్యించుకోకండి. దయచేసి నా బాధ అర్థం చేసుకోండి. మా చుట్టు ప్రక్కలవాళ్ళు ఇంకా నాకు పెళ్ళికాలేదు అని అంటున్నారు. ఆ తప్పు నాదా?

మా నాన్న, మా స్కూలు సెక్రటరీ వద్దకు వెళ్ళి మా అమ్మాయి ఇరవై వేల రూపాయలు ఇవ్వమంది అని అడిగాడు. ఆ భ్రష్టుడు ఇచ్చాడు. మా స్కూలు సెక్రటరీ 'నా టీచింగ్ కెపాసిటీ కంటే నా పర్స నాలిటీ చూసే ఆ ఉద్యోగం ఇచ్చాడంటే బాగుంటుంది. ఛీ' ఇవన్నీ తలుచుకుంటేనే అసహ్యంగా వుంది. 'మా ఆవిడకు ఆరోగ్యం బాగో లేదు. మా అమ్మాయి స్కూలు మానేజ్‌మెంట్ దగ్గర అందుకని అప్పు తీసుకుంది ఇవ్వాలి' అని అబద్ధాలు చెప్పి బంధుమిత్రులందరి దగ్గర మా నాన్న అప్పులు చేశాడు. వాళ్ళు నన్ను ఎంతో చిన్న చూపు చూస్తారు. చూస్తున్నారు. ఇవన్నీ భరాయించలేకపోతున్నాను. పైగా ఇప్పుడు పెళ్ళి

కంపల్సరీ అనిపించటం లేదు. ఎందుకంటే అనుభవించే వయసు దాటి పోయింది కదా. అందుకని 'నన్' అవుదామనుకుంటున్నాను. నా నిర్ణయం సరైనదా? కాదా?

జ : ఇరవై మూడు సంవత్సరాలకే మీరు పెళ్ళి చేసుకునే వయసు దాటిపోయింది అనే భావం నుంచి ముందు మీరు బయటపడండి. కేవలం వైరాగ్యంవల్ల వేదాంతం రాదు. మీరు 'నన్' అవుదామనుకుంటే దానికి కారణాలు దేవుడిమీద భక్తి, సమాజ సేవలాంటివైతే బాగుంటుంది. అంతేకానీ మీ నాన్న ఇలాంటివారు, మీకు పెళ్ళి కాలేదు లాంటి ఆలోచన వల్లనైతే మీరు ఆ వృత్తికి కూడా న్యాయం చేకూర్చలేరు. ఇక మీ సమస్యకొస్తే మీరు సంపాదిస్తున్నారు కాబట్టి మీ పెళ్ళికి మీ తండ్రి అనవసరపు సాకులు చెప్తున్నారు అని మీ ఉత్తరం ద్వారా అర్థమయ్యింది. మీరు ఏ మాత్రం ధైర్యం చేయగలిగినా మీ జీవితం యింతకంటే బాగుంటుంది. అందువల్ల మీకు ప్రేమ వివాహాలంటే ఇష్టం లేకపోతే సమాజబద్ధంగానే చేసుకోవాలనుకుంటే మీ ఇంట్లో మీ నాన్నగారు తప్పించి యింకా పెద్దవారు (తాతగారు, మామగారు....) వుంటారు కదా! వారికి నాకు చెప్పినట్లుగానే నిస్సంకోచంగా మీ సమస్య చెప్పండి. ఇందులో అపార్థం చేసుకునేది ఏమీలేదు. మిమ్మల్ని అందరూ అర్థం చేసుకోగలరు. అలా కూడా మీ సమస్య తీరకపోతే పేపర్లో ప్రకటన యిచ్చి తగిన వరుడ్ని ఆహ్వానించండి. ఈ మధ్య యిలాంటి వివాహాలు కూడా సత్ఫలితాలనిస్తున్నాయి.

**పి. శ్రీనివాస్, ఏలూరు**

ప్ర : నేను ఇంటర్ చదివాను. ప్రస్తుతం రెండు సంవత్సరాల నుంచి ఖాళీగా వుంటున్నాను. మా నాన్నగారు నన్ను ఏ తప్పులేకపోయినా 'నాదే తప్పు' అంటూ పదే పదే తిడుతున్నారు. మాకు జోళ్ళషాపు వుంది. మా పనివాడితో కూడా నా గురించి హేళనగా, ఎద్దేవచేస్తూ మాట్లాడతారు. నేను ఉద్యోగం చేస్తాను అంటే వద్దు అంటారు. నాకు మా నాన్నగారంటే భయం. నాన్నగారు ఎదురుగా నేను ఏమీ మాట్లాడను. నన్ను తోటి స్నేహి

తులతో కలిసి తిరగనివ్వరు. సినిమాలకు పంపరు. అప్పుడప్పుడు మా నాన్నగారు తనే నన్ను సినిమాకు తీసికెళుతుంటారు. నేను ప్రతిరోజు ఉదయం ఏడు గంటలకు మా షాపుకు వెళతాను. రాత్రి పదివరకూ ఉండి యింటికి వస్తాను.

మా నాన్నగారు నాకు సరైన బట్టలు కూడా కుట్టించరు. ఆయన పాత పాంటు చొక్కాలు నన్ను తొడుక్కోమంటారు. కనీసం సైజుకూడా చేయించరు. అవి నాకు చాలా లూజు కానీ మా నాన్నగారు మటుకు కొత్తవి తీస్కుంటారు. మా అమ్మగారి బలవంతం మీద ఎప్పుడయినా ఒక జత బట్టలు కొత్తవి నాకు తీస్తారు. నన్ను మా యింటి పనివానికంటే హీనంగా చూస్తున్నారు. నాకు ఒక్కోసారి ఏడుపొస్తుంది. ఇల్లు వదిలి ఎక్కడి కయినా వెళ్ళిపోవాలి అని కూడా అనుకుంటాను. మా నాన్నగారిని సరైన మార్గములో పెట్టవచ్చా? లేదా నేను ఏ విధముగా చేస్తే బాగుంటుందో తెలుపగలరు.

జ : "నేను ఇంటర్ చదివాను. ప్రస్తుతం రెండు సంవత్సరాల నుంచి ఖాళీగా వుంటున్నాను" అని రాశారు. ఇంటర్ పూర్తయ్యాక పై చదువు చదవకుండానూ, ఉద్యోగం చేయకుండాను ఎందుకు ఖాళీగా వుంటున్నారో అర్థంకాలేదు. మీ నాన్నగారు నన్ను ఏ తప్పు లేకపోయినా పదే పదే తిడుతున్నారు అని కూడా తెలియచేశారు. అవును.... నిజంగా తప్పు మీదే. సొంత కాళ్ళమీద నిలబడలేనివారిని చూస్తే అందరూ తిడతారు. మీ నాన్నగారు ఎందుకు తిడుతున్నారు అన్న విషయం ప్రక్కన పెడదాం. గతంలో ఒకసారి ఇలాంటి తండ్రుల ప్రవర్తనలకు కారణం వివరించాను. మీ విషయానికి వస్తే ప్రస్తుతం మీరెలా వున్నారన్నది మీకు ముఖ్యం. మీరు వ్రాసిన సమస్యలన్నీ కూడా ఆర్థిక స్థితితో ముడిపడి వున్నాయి. కాబట్టి సాధ్యమైనంత వేగంగా మీరు ఓ ఉద్యోగం (ఎంతచిన్న దయినా సరే) చూసుకుని చేరండి. మొదట్లో మీ తండ్రిగారు నిరసన వ్యక్తపరచినా మీ 'ఇండివిడ్యువాలిటీ' పెరిగినకొద్దీ మీ మాటలకు విలువ నిస్తారు.

ఉద్యోగంలో జాయినయిన ఆరు నెలల తర్వాత ఆనాటి మీ పరిస్థితిని ప్రస్తుత పరిస్థితితో పోల్చుకుంటే మీ భావాలలో కానివ్వండి, మీపట్ల మీ కుటుంబ సభ్యుల ప్రవర్తనలో కానివ్వండి. అన్నింటిలో స్పష్టమైన మార్పు కనిపిస్తుంది. మీ ఉత్తరంలో వ్రాసిన సమస్యలన్నీ ఆరోజు చాలా చిన్నవిగా కనిపిస్తాయి.

## నిశిల్, వరంగల్

ప్ర : మా నాన్న మహా కోపిష్టి. నేను ఏ మగాడితో మాట్లాడినా బాగా తిడతారు. నేను మగవాళ్ళని 'అన్నయ్య' అని సంబోధిస్తూనే మాట్లాడతాను. కాని మా నాన్న అర్థం చేసుకోరు. నేను పదవ తరగతి పరీక్షలు రాశాను ఇంటర్‌లోనే నీ పెళ్ళి చేసేస్తా అంటున్నారు. మా నాన్న లానే మా చిన్న అన్నయ్య కూడా అనుమానపు మనిషి. అమ్మ చాలా మంచిది. కానీ ఆమె మా నాన్నతో ఎక్కువగా మాట్లాడటానికి భయపడుతుంది. నాకు వాళ్ళని తలచుకుంటేనే ఏడుపు వస్తుంది. అస్సలు ఇంట్లో వుండబుద్ధి కావటంలేదు. మీరు మంచి సలహా ఇస్తారని భావిస్తున్నాను.

జ : మీరు 'అన్నయ్యా' అంటూ సంబోధిస్తూ పరాయి మగవాళ్ళతో మాట్లాడేటప్పుడు మీ నాన్నగారు పక్కనే వుండి వినే సందర్భాలు ఏముంటాయి? రోజూ మీ ఇంటికి యీ 'అన్నయ్య'లు ఎక్కువ మంది వస్తూ వుంటారా? లేకపోతే ఆయన వినే అవకాశం ఎలా కలుగుతుంది?

ఈ అన్నా, చెల్లీ అనే సంబంధాలు రక్త సంబంధీకులకయితేనే బాగుంటుంది. ఒక స్త్రీ పరాయి పురుషుడి ద్వారా ఏ అపాయం జరగకూడదనుకునే సమయంలో 'అన్నయ్యా' అంటూ తన మనసులోని 'జాగ్రత్త' భావాన్ని ఎదుటి పురుషుడికి తెలుపుతుంది. అందుకు తప్ప ఈ 'అన్నయ్య' అనే పద ప్రయోగం ఇంకెందుకూ పనికిరాదు. మీకు నిజంగా బయటివారితో మాట్లాడవలసివస్తే, మీ నాన్నగారు కూడా ఏమీ అనరని నా ఉద్దేశ్యం. మీరు వూరికే కల్పించుకుని మాట్లాడుతూ వుండి వుంటారు. కాబట్టి మీ నాన్నగారికి కోపం వస్తూ వుండవచ్చు.

ఒక వయసులో తనకి స్నేహితులు వుండాలి అని అందరూ అనుకుంటారు. అలాంటి స్నేహం మీరు 'స్నేహితురాళ్ళ'లోనే చేసుకోవచ్చు కదా! స్నేహితులతో చేసుకోవడం ఎందుకు? దానికి 'అన్నయ్యా' అని పేరు పెట్టుకోవటం ఎందుకు చెప్పండి. ముఖ్యంగా మీ యింట్లో వారికి ఇష్టం లేనప్పుడు, మీ భావాలు కరెక్టుగా కలిసే స్నేహితుడు దొరికినప్పుడు స్నేహితుడుగానే వుంచండి.

ఇంటర్‌లో మీ పెళ్ళి చేసేస్తాం అని అంటున్నారని అన్నారు. మీకు బాగా చదువుకోవాలని 'ఇంట్రెస్టు' వుంటే మీ అమ్మగారిద్వారా మీ నాన్నగారికి చెప్పించండి. లేదంటే మీ చిన్న అన్నయ్యద్వారా చెప్పించండి. మీ ఉత్తరం చూస్తుంటే మీకు యింతమంది 'అన్నయ్య' లుండడం మీ చిన్న అన్నయ్యకుకూడా యిష్టంలేనట్లు కనిపిస్తుంది.

మీ యింట్లో మీ నాన్నగారి డామినేషన్ చాలా వున్నట్లు మీ ఉత్తరం ద్వారా తెలుస్తుంది. చాలామంది బాల్యంలో ఒక విధమైన కట్టడిలో పెరిగితే వారు పెద్దలయి తల్లిదండ్రులయ్యాక తమంటే అందరూ భయపడాలని అనుకుంటారు. జీవితంలో ఏ రకమయిన విజయం సాధించలేని పెద్దవారు ఇంట్లో తమమీద ఆధారపడే వ్యక్తులమీద డామినేషన్ చూపించటం ద్వారా అదే గొప్ప విజయమని భావిస్తుంటారు. బహుశా ఈ నాన్నగారు ఆ కోవకు చెందినవారై వుంటారు.

మీరు నిజమయిన విజయం సాధిస్తే, మీ నాన్నగారి సమస్యా, ఈ 'అన్నయ్య'ల సమస్యా చాలా చిన్నవిగా మీకు కన్పిస్తాయి. ఆ విజయం కోసం కృషి చేయండి.

### పుష్పకుమారి, రాజోలు

ప్ర : మా అబ్బాయి టేప్‌రికార్డర్ లేనిదే చదవడు. ఒక ప్రక్కన మ్రోగుతూనే వుండాలి. వాడి చదువుపట్ల మాకు చాలా భయంగా వుంది. వాడితో యీ అలవాటు మానిపించడం ఎలా?

జ : ఈ విషయంలో ఎంత కంగారుపడాలో నిర్ణయించేముందు, అసలు మ్యూజిక్ తాలూకు ప్రభావం చదువుమీద ఎంతవరకూ వుంటుంది అనేది పరిశీలిద్దాం.

మ్యూజిక్ మెదడుని రిలాక్స్ చేస్తుంది. అందులో సందేహంలేదు. అయితే యిందులో రెండు రకాలున్నాయి. ఒడ్డునవున్న చెట్ల ప్రక్కగా సాగిపోయే నదిలాంటిది-ఒక రకం, ఒడ్డునవున్న చెట్టునికూడా తన ప్రవాహంలోకి లాక్కుపోయేది రెండోరకం. మీ అబ్బాయి ఏ రకం మ్యూజిక్‌ని ఇష్టపడుతున్నాడో మీరు గమనించవలసిన విషయం.

మెదడులో కాన్షస్-సబ్‌కాన్షస్ అని రెండు భాగాలున్నాయని మీకు తెలుసుకదా. సబ్‌కాన్షస్‌కి మెదడుకి 'కాన్షస్‌మైండ్' కాపలాదారు అవసరమయిన విషయాల్ని మాత్రమే అది లోపలికి పంపిస్తుంది. మామూలుగా చేసే అసంకల్పిత చర్యలకు సబ్-కాన్షస్ మైండ్ ఎక్కువ శ్రమపడదు. అందుకే మనం పిల్లల్ని తిట్టేటప్పుడు "ఎక్కడో ఆలోచిస్తూ పని చేయకు" అంటాము. కొంతమంది పిల్లలు చదువుతూనే వుంటారు. కళ్ళవెంట అక్షరాలు పరుగెడుతూనే వుంటాయి. మనసెక్కడో వుంటుంది. ఇలాంటి వాళ్ళకు చదువు ఎందుకు ఎక్కదంటే చదివినదాన్ని 'కాన్షస్‌మైండ్' అనే కాపలాదారు, లోపలికి పంపించటం లేదన్నమాట.

మంచి మ్యూజిక్ మెదడులోకి అల్ఫాతరంగాల్ని ఉత్తేజితం చేస్తున్నది అని శాస్త్రజ్ఞులు ఎప్పుడో కనుగొన్నారు. పొలాల్లోనూ, వంటిళ్ళలోనూ హుషారుగా పాటలు పాడుకుంటూ పని చేయటం గమనిస్తూనే వుండి వుంటారు. అయితే మీ అబ్బాయి వింటూన్న మ్యూజిక్, అతని మెదడుని ఉత్తేజితం చేసేదా? ఆలోచనలని ఎక్కడికో తీసుకువెళ్ళేదా అనేది గమనించండి. పైన చెప్పిన మ్యూజిక్ 'నది' లాంటిది అన్న ఉదాహరణ ఇచ్చింది అందుకే! మీ అబ్బాయి వింటున్నది రాంటమ్ మ్యూజిక్ (మంద) స్వరంతో తానంతట అది సాగిపోయేది అనుకోండి. దానివల్ల అతడిమెదడు ఉత్తేజితం చెంది, చదివిన దాన్నంతా ఏ అడ్డూ పెట్టకుండా సబ్‌కాన్షస్ మైండ్‌లోకి పంపిస్తుంది. అంతకన్నా కావల్సిందేముంది? అలాకాకుండా ఏ గ్యాంగ్‌లీడర్ పాటో పెట్టుకొని, తనని చిరంజీవిలా వూహించుకుంటున్నారని అనుమానమొస్తే మాత్రం ఆ అలవాటునుంచి అతన్ని తప్పించండి. బాగా చదువుకున్నవాళ్ళు రీసెర్చి స్కాలర్స్ కూడా అర్ధరాత్రి ఒంటరి

తనాన్ని పారద్రోలటానికి టేప్‌రికార్డర్‌ని ఆశ్రయించేవారు. ఒక రకంగా చెప్పాలంటే అది మంచి అలావాటు కూడా.

### కె. రమణమూర్తి, విజయవాడ

ప్ర : మా అబ్బాయి పదో తరగతి చదువుతున్నాడు. ఎన్ని ట్యూషన్‌లు పెట్టినా, ఎంత చదివించినా, వాడికి ఫస్టుక్లాస్ మార్కులు రావటంలేదు. రేప్పొద్దున ఎమ్‌సెట్‌లో ఎలా లాగుతాడో అర్థంకావటం లేదు.

జ : కనీసం సెకండ్‌క్లాస్ మార్కులు వస్తున్నాయికదా! అంతవరకు సంతోషం. ఫస్టుక్లాసు కోసం ప్రయత్నించటం మంచిదే-కానీ "ఎమ్‌సెట్టే జీవితాశయం, ఇది రాకపోతే వేస్టు అనే భావం మీ అబ్బాయిలో కలుగ చేయకండి. డాక్టరు, ఇంజనీరు కాకపోయినా ఎంతో సంపాదించినవారూ సమాజంలో విశిష్ట స్థానం పొందినవారూ ఇతర రంగాల్లో చాలా వున్నారు. మీ అబ్బాయి సుదీర్ఘమైన ఉత్తరంలో మీ అబ్బాయి సితార్‌లో స్టేట్‌ఫస్ట్ వచ్చాడని వ్రాశారు. వీలయితే ఆంధ్రానుంచి ఒక పండిత రవిశంకర్‌ను పరిచయం చేసే ప్రయత్నం చేయండి. అన్నిటికన్నా ముఖ్యంగా ఎమ్ సెట్ పాసవకపోతే జీవితం వ్యర్థమన్న భావం బలంగా కలిగితే, ఆ తరువాత ఆ న్యూనతనుంచి బయటపడటం కష్టం.

### జె. ఎస్. కె., బాపట్ల

ప్ర : మా అమ్మాయి వయస్సు 14 సంవత్సరాలు. కొద్దిరోజులుగా కిటికీ దగ్గర తచ్చాడుతూ వుండటంతో అనుమానం కలిగింది. నోట్ పుస్తకాలలో ఉత్తరం కనపడింది. బాగా కొట్టాను. మా ఆవిడ భోజనంమానేసి ఏడుస్తూ గొడవ చేసింది. ఆ వెధవ ఇంటర్మీడియెట్ చదువుతూ, మా వీధిలోనే వుంటాడు. అమ్మాయిని స్కూల్‌కి పంపటానికి కూడా భయంగా వుంది ఏం చేయాలో తోచటంలేదు.

జ : కొంత వయసొచ్చాక పిల్లలు, తల్లిదండ్రుల ప్రేమ పరిధిలో

నుంచి బయటపడి కొత్త కేంద్రాలవేపు ఆకర్షితులవటం సహజం. ఈ ఆకర్షణ నిరపాయకరమయిన కేంద్రాలవేపు అయితే కొంతవరకూ మంచిది. ఉపయోగకరమయిన కేంద్రాలవేపు అయితే మరీమంచిది. నిరపాయకరమైన కేంద్రాలంటే నా వుద్దేశ్యం-కబుర్లు, స్నేహితురాండ్రు, సినిమాలు, వగయిరా. ఉపయోగకరమయిన కేంద్రాలంటే-గేమ్స్, నాట్యం, సంగీతం.... పుస్తకాలు. మీరు గమనించి చూడండి. చిన్నతనంనుంచి యిలాంటి మంచి అభిరుచి వున్న పిల్లలు టౌన్స్‌లోకూడా అదే వ్యాపకంలో మునిగుంటారు. ఇక మీ సమస్యకొస్తే యిప్పుడు మీరు మీ అమ్మాయిపట్ల చూపిస్తున్న ప్రేమకన్నా, మరింత ఎక్కువ ప్రేమ చూపించటానికి ప్రయత్నించండి. మీ కుటుంబం ఒక అందమైన పొదరిల్లు (వెల్–నిట్టెడ్) అన్న భావన మీ పాపలో కలుగచేయండి. అంతేకానీ, మీ ప్రపంచంలో మీరుంటే ఆ పాపలో అభద్రతాభావం పెరిగి, బయటినుంచి తగిలే ఏ చిన్న వేడికయినా మనసు కరిగిపోతుంది. ఆ ప్రేమని మీరే యిస్తే తనంతట తానే సర్దుకొంటుంది. ఒక్కసారి "ఆ పరిపక్వత" ఆ అమ్మాయి కొచ్చాక, "నేను ఆ వయసులో ప్రేమించానా" అని తనంతట తానే హాయిగా నవ్వుకొంటుంది. ఆ అమ్మాయి చదువు మాన్పించడంలాంటి దారుణమయిన ఆలోచనలు దరి చేరనివ్వకండి.

## నసరీన్, కడప

ప్ర : నేను పదవతరగతి ఉర్దూమీడియంలో చదివాను. మా నాన్న తర్వాత చదివించనంటున్నారు. అంకుల్, ప్రపంచంలోకి మనం వచ్చిన తరువాత అంతా చూడకపోయినా కనీసం తను పుట్టిన ఊరయినా సరిగ్గా పూర్తిగా చూడని అమ్మాయిని నేను. నాకు గరల్స్ కాలేజీ మా ఊళ్ళో ఎక్కడున్నదీ, ఏడు రోడ్ల జంక్షన్ ఎక్కడున్నదీకూడా తెలియదు. మా నాన్న సినిమాకు పంపరు. టి.వి. చూస్తే చెడిపోతానని అదికూడా కొనలేదు. నాకు ఇంటర్ చదవాలని ఆశ. ఘోషాతోనే చదువుతాను అని నాన్నకు చెబితే చదివించి చాలు, పోయే ఇంటికి మంచిపేరుతే అన్నారు. పైగ్రివేటుగా

చదవాలంటే అది ఇంగ్లీషు మీడియం ఆంకుల్! ఘోషా పద్ధతిని ఎందరో తొలగించటానికి ప్రయత్నించారు. పక్క వీధిలో పెండ్లికి పోవాలన్నా ఘోషాలో పోవల్సిందే అందరి మధ్య వింతగా ఘోషాలో కూర్చోవాలి. నేను మగపిల్లవాడిలా నాన్నను ఎదిరించి చదవలేను. మా ఇంటికి పేపరు వస్తుంది. అన్న తెప్పిస్తాడు. అది చూసి వ్రాస్తున్నాను. నా సమస్యకి పరిష్కారం చెప్పగలరా?

జ : నూరు శాతం చెప్పలేనేమో. మీ ఊళ్ళో మెయిన్‌రోడ్డు కూడా చూడని ఘోషా పద్ధతిలో పెరిగిన మీకు, మీ తండ్రిగారిని చదువుకోసం ఎదిరించి, కృషిలో మీ గమ్యం చేరుకోమని సలహా చెప్పను. అలా చెపితే అది కేవలం "వ్యక్తిత్వాన్ని పెంపొందించుకోవటమెలా?" అన్న వ్యాసములో థియరీ చాప్టరు అవుతుంది తప్ప మీకే విధంగానూ సాయపడదు. అందరూ సరదాగా, అల్లరిగా వుంటే మీరు ఘోషాలో నిర్లిప్తంగా వుండటము మీలో ఎలాంటి కాంప్లెక్స్ పెంచిందో అర్థం చేసుకోగలను.

మీ కుటుంబంలో మిమ్మల్ని అర్థంచేసుకుని మీ తరఫున మీ తండ్రిగారికి నచ్చచెప్పే పెద్దవాళ్ళు ఎవరయినా వున్నారా? ఉంటే ప్రయత్నం కొంతవరకూ ఫలించవచ్చు.

**అరుణ, గుంటూరు**

ప్ర : నాకు పందొమ్మిది సంవత్సరాలు. పదవ తరగతి వరకూ చదివాను. టెన్త్‌లో ఇంగ్లీషు పోయింది. ఒకసారి కట్టాను. పాస్ కాలేదు. నాకు బాగా చదువుకోవాలని....ఉద్యోగం చేయాలని వుంది. కానీ మా ఇంట్లో నన్ను చదివించరు. మా నాన్నగారు ఆర్. టి. సి. లో చేస్తారు. మేము నలుగురు పిల్లలం. నేను మూడో దాన్ని. నాకు తప్ప మిగిలిన వాళ్ళందరకూ బాగానే చదువు చెప్పించారు. నాకు మాత్రం గత మూడు సంవత్సరాల నుంచి ప్రపంచం అంటే యేమిటో తెలియకుండా ఒక పేపర్ చదవకుండా, ఒకరితో మాట్లాడకుండా, ఒక సినిమా చూడనీయ

కుండా కండిషన్‌లో వుంచారు. ఇంట్లో పని, పని, పని, ఇన్నిరోజులు కూడా. ఒక సంవత్సరం క్రితం మేము ఇల్లు మారాము. మా క్రొత్త యింటి ప్రక్కనే గ్రామిక విద్యాపీఠం. దానిలో మిషన్ కుట్టడం నాలుగు నెలల కోచింగ్ తీసుకున్నాను. మా బాచ్ అందరిలో నేనే ఫస్ట్ వచ్చాను. అందరూ మెచ్చుకున్నారు. మా ఇంట్లో మిషన్‌లేదు. ప్రక్క ఇంటి వాళ్ళ మిషన్ మీద బట్టలు కుట్టి వందరూపాయలు సంపాదించాను. మా ఇంట్లో నాకో కుట్టుమిషన్ కొనిపెట్టమని ఎంతగానో మొత్తుకున్నాను. ఏడ్చాను కాని కొనిపించుకోలేకపోయాను.

మా ఇంట్లో అన్ని పనులు రాత్రిపూట మంచాలువేసే దగ్గర నుంచి తెల్లారితీసే పనివరకు, బాత్‌రూమ్‌కి నీళ్ళుపెట్టే దగ్గరనుంచి అందరి బట్టలు ఇస్త్రీ చేసేవరకు నేనే చేస్తాను. చెయ్యాలి. కానీ నా కనీస అవసరాలకు ఒక్కరు కూడా పది పైసలు ఇవ్వరు. నాకు ఒక నెలనుంచి వంట్లో బాగోటం లేదు. అయినా అందరి పనులూ నేనే చెయ్యాలి. ఎవరూ ఒక్క మాత్ర తెచ్చి ఇవ్వరు. కాఫీకూడా తాగమనరు. పైగా ఎప్పుడూ తిడుతూ వుంటారు. నా బట్టలు పూర్తిగా చినిగిపోయాయి. కొత్తవి కొనమంటే, "తెచ్చినవి తినడానికే చాలటంలేదు అంటారు. అలాగని మేము ఆస్థిపరులం కామనుకోకండి. మాకు రెండు పెద్ద పెద్ద బిల్డింగులున్నాయి. ఒక పెద్దప్లాటుస్థల ముంది. మా అన్నయ్య బిజినెస్‌మీద రోజుకి వెయ్యి రూపాయలు తక్కువ గాకుండా సంపాదిస్తాడు కాని అతని భార్య యివ్వనివ్వదు. పెళ్ళికాక ముందు కూడా అన్నయ్య అయిదు పైసలు నాకు యిచ్చేవాడు కాదు.

చెప్పండి.... మా వాళ్ళకు, అన్ని పనులు చేసినా నేనంటే ఎందుకు యిష్టం వుండదు? కనీసం పెళ్ళయినాచేస్తే, భర్త పనులు చేసుకుంటూ అతని నీడలో వుంటాను. అది చాలా తృప్తిగా వుంటుంది కదా. కానీ నా పెళ్ళి రెండు సంవత్సరాలవరకూ చేయరట. ఆఖరుకి ఈ కవరు డబ్బులు కూడా మాప్రక్కనే అద్దెకున్న అమ్మాయిని అడిగి తీసుకుని వ్రాస్తున్నాను. మా ఇంటికి దూరంగా వెళ్ళి, ఏదైనా చేసుకుంటూ బ్రతకాలని వుంది.

అలా వేస్తే 'లేచిపోయింది' అనే నింద నాకు వస్తుంది అని భయపడ్తున్నాను. తప్పకుండా మీరు నాకు ఏదో ఒక దారి చూపిస్తారనుకుంటాను.

జ : ఒక యింట్లో నలుగురు పిల్లలుండి అందులో ముగ్గురు బాగా చదువుకుంటున్నప్పుడు చదువుకోని ఆ నాలుగో పిల్లపై ఒకోపని క్రమ క్రమంగా అంటగట్టడమనేది యిళ్ళల్లో జరిగే సర్వసాధారణమైన పని. మీరా విధంగా ఈ ఊబిలో కూరుకుపోయారని మీ ఉత్తరాన్ని బట్టి తెలుస్తూంది. అయితే చదువులో ఎంత వెనుకపడినా కొంతమంది కొన్ని కళలలో ప్రావీణ్యం సాధిస్తారు. అలా మీరు మిషన్ కుట్టడం వగైరాలలో ప్రావీణ్యం సాధించారు. దాన్ని మీ ఇంట్లో వాళ్ళు గుర్తించకపోవడం దురదృష్టకరం. మీకు జ్వరంగా వున్నప్పుడు మీ యింట్లో వాళ్ళు ఒక్క మాత్ర కూడా ఇవ్వడంలేదు అన్న విషయం నమ్మశక్యంగా లేదు. మీమీద వారికి ప్రేమాభిమానాలు వున్నా లేకపోయినా యింటెడు పనిచేసే యంత్రం ఆగిపోయిందే అన్న భావంతోనైనా వారు మందు తెచ్చిస్తారు. ఇదే టెక్నిక్‌ని మీ ఆయుధంగా వాడుకోవచ్చు. క్రమంగా ఒకో పనిని వాయిదావేస్తూ పనిలో నెమ్మదితనం చూపించారంటే మీ పెళ్ళి త్వరగా జరిగే అవకాశం వుంది. ఇంట్లో వాళ్ళు మీకు భోజనమైతే పెట్టకుండా వుండగలుగుతారు గానీ బలవంతంగా మీ చేత పని చేయించలేరు కదా! ఆ విధంగా అనుసరించి చూడండి. వీలైతే మిషన్ పనిలో నిమగ్నమై డబ్బులు ఎక్కువగా సంపాదించడానికి చూడండి.

## ఆర్. ఆర్. రెడ్డి, కడప

ప్ర : మేము నలుగురు అన్నదమ్ములం. ఇంతకూ సమస్య ఏమిటంటే మా నాన్న డ్రింకర్. తాగివచ్చిన ప్రతిరోజూ యింట్లో అందరినీ దారుణంగా తిడుతూ వుంటాడు. వ్రాయడానికి వీలుకాని భాషలో, బూతులు మాట్లాడుతుంటే, మాకు చాలా ఇన్సల్ట్‌గా వుంది. అతను మా గ్రామానికి సర్పంచ్. మాకు పందొమ్మిది సంవత్సరాలు వచ్చిన తర్వాత కూడా అలా తిడ్తుంటే సహించడం చాలా కష్టంగా వుంది.

జ : తాగి వచ్చినప్పుడే తిట్టి, మిగిలిన సమయాల్లో మీతో బాగానే వుండే పక్షంలో, ఆయన తాగినప్పుడెలా ప్రవర్తిస్తారో మంచిగా వున్నప్పుడు ఒకసారి వివరించి చెప్పండి. (టేప్‌లో రికార్డుచేసి విన్పించినా ఫర్లేదు) ఆయన యింకా అదే పద్ధతి కొనసాగిస్తే మీకు పందొమ్మిది సంవత్సరాలు అంటున్నారు కాబట్టి మీరు మానసికంగా ఆయన్ని ఎదుర్కోవచ్చు. ఒకసారి 'ఎఫెన్స్' అయితే ఆయన 'డిఫెన్స్'లోకి వెళతారు.

**సజ్జా నగేష్, గుంటూరు**

ప్ర : సర్, మా నాన్న అందరితో నవ్వుతూ బాగానే వుంటారు. కానీ హఠాత్తుగా, ఆయనకు కోపం వస్తుంది. అందరినీ తిడతారు. మరల కొద్దిసేపటికే, కోపం తగ్గి మంచిగా మాట్లాడతారు. మా నాన్నగారికి ఎప్పుడు కోపం వస్తుందో తెలీక హడలి ఛస్తున్నాం. బాగానే వున్నారని మాట్లాడితే తిడతారు. మా నాన్నగారి కోపం తగ్గాలంటే మేము ఏం చెయ్యాలి? సలహా ఇవ్వగలరా?

జ : ఈ నవంబర్‌లో నావి "మానసిక విశ్లేషణ" మీద నాలుగు పుస్తకాలు విడుదలవుతున్నాయి. అందులో ఓ పుస్తకం "తల్లిదండ్రులు-పిల్లల సంబంధం" మీద వుంది. దాంట్లో కోపిష్టి తల్లిదండ్రులతో ఎలా ప్రవర్తించాలి అనేది క్లియర్‌గా రాసుంది. వీలైతే చదవండి. దాదాపు ఇరవై, ముప్పై సూత్రాలు దానిలో వ్రాయబడి వున్నాయి.

# III మిమ్మల్ని మీరు గెలవగలరు

## 1 ప్రేమ - వైఫల్యాలు?

ఒక మనిషి మరొక మనిషిని ఎందుకు ప్రేమిస్తాడు?

దీనికి బేసిక్‌గా రెండు కారణాలున్నాయి.

1. ఎవరో ఒకర్ని ప్రేమించి, వారితో ప్రేమింపబడాలని అన్న కోరిక- లేదా-

2. ఒక వ్యక్తి లక్షణాలు బాగా నచ్చి, అతడి వ్యక్తిత్వాన్ని మెచ్చి అతడికి తన ప్రేమ సర్పించకుండా వుండలేని స్థితి. (పాఠకులందరూ ఈ రెండో స్థితివల్లే తమ ప్రేమ ప్రారంభమైందనుకుంటారు. కానీ పరిశీలించి చూస్తే మొదటి కారణమే చాలామందిలో ఎక్కువ కనబడుతుంది.)

ఎవరితోనైనా ప్రేమింపబడాలి అన్న కోరిక ప్రతి వ్యక్తికీ వుంటుంది. కానీ కేవలం ఆ కోరికవల్లే ప్రేమించటం ప్రారంభిస్తే తరువాత వేదన తప్పదు. నేను నిర్వహిస్తున్న "నీకూ-నాకూ మధ్య" శీర్షికలో చాలామంది కుర్రాళ్ళూ, అమ్మాయిలూ వ్రాసే ప్రేమ వైఫల్యాలకు ఇదే కారణం.

"పక్కింటి అబ్బాయి"...., "బస్టాప్‌లో నిలబడిన అమ్మాయి" .... "పెళ్ళిలో కనబడిన కుర్రాడు", "క్లాస్‌మేట్స్...." వీళ్ళందరూ ప్రేమకు టార్గెట్ అవుతుంటారు. ఈ ప్రేమలు తొందరగా వైఫల్యం చెందడానికి కారణం- మనం ప్రేమించే వ్యక్తి గురించి మనకి తెలియకపోవటం. మన ప్రేమను గురించి మన పెద్దవాళ్ళకు చెప్పగలిగే ధైర్యం మనకి లేకపోవటం. కేవలం "అవకాశం" పునాదిగా ఏర్పడిన ప్రేమ ఎక్కువకాలం నిలవదు.

కిటికీలోంచి చూపులు, ఆ తరువాత చేతిసైగలు, ఆపైన బస్‌స్టాపుల్లో బీట్లు, చిరునవ్వుల పలకరింపులు, పేర్లు తెలుసుకోవటాలు, స్నేహితు (రాండ్ర)లకు చెప్పుకోవటాలు, రక్తాలతో ఉత్తరాలు వ్రాసుకోవటాలు, ఏకాంతంలో కలుసుకోవటాలు, మధురస్మృతులుగా ఈ ప్రేమలు మిగిలిపోవటాలూ- సాధారణంగా జరుగుతూ వుంటాయి.

ప్రేమించటానికి వ్యక్తిత్వం వుండాలని టీనేజిలో ఎవరూ అనుకోరు. అందుకే ఈ ప్రేమలు ఇంట్లో పెద్దలకి తెలియకుండా కొనసాగు

తాయి. పెళ్ళివరకూ వచ్చేసరికి అబ్బాయికి ధైర్యం లేకపోవటమో సంపాదన లేకపోవటమో కారణమవుతుంది. అయితే ఈ రెండింటికన్నా భయంకరమైన నిజం మరొకటి వుంది.

తను ప్రేమించిన అమ్మాయిపట్ల (లేదా అబ్బాయిపట్ల) "ఆసక్తి" పోవటం! మరో కొత్త వస్తువు దొరుకుతున్నప్పుడు పాత వస్తువుపట్ల ఆసక్తి పోవటం సహజమే కదా! అదీగాక ఇటువంటి ప్రేమల్లో, పెళ్ళయిన తరువాత....అబ్బాయికి, "ఏమో, నాకు కిటికీలోంచి చెయ్యి వూపింది. ఇలా ఇంకెంతమందితో వ్యవహారం నడిపిందో" అన్న ఫీలింగ్ ఏర్పడితే యిక ఆ సంసారం నరకమవుతుంది. లేదా అనుమానాల్లో ఆ ప్రేమ విఫలమవుతుంది. నాకొచ్చే చాలా ఉత్తరాల్లో "ఆ అమ్మాయి మొదట్లో నేనంటే చాలా యిష్టం చూపేది తరువాత నన్ను పట్టించుకోవటం మానేసింది" అని వుంటాయి.

కారణం చాలా సింపుల్.

ఆ అమ్మాయికి వ్యక్తిత్వం పెరిగి, లేదా అభిరుచి మరొకరిమీదకో మరోవైపుకో మళ్లటమే!

చదువుకునే రోజుల్లో ప్రేమలో పడిన యువతీ యువకులకి, ఒకరి అభిరుచులు ఒకరు కరెక్ట్‌గా, వారి వారి బలహీనలతోసహా తెలుసుకునే అవకాశం వుండదు. కలుసుకున్న కొద్దిసేపూ ప్రేమ ప్రకటించుకోవటానికే సరిపోతుంది. తన లవ్వర్‌కి ఏయే విపత్కర పరిస్థితులలో కోపం వస్తుంది? ఆర్థికావగాహన ఎలా వుంది? మొదలైన విషయాలు పార్కుల్లో బయట పడవు.

అలా అని "ప్రేమ లేదనికాదు. ప్రేమ లౌకికమైనది. మహత్తరమైనది." కానీ.... వ్యక్తిత్వం లేని మనుష్యుల మధ్య అది నిలవదని చెప్పటమే యిక్కడ వుద్దేశ్యం.

ఇద్దరు వ్యక్తులు ప్రేమించుకున్నప్పుడు వారిమధ్య- 'అంతిమ

గమ్యం' నిర్దుష్టంగా వుండాలి. "మా ప్రేమకు పర్యవసానం పెళ్ళికాదు" అని యిద్దరూ ఒక అవగాహనకొచ్చి, యవ్వనాన్ని అనుభవిస్తే ఎవరికీ మానసిక వ్యధ వుండదు. ఇక్కడ నేను నైతిక విలువల గురించి ప్రస్తావించటం లేదు. ఆ విధంగానే ప్రేమించుకుని....విడిపోయి, అదో మధుర స్మృతిగా మనసుల్లో మిగుల్చుకుని వేర్వేరు వివాహాలు చేసుకున్నా ఎవరికీ సమస్యలేదు. (ఈ విధమైన ఆత్మవంచనవల్ల ఏ నష్టం వుందో తరువాత వివరిస్తాను.)

ప్రేమలో ఒకరు శరీరం గురించి, మరొకరు వివాహం గురించి ఆలోచిస్తేనే కష్టం. నాకొచ్చే ఉత్తరాల్లో చాలా శాతం "ప్రేమించుకున్నాం. శారీరకంగా కూడా కలిశాం. మనసులు ఎప్పుడో ఒకటయ్యాయి. ఇప్పుడు పెద్దలకి ఈ విషయం చెప్పాలంటే భయంగా వుంది" అన్న ఉత్తరాలే ఎక్కువ. నిజంగా ఒక అబ్బాయి, అమ్మాయి ప్రేమించుకుని, వారిద్దరూ మేజర్లయి తమ స్వంత కాళ్ళమీద నిలబడి వివాహం చేసుకుంటే ఎవరు కాదనగలరు? అసలు సమస్యే లేదు! నిజమైన ప్రేమ లేకపోవటం, అమ్మ నాన్నలమీద ప్రేమ రిస్కు తీసుకుంటే భవిష్యత్తులో ఏమవుతుందోనన్న భయం– ఇవే సమస్యలు.

ఇన్ని భయాలుంటే అది ప్రేమ ఎలా అవుతుంది? ఆకర్షణ అవుతుంది తప్ప!

మరికొన్ని ఉత్తరాల్లో, "నేను అతనికి కేవలం నుదుటిమీద ముద్దు మాత్రమే యిచ్చాను నేను చెడిపోలేదు" అని వ్రాస్తూ వుంటారు. (పెదాల మీద ముద్దు యిస్తే చెడిపోయినట్టు....)

దీనికన్నా "నేను అతనికి మనసు యిచ్చాను. కనీసం శరీరాన్ని నా భర్తకి మిగిల్చాను" అంటే మరింత నిజాయితీగా వుంటుంది.

ఇంకో వాస్తవం ఏమిటంటే- ప్రేమించినంత మధురంగా వాస్తవ సంసారం వుండదు.

ఒక భావకురాలైన అమ్మాయికీ, అందమైన అబ్బాయికీ ప్రేమ కుదిరిందనుకోండి. కానీ పెళ్ళయ్యాక ఆ అబ్బాయికి నిద్రలో గురకపెట్టే అలవాటుంది అని తెలిసింది. లేదా- ఆ అమ్మాయికి పయోరియా (నోటి దుర్వాసన) వుందని తెలిసింది. దాంతో షాక్ తగిలి కల చెల్లా చెదరయింది.

ఆ కారణంగా వీరిద్దరూ మానసికంగా దూరమవ్వకుండా వుండాలంటే, ఒకరి బలహీనతలు మరొకరు క్షమించుకోగలిగేటంత గొప్ప ప్రేమ బంధం వారిమధ్య వుండాలి. అంతగొప్ప వ్యక్తిత్వం- ఇంత చిన్న వయసులో అలవడుతుందా? (ఈ కారణంగా వచ్చే సమస్యల్ని ఇదే పుస్తకంలో "వివాహానంతర సమస్యలు" అనే చాప్టరులో వివరిస్తాను) ప్రేమకు ముందు ఏవేవో వూహించుకుని, అవి నిజం కాకపోతే చాలామంది యువతీ యువకులు తట్టుకోలేరు. ప్రేమ వివాహాల్లో సాధారణంగా ఇలాగే జరుగుతుంది. పెళ్ళికిముందు ఇద్దరిమధ్యా ఎక్కువ సామీప్యత వుండకపోవటం వల్ల వచ్చే పరిణామం యిది.

'పెద్దలు కుదిర్చిన సంబంధాల్లో కూడా యీ విధమైన రిస్కు వుంది కదా' అని మీరడగవచ్చు.

'రిస్కు' అనేది ఎలాగూ తప్పనప్పుడు మరి ప్రేమించటం దేనికి?

ఆ వయసులో ఎవరన్నా తమని గుర్తించాలనీ, అది ఆపోజిట్ సెక్స్ అవ్వాలనీ, తమ గురించి ఎవరికయినా మనసు విప్పి చెప్పుకోవాలనే కోర్కె ప్రేమకు దారి తీస్తుంది.

16-20 ఏళ్ళ వయసులో శరీరమూ, మనసూ చురుగ్గా శక్తివంతంగా వుంటాయి. ఆ శక్తిని 'ప్రేమ' ఉపయోగించటంవల్ల, వ్యధే తప్ప ఏమీ మిగలదు. నాకొచ్చే ఉత్తరాల్లో చాలావరకూ, "నేను ఇంటర్మీడియట్ చదువుతున్నాను. నేను తొమ్మిదో తరగతి చదివే అమ్మాయిని ప్రేమిస్తున్నాను" అన్న ఉత్తరాలే ఎక్కువ. ఈ ప్రేమ అన్నది ఎంత బలమైనదంటే దీన్నించి ఎవరూ తప్పించుకోలేరు.

ఈ రకమైన ప్రేమల్లో, ప్రతిరోజూ- సాయంత్రం వరకూ ఎదురు చూడటాలూ, రెండు మూడు గంటలు రహస్యంగా కలుసుకోవటాలూ, మళ్ళీ వివాహంతో విడిపోవటాలు- చదువుమీద మనసు లగ్నం కాక పోవటం- ఇన్ని బాధలున్నాయి ప్రేమలో....

తొలి ప్రేమ అద్భుతమైనది!

అది భార్యతోనో, భర్తతోనో అయితే ఎంతో సంతోషం! సాయం త్రాలు రెండు గంటలు గడిపి అసంతృప్తిగా విడిపోనవసరంలేదు. రహస్య స్థలం కోసం వెతుక్కోనవసరంలేదు. రాత్రిళ్ళూ, పొద్దున్న కూడా 'అధి కారికంగా' కలిసి వుండొచ్చు.

అంతేకాదు.

తొలి ప్రేమ ఒకర్నొకరు అర్థం చేసుకొని, ఒకరి లోపాల్ని ఒకరు క్షమించుకునే శక్తినిస్తుంది. బలహీనతల్ని అధిగమించే బలాన్ని యిస్తుంది. ఆ విధంగా భార్యాభర్తలు చిన్న చిన్న లోపాల్ని క్షమించుకోవచ్చు. వాళ్ళిద్దరికి అది తొలి ప్రేమ అయితే....

అదే విధంగా తొలి స్పర్శ బలీయమైనది. ఏ భయమూ లేకుండా దాన్ని మొదటి రాత్రి అనుభవించవచ్చు. గోడల వెనకా, పార్కుల పొదల వెనకా కక్కుర్తి పడనవసరంలేదు.

తొలి ప్రేమని పెళ్ళి అయ్యేవరకూ వాయిదా వేసుకోవటంవల్ల ఇన్ని లాభాలున్నాయి.

## ప్రేమంటే-

ప్రేమంటే ఏమిటో, ఎలా కలుగుతుందో 'లేడీస్ హాస్టల్' అన్న నవలలో ఈ విధంగా సాగుతుంది.

"నీకు పదిమందితో కలిసే అవకాశం వుండి, అందులో ప్రత్యే కంగా ఒకరే నచ్చితే అది ప్రేమ!

ఆ సమయంలో నువ్వు పూర్తి స్పృహలో వుంటే ప్రేమ. మరోలా చెప్పాలంటే నువ్వు అవతలి మనిషిని కలుసుకున్న మొదటి పదిసార్ల వరకూ (కనీసం) ప్రేమలో పడకుండా వుంటే అది ప్రేమ!

నీ స్నేహితుడి (స్నేహితురాలి) పది సుగుణాలు నీకు తెలిసి నప్పుడు ఆ వ్యక్తిలో నీకు నచ్చని అయిదు అభిరుచులు, అయిదు దుర్గుణాలు కూడా నువ్వు చెప్పగలిగి వుండాలి. అలా చెప్పగలిగితే, ఆ మనిషిని ఇష్టపడితే అది ప్రేమ.

అందుకనే సాయంకాలం నీడలా పెరిగేది ప్రేమ.

ప్రేమకీ, ఆకర్షణకీ తేడా కూడా ఇదే నవలలో చెప్పడం జరిగింది.

"ఒక వ్యక్తి నీమీద ఇంటరెస్టు చూపించగానే నీకు మత్తు కలిగితే అది ఆకర్షణ."

ఆ వ్యక్తిని తప్ప మరెవరినీ తరచుగా కలుసుకునే అవకాశంలేక, మాట్లాడే వీలుకాక....దొరికిన ఆ ఒక్కడే గొప్పగా కనపడి, ఆ ఇరుకు సందుల కిటికీల్లోంచో, స్కూల్ వరండాల్లోనో, కాలేజీ గార్డెన్స్‌లోనో స్నేహం చేయవలసి వస్తే అది ఆకర్షణ.

పరిచయం అయిన మొదటి రోజుకన్నా, సంవత్సరం తర్వాత అవతలి మనిషి సానిధ్యం తక్కువ ఆనందాన్నిస్తే అది ఆకర్షణ.

మరోలా చెప్పాలంటే ఉదయం పూట నీడలా తిరిగేది ఆకర్షణ.

ప్రేమ గురించి నేను చేసిన విశ్లేషణలన్నిటిలోనూ ఇది గొప్పదని నా అభిప్రాయం. నాకొచ్చే ఉత్తరాల్లో చాలా శాతం తమ తొలి పరిచయం గురించి వివరిస్తూ వుంటాయి. అందరిదీ ఆకర్షణ అయి వుండవచ్చు. నాది మాత్రం నిశ్చయంగా ప్రేమే అని వ్రాస్తూ వుంటారు. మరికొంతమంది "మేము మాట్లాడుకోలేదు. కానీ గాఢంగా ప్రేమిస్తున్నాను" అంటూ వుంటారు.

ఈ ప్రేమలన్నీ పెళ్ళికి దారితీయవు.

ఒక వయసులో ప్రతి మనిషికీ ఆకర్షణ సహజం. అయితే దీన్ని 'ప్రేమ' అనుకోవటంవల్ల రెండు నష్టాలున్నాయి. ముందే చెప్పినట్టు పెళ్ళికి ముందు ప్రేమవల్ల విషాదమే తప్ప ఆనందంలేదు. ప్రేమించి పెళ్ళికిగల అభ్యంతరాలు వెతుక్కుని (మా ఇంట్లో ఒప్పుకోరు వగైరా) విడిపోవటంవల్ల- తరువాత వచ్చే లైఫ్ పార్ట్‌నర్ 'రెండో అనుభవం'

అవుతుంది. అంతకుముందు ప్రేమించిన వ్యక్తితో తరచు కంపారిజన్ చేసుకోవలసి వస్తుంది. ఇది అసంతృప్తికి దారితీస్తుంది. ఇప్పుడయితే పెళ్ళి సెకండ్‌హాండ్ వ్యవహారమవుతుంది, అప్పుడు ఆహ్లాదత తగ్గిపోతుంది. ఇంకోసారి తప్పు చేద్దామనిపిస్తుంది.

తొలి ప్రేమలో అవతల వ్యక్తి కోసం ఎదురుచూపు వుంటుంది. ఎప్పుడూ ఆ వ్యక్తికి సమీపంలోనే వుండాలని వుంటుంది. ఆ వ్యక్తి రెండు రోజులపాటు కనిపించకపోతే డల్‌గా వుంటుంది.

ఇది చాలా గొప్ప అనుభవం. మధురమైనది, బాధాకరమైనది కూడా.

ఒకసారి ఈ అనుభూతి ఒక వ్యక్తిమీద కలిగాక మరోసారి మరొకరికి కలగటం చాలా కష్టం. దీన్నే మెంటల్ వర్జినిటీ అంటారు.

ఈ వర్జినిటీ భర్త/భార్య దగ్గర పోగొట్టుకుంటే తరువాత ముప్పై నలభై సంవత్సరాలు ఆ అనుభూతిని జీవితాంతం అనుభవించవచ్చు.

అదే పెళ్ళికి ముందయితే కేవలం రెండు మూడు సంవత్సరాల కోసం బోయ్‌ఫ్రెండ్ కోసం పోగొట్టుకోవాలి.

ఆషాఢ మాసాలూ, శ్రావణ శుక్రవారాలు, భర్త దగ్గర్నుంచి ఉత్తరాలు, భర్త గుండెమీద ఎంజాయ్ చేయాలంటే ప్రేమని పెళ్ళివరకూ పోస్టుపోన్ చేయాలి. రెండు మూడు సంవత్సరాల ఆనందం కోసం నలభై సంవత్సరాల ఆనందాన్ని తెలివైనవాళ్ళు ఎవరూ తొందరపడి వదులుకోరు.

వదులుకుంటే మెటీరియలిస్టులవుతారు. తమ చర్యల్ని సమర్థించుకోవటానికి ఇక కారణాలు వెతుక్కోవటం ప్రారంభిస్తారు. అప్పుడు వాళ్ళు తమతో తాము యుద్ధంచేసి ఓడిపోతారు.

**బి. వి. లక్ష్మి, కళ్యాణదుర్గ**

ప్ర : నేను ఒక అబ్బాయిని ప్రేమిస్తున్నాను. అతనికి చెడు అలవాట్లు వున్నాయి. వాటిని మాన్పించడానికి మీరు కొన్ని మంచి అలవాట్లు

చెప్పండి. వాటిలో నేను ఆ అబ్బాయిని మంచివాడిగా చేసి పెళ్ళి చేసుకుంటాను.

జ : ముందు మీరు ఆ అబ్బాయిని ఏ అలవాట్లు చూసి ప్రేమిస్తున్నారో తేల్చుకోండి. అవే అతని మంచి అలవాట్లు. అంతకన్నా చెడ్డ అలవాట్లు ఎక్కువ వున్న పక్షంలో అతన్ని వదిలేయండి. ఎందుకంటే మీరు శరత్ నవలల్లో హీరోయిన్ కాదు కాబట్టి.

## జి రాజు, సికింద్రాబాద్

ప్ర : నా వయసు ఇరవై సంవత్సరములు. డిగ్రీ చేస్తున్నాను. మా పెద్దన్నయ్య పెళ్ళి ఆరు సంవత్సరాల క్రితం అయ్యింది. అప్పుడు మా వదిన చెల్లెలితో పరిచయం ఏర్పడింది. గత రెండు సంవత్సరాల నుంచి మేమిద్దరం ఫ్రీగా వుంటున్నాము. తను ఇక్కడికి వచ్చినా, నేను వాళ్ళ ఊరు వెళ్ళినా వున్ననాళ్ళు ఇద్దరం కలిసే వుండేవాళ్ళము. నేనంటే తనకి ప్రేమంటూ నన్ను అల్లుకొని మరీ తిరిగేది. న్యూ ఇయర్‌కి లవ్ పేరున ఉన్న గ్రీటింగులు పంపేది. అప్పుడప్పుడు సినిమాలలోని ప్రేమ గీతాలు రాసి కూడా పంపేది.

మాకు బాంగిల్స్ స్టోర్ వుంది. అక్కడ, నేను ఇంటర్ పాసైయ్యాక శాంతి అనే అమ్మాయి పరిచయమైంది. రోజూ మా షాపుకు వచ్చేది. ఆమె స్వచ్ఛమయిన స్నేహాన్ని నాకు అందించింది. శాంతితో స్నేహం మొదలై ఇప్పటికి రెండు సంవత్సరాలు కావస్తుంది. ఈ మధ్య ఒకసారి ఎవరో పెళ్ళికి ఊరు వెళ్ళి పది రోజుల తర్వాత వచ్చాను. వచ్చేసరికి మా వదిన చెల్లెలు పెళ్ళి వేరెవరితోనో ఖాయమైంది. ఇది ఏమిటని మా మరదలను అడిగితే, "నాకు మా వాళ్ళను ఎదిరించే ధైర్యం లేదు బావా" అంది. ఆమె సమాధానంతో నా బ్రతుకు తెడ్డులేని నావ వలె అయ్యింది. ఈ ఆలోచనలతో నేను సతమత మవుతుంటే శాంతి వచ్చి 'ఏమిటి అలా వున్నావు?' అని ప్రశ్నించింది. సమాధానం చెప్పలేదు. దాంతో 'నువ్వేదో దాస్తున్నావు, ఇలా చేస్తే ఇక మాట్లాడను' అంటూ

మరదలి బాధతో కుమిలిపోతున్న నన్ను ఒంటరివాడ్ని చేసి వెళ్ళిపోయింది. శాంతి మాట్లాడక ఇప్పటికి తాజాగా నెల రోజులయ్యింది.

నాకు యీ జీవితం శూన్యంగా అన్పిస్తుంది. ఈ లోకాన్ని విడిచి వెళ్ళాలని వుంది. నా వేదనలోంచి విషాద గీతాలు పుట్టుకొస్తాయి. ఇలా మూడీగా వుండటం చూసి నా స్నేహితులు నన్ను ఎగతాళి చేస్తున్నారు. అన్నం తినడం మానివేయడంతో నాకు ఏదో అయ్యిందని మా ఇంట్లో వాళ్ళు భయపడుతున్నారు. ఈ నెల రోజుల నుండి నా శరీరం మీద నాకే ఇంటరెస్టు లేదు. కృంగి కృశించి అస్థిపంజరంలా అయ్యాను. నా మనసుకు నేను ఓ శత్రువులా కన్పిస్తున్నాను. ఈ వేదన భరించలేక భక్తి మార్గాన్ని ఆశ్రయిద్దామనుకున్నాను కాని సాధ్యం కావడంలేదు. గుడికి వెళ్ళినా, ఆ తీపి జ్ఞాపకాలు నీడవలే వెన్నాడి నన్ను పీడిస్తున్నాయి. ఈ మనోవేదనను నేను భరించజాలననుకున్నాను. నా విరహవేదనకు తగు సమాధానం ఒసంగి, నా మనసు ముక్కలు గాకుండా చేస్తారని ఆశిస్తున్నాను.

జ : మీరు యీ ఉత్తరం వ్రాసి ఇప్పటికే అయిదు నెలలైంది. కాబట్టి యీ మధ్య కాలంలో మీరు మానసికంగా కొంత తెరిపిన పడివుంటారు. ఇలాంటి వ్యవహారాలలో ముందున్నటువంటి బాధ, కాలం గడుస్తున్న కొద్దీ వుండదు. మీ మరదలికి మీకు మధ్య వున్న వ్యవహారంలో "ఆమె గ్రీటింగులు పంపేది, ఆమె ఉత్తరాలు వ్రాసేది...." అంటూ నేరం అంతా ఆమె మీదకు తోస్తూ రాశారు. మీ తరఫు నుంచి మీరేం చేశారో చెప్పలేదు. ఆ తరువాత పరిచయమైన శాంతి స్వచ్ఛమైన స్నేహాన్ని అందించింది అని వ్రాశారు. అంటే మీ మరదలిది స్వచ్ఛమయిన స్నేహం కాదా? ప్రేమలోనే స్నేహం ఒకభాగం కదా! "నాకు మా వాళ్ళను ఎదిరించే ధైర్యం లేదు" అంటూ మీ మరదలు పెళ్ళి చేసుకుని వెళ్ళిపోతే, కుమిలిపోతున్న మీ దగ్గరకు శాంతి వచ్చి "ఏమిటిలా బాధపడుతున్నావు?" అని అడిగినప్పుడు, ఆమె మీకు స్వచ్ఛమయిన స్నేహితురాలై వుంటే, మీరు మీ సమస్య ఆమెకు చెప్పవచ్చుగా! మీరెందుకలా చేయలేదు? మీరు దాయడం, ఆమె అపార్థం చేసుకుని వెళ్ళిపోవడం.... ఇదంతా ఎందుకు? ఇంతకీ మీ బాధ

మీ మరదలికి మరొకరితో పెళ్ళయినందుకా? మీ స్వచ్ఛమయిన స్నేహితురాలు శాంతి మిమ్మల్ని వదిలి వెళ్ళిపోయినందుకా? స్పష్టంగా మీరు వ్రాయలేదు.

మీ మరదలు, మీరు రెండు సంవత్సరాలు కలిసి తిరుగుతున్నప్పుడు మీ పెళ్ళి విషయం మీ పెద్దవాళ్ళకు ఎందుకు చెప్పలేదు? పైగా తన వాళ్ళని ఎదిరించే ధైర్యం లేక ఆమె మరొకరిని పెళ్ళి చేసుకుందని నెపంవేసి మీరింతగా కుమిలిపోవడం ఎందుకు? ఏ విధంగా చూసినా మీ మరదలు తనకు తానే దగ్గరై, మీనుంచి తనకు తానే దూరమయ్యింది అన్న రంగు మీరే పులుముకున్నారు అన్పిస్తోంది. మీ వయసు ఇరవై సంవత్సరాలే అంటున్నారు కాబట్టి, ముందు డిగ్రీ పూర్తిచేయండి. అంతవరకూ శాంతితో "స్వచ్ఛమయిన స్నేహం" జరపండి.

**రవికుమార్, తిరుపతి**

ప్ర : నేను ఎమ్మెస్సి ఫైనల్ ఇయర్ చదువుతున్నాను. నేను నా క్లాస్‌మేట్‌ని ప్రేమిస్తున్నాను. ఆ అమ్మాయికి ఎలా తెలపాలో తెలియటం లేదు. ఈ వయసులో లెటర్ ఆమెకు వ్రాస్తే, చాలా అసహ్యంగా వుంటుంది. నేను ఫ్రెండ్‌షిప్ నుంచి ప్రేమకు, ప్రేమనుంచి అలౌకిక స్థితికి చేరుకున్నాను. నన్నేం చేయమంటారు?

జ : మీరు అలౌకిక స్థితికి చేరుకున్నాను అన్నారుకదా. బాగానే వుంది. కాని మీరు ఏ రకమయిన అలౌకిక స్థితికి అంటే వివేకానందా తరహా అలౌకిక స్థితికా, వైరాగ్య అలౌకిక స్థితికా, లేక రజనీష్ టైప్ స్థితికా వివరంగా వ్రాయలేదు. ఏ విధమైన అలౌకిక స్థితి చేరుకున్న వారికైనా ఈ "ప్రేమలు-సమాధానాలు" అనవసరం. అసలా మాటకొస్తే అలౌకిక స్థితికి చేరుకున్న వారెవరూ తామాస్థితికి చేరుకున్నామనుకోరు.

ఈ వయసులో ఆమెకు లెటర్ వ్రాస్తే అసహ్యంగా వుంటుంది అన్నారు. మీ వయసు ఎంతో చెప్పలేదు. మీ ఉద్దేశ్యం ప్రకారం ఏ వయసులో వ్రాస్తే బాగుంటుందో కూడా తెలుపలేదు.

మీ 'అలౌకిక స్థితి'లో ఇంకా ఆమె ప్రేమ తాలూకూ భావం వుంటే లెటర్‌కంటే డైరెక్టుగా ఆమెను కలిసి మీ ప్రేమను ప్రస్తావించి వివాహం చేసుకుంటాను అని తెలుపండి. ఆమె అవుననో, కాదనో మీకు సమాధానం చెపుతుంది. ఆమె 'నో' అంటే ప్రస్తుత తరహా స్థితికంటే మరో రకమైన అలౌకిక స్థితికి చేరుకోండి. 'యస్' అంటే వివాహ అనంతరం ఎలాగూ అలౌకిక స్థితికి చేరుకోవటం తప్పదుకదా.

కె. విజయకుమార్, నూజివీడు

ప్ర : నేను డిగ్రీ ఆఖరి సంవత్సరము చదువుతున్నాను. నేను ఒక అమ్మాయిని ప్రేమించాను. లెటర్ ద్వారా నా ప్రేమను ఆ అమ్మాయికి తెలిపాను. ఆమె మూడున్నర నెలలు ఏ సమాధానము చెప్పలేదు. అన్ని రోజులు నాతో చనువుగా వుండేది. ఆ వంద రోజులలో ఇరవై లెటర్లు పంపించాను. వాటిలో నా పరిస్థితి పూర్తిగా వివరిస్తూనే వున్నాను. ఆమె నా ప్రేమ విషయం మీద మాత్రం ఏమీ మాట్లాడేది కాదు. కాని మిగతా మాటలు ప్రవర్తనని బట్టి ఆమె నన్ను ప్రేమిస్తున్నదనే అనుకున్నాను.

ఈ మధ్యలో నన్ను ప్రేమించాను అంటూ ఒక అమ్మాయి నాకు లెటరు రాసింది. ఈ విషయం నేను ప్రేమించిన అమ్మాయితో చెప్పాను. "నిన్ను ప్రేమించిన ఆ అమ్మాయి ఎవరో ఒకసారి నాకు చూపించు" అని ఆమె అంది. చూపించాను. ఆ సమయంలోనే మీ నవల "థ్రిల్లర్" చదివాను. "ప్రేమ గొప్పది. ప్రేమ సాధించలేనిదంటూ ఏమీలేదు...." అని ఆ నవల నాకు సందేశాన్నిచ్చింది. నా ప్రేమలో నిజాయితీ వున్నప్పుడు నా ప్రేమ ఆమెను ఎందుకు కదిలించలేకపోతున్నది అని ఆలోచించాను. నా ప్రేమను పరీక్షించాలనుకున్నాను. ఆ రోజునుంచి ప్రతిరోజు ఆమె సమాధానం చెప్పేవరకు నా ఒంటిని కోసుకుని రక్తంతో ఉత్తరాలు వ్రాసి ఆమెకు పంపాలి అని నిర్ణయించుకున్నాను. నా నిర్ణయాన్ని ఆమెకు తెలిపాను. కానీ ఆ మరుసటి రెండు రోజులు నా రక్తంతో వ్రాసిన రెండు లెటర్లు ఆమెకి పంపడానికి అవకాశం కుదరలేదు. మూడోరోజు మొత్తం మూడు లెటర్లు మధ్యవర్తి ద్వారా పంపాను. వాటిని చూసి ఆమె ఏడ్చిం

దట. "దయచేసి రక్తంతో ఇలా లెటర్లు వ్రాసి పంపవద్దని చెప్పు" అని బ్రతిమిలాడిందట. మధ్యవర్తి ద్వారా తెలిసింది. నేను అదేమీ పట్టించుకోలేదు. నాలుగో లెటర్ కూడా అలాగే పంపాను. దానికిజవాబు వచ్చింది. నేను నిన్ను అన్నయ్యలా చూస్తున్నాను. ఇలా రక్తపు లెటర్లు పంపవద్దు అన్నది ఆ ఉత్తర సారాంశము. అది చదవగానే నా మనసు ముక్కలై పోయింది. నేను ఆమెని ఏమనలేదు. "నేను చనిపోతున్నాను" అని ఆమెకే చెప్పాను. అలాగే చావుకు దగ్గరగా వెళ్ళిపోయాను. ఆమె నుంచి అప్పుడు మరో ఉత్తరం వచ్చింది. "నేను తమాషాకి అన్న మాటలను బట్టి నువ్వు ఆత్మహత్య చేసుకుంటావనుకోలేదు. నువ్వు చనిపోతే నామీద ఒట్టు" అని వ్రాసింది. మరికొన్నాళ్ళు గడిచాయి. ఇప్పుడు మళ్ళీ "నిన్ను అన్నయ్యలాగానే చూస్తున్నాను" అంటోంది. ఆమె లేకపోతే నేను జీవించలేను. అనుక్షణం నన్ను అల్లుకుపోతున్న ఆమె ఆలోచనలతో పిచ్చివాడినై చచ్చిన వాడిలా బ్రతుకుతున్నాను. నా సమస్యకు సరైన పరిష్కారం సూచించి నా ప్రేమకు ప్రాణం పోయగలరని ఆశిస్తున్నాను.

జ : మీరు ఒక అమ్మాయిని ప్రేమించి మీ ప్రేమను లెటర్ ద్వారా తెలిపిన తర్వాత ఆమెని కలుసుకుంటూ- ఆ ఉత్తరం గురించి ఏమీ చర్చించకుండా దాదాపు వందరోజులు గడిపారంటే ఆమెనో పోస్ట్‌బాక్స్‌లా భావించారన్నమాట. బహుశా అదే అభిప్రాయం ఆమెలోకూడా కలిగివుంటుంది.

"థ్రిల్లర్" నవలలో "నిస్వార్థమైన" ప్రేమ సాధించలేనిది ఏదీలేదు అని.... ప్రేమించిన వాడికి సంబంధించిన విషయంగా చెప్పాను. అంతే కానీ ప్రేమతో వేధించమని ఎక్కడా చెప్పలేదు. మీ ఉత్తరం చూస్తుంటే మీరిద్దరూ ప్రేమ పేరుతో హైడ్ అండ్ సిక్ (దాగుడు మూతలు) గేమ్ ఆడుకున్నట్లనిపిస్తుంది. రక్తంతో ఉత్తరాలు వ్రాయడం ప్రేమకు పరాకాష్ట కాదు. చాలా హీనమైన చర్య. ప్రేమ సాధించలేనిది ఏదీ లేదని మీరు....సోఫియా లారెన్స్, ఎలిజబెత్ టేలర్, శ్రీదేవి, రేఖ వాళ్ళందరినీ ప్రేమించేసి, నా ప్రేమ సాధించలేనిది ఏదీ

లేదు అంటూ రక్తంతో వాళ్ళందరికీ ఉత్తరాలు వ్రాస్తే వాళ్ళ పనులు మానుకుని, మిమ్మల్ని వెతుక్కుంటూ నూజివీడువచ్చి ప్రేమించరు.

మీరు ఏదో విధంగా ఆ పిల్లని మానసికంగా బలహీనపర్చి పెళ్ళి చేసుకున్నా మీ ఫస్టు నైట్‌లో మిమ్మల్ని 'అన్నయ్యా' అని సంబోధిస్తే ఒక్కసారి మీ పరిస్థితి ఫూహించుకోండి. అలా జరగదు అని మీకేమైనా నమ్మకముందా? నాకు మాత్రం మీ లెటర్ చదివాక అలాగే జరుగుతుందని పించింది. ఒక్కసారి ఆలోచించండి. మిమ్మల్ని పవిత్ర భావంతో చూస్తున్న ఆ పిల్లని ఇలా రక్తాలు చిందించి, లెటర్లు వ్రాసి వేధించడం మీకేమైనా న్యాయంగా అనిపిస్తోందా? అయినా 'మిమ్మల్ని ప్రేమిస్తున్నాను' అని మరో అమ్మాయి వ్రాసిన ఉత్తరాన్ని మీరు ప్రేమిస్తున్న అమ్మాయికి ఎలా చూపించగలిగారు? ఆ విధంగానైనా ఈమెలో ఈర్ష్య కలుగజేసి, ప్రేమని పొందాలనుకున్నారేమో? అవన్నీ పాత పద్ధతులు. అమ్మాయిలు వాటిని పట్టించుకోవడం మానేసి చాలా కాలమైంది. ఇక భవిష్యత్తులో నైనా ఒకరు వ్రాసిన ఉత్తరాలు మరొకరికి చూపించకండి.

మిమ్మల్ని (కరుగ్గా ప్రవర్తించి) వదులుకోలేని ఆమె బలహీన మనస్తత్వాన్ని క్యాష్ చేసుకోవడం పాపం.

ఉత్తరాలు వ్రాస్తూ మీ రక్తాన్ని వృధా చేయడంకంటే రక్తదానం చేయండి. బీదవాళ్ళెవరికయినా ఉపయోగపడుతుంది.

**అనుపమ, తుని**

ప్ర : నా వయసు పద్దెనిమిది. నేను ఒక అబ్బాయిని ప్రేమించాను. అతను కూడా నన్ను ప్రేమించాడు, కానీ మా నాన్నగారికి అతనంటే అయిష్టం. నేను ఆ అబ్బాయి లేకుండా, చూడకుండా వుండలేను. పెళ్ళి చేసుకుంటే అతన్నే చేసుకోవాలి అని అనుకుంటున్నాను. దానికి మా నాన్నగారు ఒప్పుకోరనిపిస్తుంది. మా నాన్నగారిని బాధపెట్టడం నాకు యిష్టంలేదు. అలాగని ప్రేమించిన అతన్ని వదులుకోవడానికి సిద్ధంగా లేను. నా సమస్యకో పరిష్కారం సూచించగలరు.

జ : మీ సమస్యలో మీరు అతనియొక్క ఆర్థిక స్థితిగతులు గాని, విద్యార్హతలు గాని రాయలేదు. మీ నాన్నగారు ఒప్పుకోరని ఎందుకను కుంటున్నారు? కులం, మతం....లాంటి తేడాలుండబట్టా? లేక అతని స్థితి గతులు బట్టా? ఇక అతను మీ తండ్రా అన్న సమస్యకొస్తే....ఉదాహర ణకు మీ పర్సులో అయిదు రూపాయలే వున్నాయి. మీకు సినిమాకి వెళ్ళాలని వుంటుంది. హోటల్‌కి వెళ్ళాలన్పించవచ్చు. అయితే ఆ డబ్బుతో మీ రెండు కోర్కెల్లో ఏది తీర్చుకోవాలన్నది మీరు నిర్ణయించు కోవాలి. కాబట్టి మీరు మీ స్నేహితుడు కలిసి మీ నాన్నగారిని కలవండి. ఈ విషయాన్ని చర్చించండి. అసలు మీ నాన్నగారికి అతనంటే ఎందుకు అయిష్టమేర్పడింది? అతను బజారులో నిలబడి మీకు సైగలేమయినా చేస్తుండగా మీ తండ్రిగారు చూశారా? లేక అతని వ్యక్తిత్వం సరైనది కాదనా? మీరు దాన్ని ముందు గ్రహించండి.

మీ తండ్రిగారిని కాదని అతన్ని ఎన్నుకున్న పక్షంలో అతను కూడా అంత ధైర్యం చేయగలడా? ఇటువంటి విషయాల్లో మగవాళ్ళకి ముందు వున్నంత ఆవేశం తరువాత వుండదు. ఆ విషయం దృష్టిలో వుంచుకోండి.

**శోభన, నెల్లూరు**

ప్ర : నా వయసు ఇరవై సంవత్సరాలు. నాదొక వింత సమస్య. నేను టెన్త్ చదువుతున్నప్పుడు నన్ను ఒక అబ్బాయి లవ్‌చేశాడు. అతడు అది నాకు తెలిపితే, అప్పుడు బాగా తిట్టాను. కానీ అప్పటినుండి ఆ అబ్బాయి గురించి ఆలోచించడం మొదలుపెట్టాను. అలా కొంచెం కొంచెం యిష్టం పెరిగింది. కానీ నేను తిట్టడంతో అప్పటినుంచీ అతను నా వెంట పడటం మానేశాడు. కానీ ఖచ్చితంగా చెప్పగలను. అతనికి నేనంటే చాలా యిష్టం. ఆ తరువాత చదువురీత్యా ఇద్దరం విడిపోయాం. ప్రక్క ప్రక్క ఇళ్ళవటంవల్ల శెలవుల్లో మాత్రం కలుసుకునేవాళ్ళం. నేను ప్రస్తుతం డిగ్రీ ఫైనల్ ఇయర్ చేస్తున్నాను. అతను ఇంజనీరింగ్ చదువు తున్నాడు. మా ఇంట్లో నాకు పెళ్ళి చేయాలనుకుంటున్నారు. కానీ నాకు

యిష్టంలేదు. ఈ ఆరు సంవత్సరాలలో అతన్ని గురించి ఆలోచించని రోజులేదు. అతను ఎప్పుడయినా కనిపిస్తేమాత్రం ఇష్టంలేనట్లు నటిస్తాను. అలా ఎందుకు చేస్తానో నాకే తెలియదు. కానీ ఇప్పుడు నేను ఇష్టపడుతున్నట్లు అతను అర్థం చేసుకున్నాడు. అయితే నాతో ఏమీ మాట్లాడటం లేదు. అసలు ఇన్ని సంవత్సరాలలో ఒక్క మాటకూడా మాట్లాడుకోలేదు. అతనికి ఇంకా చదువు పూర్తికాలేదు. పూర్తయినా అతను నన్ను ప్రేమిస్తాడని నాకు నమ్మకము లేదు. 'నాకు పెళ్ళి యిష్టంలేదు. అతన్ని ప్రేమించాను....' అని చెప్పడానికి కూడా వీలులేదు. ఎందుకంటే ముందు అతని నుంచి రెస్పాన్సు రావాలి కదా! కనీసం అతనితో పెళ్ళి కాకపోయినా, ఫ్రెండ్ షిప్ అయినా చేయాలని వుంది. మీ సలహా తెలుపగలరు.

జ : ఒక అబ్బాయి మీతో 'ఐ లవ్యూ' అనగానే మీరు 'నో' అనటం చాలా సహజమైన ప్రక్రియ. ఇంతకుముందు చెప్పినట్లు హీరో 'ఐ లవ్యూ' అనగానే హీరోయిన్ 'నో' అనాలని మన రక్తంలో జీర్ణించుకుపోయింది. కాబట్టి మీరు ఆ విధంగా అన్నారు. ఇక ప్రాక్టికాలిటీకి వస్తే ఒక మనిషి యొక్క ఎదుగుదల (మెంటల్ ఏజ్) అతని ఫిజికల్ ఏజ్ తో సంబంధం లేకుండా పెరుగుతూ వుంటుంది. కొంతమందికి శారీరకంగా వయసు పెరిగినా మెంటల్ గా పెరగదు. కొంతమందికి తొందరగా పెరుగుతుంటుంది. అలా మన భావాలలో చాలా మార్పులొస్తుంటాయి. ఈ ఆరు సంవత్సరాలలో బహుశా అతను మానసికంగా ఎదిగి ఈ ప్రేమలు-పెళ్ళిళ్ళమీద నమ్మకం పోగొట్టుకొని వుండవచ్చు. ఇక ప్రస్తుతానికి వస్తే "ఇప్పుడు నేను అతనంటే యిష్టపడుతున్నట్లు అర్థం చేసుకున్నాడు" అని వ్రాశారు. కానీ అతను మిమ్మల్ని అర్థం చేసుకున్నట్లు ఏ విధంగా మీరు నిర్ధారించుకున్నారో వ్రాయలేదు. ఎప్పుడయినా మీరు సైగ చేస్తే అతను నవ్వాడా? దాన్ని మీరు "ఇష్టం"గా అన్వయించుకుంటున్నారా?

మీరు మీ పర్సనల్ ఈగో సంతృప్తి కోసం అతను కన్పించినా ఇష్టంలేనట్లు నటిస్తున్నారు. మీరు యిష్టంలేనట్లు నటిస్తున్నప్పుడు అతను

ఇష్టపడుతున్నట్లు ఎలా అర్థం చేసుకున్నారో నాకు అర్థంకాలేదు. ఇన్ని సంవత్సరాలలో ఒక్కమాట కూడా మాట్లాడకుండా అతన్ని మీరు ఏమి అర్థం చేసుకున్నారు? అతన్ని ఎలా ప్రేమిస్తున్నారు? ఇవన్నీ పక్కన పెడితే, తన చదువు పూర్తయినా అతను మిమ్మల్ని ప్రేమిస్తాడనే నమ్మకం మీకు లేదు కాబట్టి, మీరు అతనితో మామూలు స్నేహం చేయాలనుకోవడం కూడా ఒక రకంగా తప్పే. ఎందుకంటే ఇలాంటి స్నేహాలు మొదట్లో మామూలుగా ప్రారంభమైనా అతను ఒకప్పుడు మిమ్మల్ని ప్రేమించిన వ్యక్తి కాబట్టి, ప్రస్తుతం అతన్ని మీరు ప్రేమిస్తున్నారు కాబట్టి ఈ స్నేహం 'కేవలం' స్నేహంగా నిలవదని నేననుకుంటున్నాను. అలా కాకుండా ఒక రోజు అతన్ని కలుసుకుని ఈ ఆరు సంవత్సరాలలో ఒక్కరోజు కూడా అతన్ని గురించి ఆలోచించని రోజు లేదని చెప్పి, అతని అభిప్రాయం తెలుసుకోండి. అతనుకూడా ఒప్పుకుంటే, ఇంకో రెండు సంవత్సరాలలో అతని గ్రాడ్యూయేషన్‌కూడా పూర్తవుతుంది కాబట్టి మీరు వివాహం చేసుకోవచ్చు. అతను "సరే" అంటే వెంటనే మీ యింట్లో యీ విషయం తెలపండి. అది ముఖ్యం.

**ఎస్. సి. ఎస్., తిరుపతి**

నా వయసు ఇరవైఏడు. నేను ఎమ్.ఎ.బి.ఇడి. చేశాను. ప్రస్తుతం గవర్నమెంట్ హైస్కూల్‌లో టీచర్‌గా పని చేస్తున్నాను. నేను ఎమ్. ఎ. చదువుకునే రోజుల్లో ఓ ఇంటర్ అబ్బాయి పరిచయమయ్యాడు. అతని మనసు వెన్నపూస. అతని మనసు గురించి చెప్పాలంటే ఒక్క నాలుక చాలదు. నన్ను చూడందే అతను ఒక్కరోజు కూడా వుండలేడు. నా గురించే అతను చదువును కూడా పాడుచేసుకుని ఇంటర్ ఫెయిలయ్యాడు. నాకు జీతం వచ్చిన ప్రతినెలా అతనికి ఖర్చులకని వెయ్యి రూపాయలు యిస్తాను. కొద్దిరోజులు పోయాక ఆ డబ్బును దాచి నాకు బట్టలు వగైరా కొని పెడతాడు, 'ఇలా చేయవద్దు' అని చెప్పినా వినడు. కాని అతనికున్న తెలివితేటలు మాకెవరికీ లేవు. నాకు యిప్పటికే రెండుసార్లు అబార్షన్‌లు అయ్యాయి. సార్! నా ప్రియుడు బంగారంలాంటి మనసున్నవాడు. అతని గురించి మీకో విషయం చెప్తా! మీరు బాగా నా చెలికాడ్ని అర్థం చేసుకో

గలరు. నన్ను ఫలానా ప్రదేశానికి ఫలానా టైమ్‌కి రమ్మని కబురు పంపు తాడు. నేను గంట ఆలస్యంగా వెళాతాననుకోండి. నేను వచ్చేవరకూ నా కోసం అక్కడే కూర్చుని వుంటాడు. కోపంగా, మౌనంగా వుంటాడు. మాట్లాడడు. తరువాత నేను మెల్లగా అతని జేబులో వున్న డబ్బులను చూడటమో, వుంచటమో చేస్తాను అయినా మాట్లాడకపోతే కూల్‌డ్రింక్స్ తాగాలని వుందండి అని అడిగితే చాలు వెంటనే వెళ్ళి తెస్తాడు. అప్పుడు అతనికి నాపై వున్న అభిమానానికి నా కళ్ళల్లో కన్నీరు పరుగులు తీస్తాయి పట్టరాని దుఃఖం వస్తుంది. అప్పుడు తను "ఏంటి పిచ్చిదానా! మీ అమ్మా నాన్న గుర్తుకొచ్చారా? లేక జ్వరమా? మీ స్కూల్లో ఎవరయినా నిన్ను ఎగతాళి చేశారా? చెప్పవే బుజ్జి" అంటూ బుజ్జగిస్తాడు.

మా ప్రేమ గురించి మా ఇంట్లో ఎవరికీ తెలీదు. మా నాన్న పరమ రాక్షసుడు అతనికి తెలిస్తే మా పెళ్ళి జరగనివ్వడు. నా ప్రియుడికి పెద్ద పెద్ద రాజకీయ నాయకులతో, ఆఫీసర్లతో పరిచయాలున్నాయి. వారి సహ కారంతో ఉద్యోగం కూడా సంపాదించుకునే శక్తి అతనికుంది. అందుకని మా జిల్లాలోనే ఓ మారుమూల ప్రాంతానికి ట్రాన్స్‌ఫర్ చేయించమని చెపుతున్నాను. దూరంగా వుంటే అక్కడ రిజిష్టర్ మ్యారేజ్ చేసుకుని ఇద్దరు పిల్లలు పుట్టాక తిరిగి మా ప్రాంతానికి బదిలీ అయి వస్తే సమస్య తీరిపోతుంది- అని నా ఆలోచన. మా యిద్దరిలో ఎవరు ఇంకొకరిని పెళ్ళి చేసుకోపోయినా వాళ్ళు ఆత్మహత్య చేసుకోవడం ఖాయం. ఇతడు లేనిదే ఒక్క క్షణం కూడా బ్రతకలేను. నేను ఏ మార్గం ద్వారా పెళ్ళి చేసు కుంటే బాగుంటుందో తెలుపగలరు.

జ : ప్రేమ ఎంత హెలూసినేషన్ (భ్రాంతి) యిస్తుంది అనటానికి మీ ఉత్తరం ఒక ఉదాహరణ. మనం ఎవరినయినా ప్రేమిస్తే వారిలో అన్నీ గొప్ప గుణాలే కనిపిస్తాయి. మీరు ఎం. ఎ. చదువుతూ, ఇంటర్ కుర్రాడిని ప్రేమించానని అన్నారు. అతనిలో అపారమైన తెలివితేటలున్నా యని కూడా తెలిపారు. ఇంటర్ ఫెయిలయ్యాడు అన్నారు. కానీ మీ ఉత్తరం చదివాక మీ నుంచి ప్రతి నెలా వెయ్యి రూపాయలు తీసుకోవ డానికి మొహమాటపడని వ్యక్తిత్వమున్నవాడిలా వున్నాడు. ఆ అబ్బాయి

ఆ డబ్బుతోనే మీకు బట్టలు కొనిపెడుతున్నాడు అన్నారు. మీరు ఓ గంట ఆలస్యంగా వెళితే కోపం రావడమనేది గొప్ప వ్యక్తిత్వ లక్షణాలలో ఒకటి కాదు. మీరు వ్రాసిన ఏ ఒక్క ఉదాహరణలో కూడా అతని గొప్ప వ్యక్తిత్వం కనిపించలేదు. పైగా ఉద్యోగం సంపాదించుకోగలిగి ఖాళీగా వుండటం అతడి ఎస్కేపిజాన్ని సూచిస్తుంది.

పెద్ద పెద్ద రాజకీయ నాయకులతో పరిచయమున్న అతను రాజకీయ నాయకులు మనుష్యులను వాడుకున్నట్లుగా మిమ్మల్ని వాడుకుంటున్నాడనే అనుమానం కలుగుతున్నది. అసలు మీరు కొంతకాలం పెళ్ళి చేసుకోకుండా వుండటానికి ఏ అడ్డంకుందో అర్థంకాలేదు. 'మీ నాన్న పరమ రాక్షసుడు అయినప్పుడు మీరు రెండు సంవత్సరాల తర్వాత పెళ్ళి చేసుకున్నా, రెండు సంవత్సరాల ముందు పెళ్ళి చేసుకున్నా రాక్షసుడిలానే వుంటాడు. ఆ కారణంగా రెండుసార్లు అబార్షన్ చేయించుకుని మీ ఆరోగ్యం ఎందుకు పాడుచేసుకున్నారు. మీరు దూర ప్రాంతాలకు ట్రాన్స్ఫర్ చేయించుకుని పెళ్ళి చేసుకున్నా కూడా మీకు పిల్లలు పుట్టిన విషయం మీ నాన్నకి తెలుస్తుంది కదా. కాబట్టి మీ సమస్యకు పరిష్కారం ట్రాన్స్ఫర్ కాదు. ఇప్పటికే మీరు చాలా ఆలస్యం చేశారు. మీ ప్రియుడు కూడా రాజకీయ నాయకుడిలా మారకముందే అతన్ని వివాహం చేసుకోవడం మంచిది. సాధారణంగా మనం ప్రేమించినవారి వ్యక్తిత్వం గురించి ఎవరయినా గొప్పగా మాట్లాడకపోతే మనకి రుచించదు. అలా మీ మనసు బాధపడితే క్షమించండి.

## సి. పి. శ్రీనివాసులు రెడ్డి, చిత్తూరు

ప్ర : నేను పది చదివే రోజులలో నాకు అయిదుగురు స్నేహితులు వుండేవారు. వాళ్ళంతా తప్పితే నేనొక్కడిని టెన్త్ 'సెకండ్‌క్లాసు'లో పాసయ్యాను. అప్పుడు మా వాళ్ళందరిలో నాకు మంచి పేరొచ్చింది. నాకు ఇంజనీర్ కావాలనే కోరిక అప్పట్లో బాగా వుండేది. దాంతో నన్ను 'రెసిడెన్షియల్ కాలేజీ'లో మా నాన్నగారు జేర్పించారు. నా దురదృష్టంకొద్దీ

ఇంటర్ తప్పాను. ఆ తర్వాత సెప్టెంబర్ పరీక్షకు ప్రిపేరవ్వసాగాను. ఆ మధ్య కాలంలో ఓ రోజు సాయంత్రం నా స్నేహితులతో మాట్లాడుతున్న సమయంలో ఆ అమ్మాయి ప్రసక్తి మా మధ్య చర్చకు వచ్చింది. ఆ అమ్మాయిని ప్రేమించాలని చాలామంది అప్పటికే ప్రయత్నించి ఓడిపోయారు. మా స్నేహితుడు ఒకడు మా అందరితో "మీలో ఎవరైనా సరే ఆ అమ్మాయిని ప్రేమలోకి దింపగలిగితే వంద రూపాయలు యిస్తాను. ఛాలెంజ్" అన్నాడు. నాకు చాలా థ్రిల్ అనిపించి నేను సాధించాలనుకున్నాను. కానీ ఆ విషయం ఎవ్వరికీ చెప్పలేదు. మిగిలిన నా స్నేహితులకులేని మంచి అవకాశం ఒకటి నాకుంది. ఆ అమ్మాయి మా ఎదిరింటిలోనే వుండేది. చివరకు విజయం సాధించాను. అప్పుడే మా సప్లిమెంటరీ రిజల్ట్స్ వచ్చాయి. ఇంటర్ పాసయ్యాను. ఎమ్‌సెట్ కోచింగ్‌కు చేరాను. ర్యాంక్‌కోసం బాగా కష్టపడి చదవసాగాను. మా ఇంటి ప్రక్కనే ఓ ట్యుటోరియల్ వుంది. దాంట్లోకి నాకు తెలిసిన ఓ టెన్త్ కంపార్టుమెంట్ పరీక్షకు వెళ్ళే అమ్మాయి ట్యూషన్‌కు వస్తుండేది. ఎమ్‌సెట్ పరీక్ష రోజు దగ్గరవుతుండగా ఓరోజు అనుకోని పరిస్థితులవల్ల ఆ అమ్మాయిని అల్లరి చేయవలసి వచ్చింది. ట్యుటోరియల్‌కి వెళ్ళి మరీ ఆమెను తిట్టాను. ఎమ్‌సెట్ ర్యాంక్ రాలేదు. నా ప్రాబ్లమ్ ఏమిటంటే ఈ కారణాలవల్ల ఏదో తెలీని బాధ మనసును పట్టి పీడిస్తుంది. దాంతో చదవలేకపోతున్నాను. నేను ఇంజనీర్ కావాలనే కోరిక నాలో బలముగా వుంది. అయినా ఏం చేయలేకపోతున్నాను. మొన్నీమధ్య జ్యోతిష్కులు కొందరు నన్ను, నా చేతిని చూసి నాకు ఇంజనీర్ అయ్యే యోగం లేదన్నారు. అది ఓ దిగులయ్యింది. నేను ఇంజనీర్ కావడంకోసం నా ప్రాణాలయినా ఇవ్వడానికి సిద్ధంగా వున్నాను. నన్ను ఏం చెయ్యమంటారో చెప్పండి.

జ: వంద రూపాయలకోసం ఒక అమ్మాయిని ప్రేమలోకి దింపడమనేది చాలా చిన్న వయసులో మీరు చేసిన ఒక అనాలోచితపు చర్య. ఇక పోతే మీరు ఎమ్‌సెట్ పరీక్ష ముందురోజు అనుకోకుండా ట్యుటోరియల్స్‌లో

ఒక అమ్మాయిని ఏడిపించానని రాశారు. కానీ కారణం రాయలేదు. దీన్ని బట్టి నా కర్థమైంది ఏమిటంటే ట్యుటోరియల్ సంఘటన తర్వాత ఆ అమ్మాయిపట్ల అనవసరంగా తప్పు చేశానేమో అనే అపరాధ భావం మీలో మొదలయి వుంటుంది. దానికి ముందు మీరు ఇంటర్ తప్పడం, ఆ తర్వాత ఎంట్రన్స్‌లో రాంక్ సంపాదించలేకపోవడంలను కూడా మీ తప్పులుగా భావించి వుంటారు. చినుకు చినుకు కలిసి వాగులా మారినట్లు మొదట చెప్పిన అపరాధ భావానికి తర్వాత రెండు కలవడంతో....అలా మీ బాధ పెరిగి వుంటుంది. దీన్నుంచి మీరు బయటపడాలంటే మీరు మీ లక్ష్యసాధనకు బాగా కృషి చేయండి. ఇంజనీరింగ్ అంటే బి. ఇ. బి. టెక్ డిగ్రీలనే మీ అపోహ ముందు పోగొట్టుకోండి. మీకు నిజంగా మీ లెటర్‌లో రాసిన కోర్కె వుంటే, ఎంట్రన్స్ ద్వారానే కాకుండా చాలా విధాలుగా మీరు ఇంజనీర్ కావచ్చు. మీ యొక్క తెలివితేటల స్థాయి, చదువులో మీరు చేసే కృషినిబట్టి డిప్లొమా చేయండి. దానినుంచి మీరు ఇంజనీర్ కాగలరు.

అంతేకాని జ్యోతిష్కుల మాటలు నమ్మకండి. ఎవరయినా మీ చేతిని చూసి మీరు డాక్టరవుతారా? యాక్టరవుతారా? లేక ఇంజనీరవుతారా? అన్నది నిర్ధారణగా చెప్పగలిగారంటే, వాళ్ళు మీ మూర్ఖత్వంతో ఆడుకుంటున్నారని తెలుసుకోండి. ఈ అనవసరపు భావాలకు ప్రాధాన్యత యిచ్చి, ఆలోచించి మీ సమయాన్ని వృధా చేసుకోకండి.

## యన్. ఆనందరావు, భీమవరం

ప్ర : నేను బి. ఇ. చదువుతున్నాను. సెలవులకి మా ఊరు వెళ్ళినప్పుడు ఎదురింటికి ఒక అమ్మాయి చుట్టంగా వచ్చింది. ఒక్క పదిరోజులలోనే ఆ అమ్మాయితో ప్రేమలో పడ్డాను. నాలుగు నెలల తర్వాత ఆ అమ్మాయినుండి ఉత్తరమొచ్చింది. నా పరిచయానికి ముందు ఒకతనితో ప్రేమలోపడి అబార్షన్ అయిందని ఆ లెటర్‌లో వ్రాసింది. "ఈ విషయం ముందే చెపితే ఇంతవరకూ వచ్చేది కాదుకదా! నువ్వు ఇప్పటివరకూ ఎందుకు చెప్పలేదు?" అనడిగాను. తను ఏమీ చెప్పలేకపోయింది. నాకు

గత నాలుగు నెలలనుండి ఆ అమ్మాయి గతం, ఆ అమ్మాయి గురించి వేరేవాళ్ళు (అబార్షన్ విషయం తెలిసినవాళ్ళు) చెప్పే మాటలు, ఇవన్నీ రోజూ గుర్తుకొచ్చి చాలా బాధపడుతున్నాను. ఈ అమ్మాయిని గతంలో ప్రేమించింది తన ప్రక్కింటి వ్యక్తట. అతడిని చూసినప్పుడల్లా నేను బాధ పడవలసి వస్తుంది. ఆ అమ్మాయిని పెళ్ళి చేసుకోమంటారా? ఇంత బాధ పడుతున్నా ఆ అమ్మాయితో ప్రేమ కొనసాగిస్తున్నాను. ఆ అమ్మాయిని పెళ్ళి చేసుకోమని సలహా యిస్తే, నాకు ఆ అమ్మాయి గత విషయం జీవితంలో గుర్తు రాకుండా సలహా యిమ్మని అర్థిస్తున్నాను.

జ : ఏ అమ్మాయి కూడా పరిచయమైన మొట్టమొదటిరోజే నాకు ఇంతకుముందే అబార్షన్ అయ్యిందని చెప్పుకోదు. మీరు ప్రేమిస్తున్నారని తెలిసే మీ స్నేహితురాలు నిజాయితీగా మీకు తన గత జీవితం గూర్చి చెప్పింది. పరిచయమైన పదిరోజులలోనే ప్రేమలో పడ్డానన్నారు. కాబట్టి అబార్షన్ గూర్చి ముందే ఎందుకు చెప్పలేదన్న మీ ప్రశ్న నిర్హేతుకం. ఆ అమ్మాయిని పెళ్ళిచేసుకోకముందే మిమ్మల్ని మీ ప్రక్కవాళ్ళ మాటలు బాధపెడితే రేపు పెళ్ళయ్యాక ఆమె పక్కింటివారిని, ఎదురింటివారిని చూసినా బాధగానే వుంటుంది. ఇప్పటి బాధ....రేపటి అనుమానమవుతుంది. ఆ అమ్మాయిని పెళ్ళి చేసుకోవటంవల్ల మీకు జరిగే నష్టంకన్నా మిమ్మల్ని చేసుకోవటంవల్ల ఆ అమ్మాయికి జరగబోయే నష్టం ఎక్కువని నాకని పిస్తోంది.

('ప్రేమని కొనసాగిస్తున్నాను' అన్నారు. ఈ వాక్యం చాలా అసందర్భంగా వుంది.)

## రమాకాంత్, కర్నూలు

ప్ర : నేను బి. కాం. మొదటి సంవత్సరం చదువుతున్నాను. నేనొక అమ్మాయిని ప్రేమించాను. ఆ అమ్మాయి నా స్నేహితుడిని ప్రేమించింది. అతను నన్ను ప్రేమించే అమ్మాయిని ఇష్టపడుతున్నాను....ఏం చేయాలి?

జ : దీన్నే 'నసీబ్' అంటారు. కాలమే ఈ సమస్యని పరిష్కరిస్తుంది. మీరొక పని చేయండి. మీ నలుగురూ కలిసుండే సందర్భాలు వీలైనంతవరకూ ఎక్కువగా వుండేలా చూడండి. దీనివల్ల చాలావరకూ 'కమ్యూనికేషన్ గ్యాప్' తొలగిపోతుంది. తను ప్రేమించేవాళ్ళు తన కళ్ళ ముందే వేరొకరిపట్ల ఇష్టాన్ని ప్రదర్శిస్తూ వుంటే, "అందని ద్రాక్షపళ్ళు పులుపు" అన్న సామెత, చేతిలోవున్న ఒక పక్షి పొదలో వున్న రెండు పక్షులకి సమానం అన్న సామెతలో వున్న నిజం అర్థమవుతుంది. మీ నలుగురిలో కనీసం ఇద్దరికి అర్థమైతే చాలు. నసీబ్‌లో శత్రుఘ్నసిన్హా ఆ రకంగానే తెలుసుకున్నాడు.

## ఎన్. ఎస్., బేతంచెర్ల

ప్ర : నా వయస్సు 26 సంవత్సరాలు. పద్దెనిమిదేళ్ళ వయస్సు నుంచి నాకో స్నేహితుడుండేవాడు. 6 సంవత్సరాలపాటు ఇద్దరం ప్రేమించుకున్నాం. కానీ ఎన్నడూ హద్దు మీరలేదు. తర్వాత అతడు వేరే వివాహం చేసుకోవటంతో నాకు కోపం, దుఃఖం కలిగాయి. అతనికి ఇంకో స్నేహితుడు వున్నాడు అతడు నన్ను ఓదార్చాడు. నా స్నేహితుడి మీద కసితో అతడికి కొద్ది రోజుల్లోనే శారీరకంగా దగ్గరయ్యాను. కానీ తొందరలోనే అతడు నా పరిస్థితిని వాడుకున్నాడని తెలిసింది. పైగా అతడు వివాహితుడుకూడా. ఇప్పుడు నాకు పెళ్ళి సంబంధాలు చూస్తున్నారు. ఒకర్ని ప్రేమించి మరొకరివలన శారీరకంగా పాడైన నేను నా భర్తకి ఏ సుఖం ఇవ్వవలెను? నేనేం చేయాలి?

జ : అమ్మాయికీ, అబ్బాయికీ మధ్య స్నేహం- అదీ ఇద్దరికీ మొట్ట మొదటిది అయితే, ఈ ప్రపంచంలో ఎక్కడా ఉండనంత నిజాయితీతో ప్రారంభమవుతుంది. ఆ తర్వాత స్త్రీ తన స్నేహితుడికి మానసికంగా దగ్గరవ్వాలని, సామాజిక కట్టుబాట్లు మధ్య తన పవిత్రత నిలుపుకుంటూ (ప్రియుడి నుంచి) ఆదరణ పొందాలని ఆశిస్తుంది. కానీ మగవాడు పవిత్ర

మైన స్నేహపు భ్రాంతినుంచి తొందరగా బైటపడి 'కనీసం ముద్దన్నా'తో చివరి కేంద్రం వేపు మొదటి అడుగు వేస్తాడు. ఇలాటి వ్యవహారాలలో ఎలాగూ పెళ్ళి చేసుకోబోతున్నాంగా అన్న ఆత్మవంచన ముసుగు ఎలాగూ వుంటుంది.

కొందరు దగ్గరవ్వటానికి ఒప్పుకుంటారు. కొందరు ఒప్పుకోరు. కొన్ని పెళ్ళిళ్ళు అవుతాయి. కొన్ని చీకటి అనుభవాల గుర్తులుగా మిగిలి పోతాయి. మీరు వ్రాసినట్లు అనివార్య కారణాలవల్ల విడిపోవటాలే ఎక్కువ.

మనం బాగా నమ్మినవాడూ, మనసుకి దగ్గరగా వచ్చినవాడూ (కనీసము మనం అలా అనుకొంటున్నవాడూ) అకస్మాత్తుగా మన మనసు గాయపరిచి, దూరమైపోతే ఆ షాక్‌నీ, వేదననీ మూడోమనిషి దగ్గర వెలిబుచ్చుకోవాలనిపించటం లోక సహజం. మన వాదనని మనం కన్విన్సింగ్‌గా చెప్పుకోవటానికే 'చూశారా- అతనివల్ల నేనెంత బాధతో వున్నానో' అని బాగా అర్థం చేసుకొనేలా చెప్పటానికి....మనం సాధారణంగా ఇద్దరికీ తెలిసిన వ్యక్తిని జడ్జిగా ఎన్నుకొంటాం. ఇద్దరి ప్రేమ వ్యవహారాలు తెలిసిన అటువంటి వ్యక్తి అయితేనే కదా మన ఆరోపణల్నీ, కన్నీటిని అర్థం చేసుకోగలిగేది! కొందరైతే తమ ప్రాణ స్నేహితురాండ్ర దగ్గిర వాపోతారు. మీరు మొదట మార్గం ఎన్నుకున్నారు. అయితే మీ మొదటి స్నేహితుడు 'లాలిత్యం' నుంచి 'ఎస్కేపిజం' వైపు వెళితే, మీ రెండో స్నేహితుడు 'లౌక్యం' నుంచి 'స్వార్థానికి' వెళ్ళాడు. ఫలితంగా మీరు మీ భర్తకివ్వవలసింది కోల్పోయారు.

మీరు చెప్పింది కొంతవరకూ నిజమే. ఫస్టు లవ్ భర్తకివ్వక పోవటము వలన కొన్ని నష్టాలున్నాయి. మొదటి ప్రేమలో అవతలి వ్యక్తిలో మనకి నచ్చని గుణాలని సర్దుకుపోయే శక్తి వుంటుంది. ఒక రకమైన మత్తు వుంటుంది. చిన్న చిన్న సరదాలు, లాలిత్యం, తధాత్మత అన్నీ వుంటాయి. ఆ రకంగా ప్రేమించిన వ్యక్తిని వివాహం చేసుకోవాలని అమ్మాయి రెండు సంవత్సరాల తాత్కాలిక థ్రిల్ కోసం, నలభయ్ సంవ

త్సరాల శాశ్వత రొమాన్స్ కోల్పోతుంది. ఎక్కడయితే 'పోలిక' వస్తున్నదో "ఇన్‌వాల్వ్‌మెంట్" వుండదు కదా.

అయితే ఇదంతా మీరు మీ మొదటి స్నేహితుడి వలన కోల్పోయారు తప్ప, రెండో స్నేహితుడి వలన కాదు. రెండో స్నేహితుని వల్ల కోల్పోయింది కేవలం కన్యత్వం మాత్రమే.

ఇక మీ సమస్యకొద్దాం. పదిహేను సంవత్సరాల క్రితం 'ఋషి' అన్న నవలలో ఒక వాక్యం వ్రాశాను. "ఎప్పుడంటే అప్పుడు ఫ్రెష్‌గా మొదలు పెట్టటానికి జీవితం ఒక వ్యవహారం కాదు" అని.

కానీ ఆ అభిప్రాయం తప్పని అనుభవం నేర్పింది. మనం చేసిన తప్పువల్ల కొన్ని కోల్పోవలసి రావటం తప్పదు. కానీ జీవితాన్ని అనుభవించే హక్కు పోయిందనుకోవటం తప్పు. ఏ స్నేహితులూ లేకుండా వివాహం చేసుకోవటానికి ఇద్దరు స్నేహితులతో పూర్వ పరిచయాలున్న తరువాత చేసుకోవటానికి తేడా వున్న మాట నిజమే! కానీ ఆ సమస్య మీది, మీ భర్తది కాదు. "ఇదే మీరు జాగ్రత్తగా గమనించవలసిన విషయము! ఒక భార్య ద్వారా భర్త ఎంత సంతృప్తి చెందుతాడో అంత తృప్తిని మీరు మీ భర్తకిచ్చిన పక్షంలో, మీరు అతనికి చేస్తున్న అన్యాయమేమీ లేదు. అతన్ని తృప్తిపరచటం ద్వారా మీరూ క్రమంగా పూర్వపు విషయం మర్చిపోతారు. మీ పూర్వ పరిచయాల్ని ఒక మధురమైన అనుభూతులుగా కాకుండా, వీలయినంత తొందరలో మరచిపోగలిగే తమ భావాలుగా స్మృతిపథంలోనుంచి చెరిపేయండి. ప్రస్తుతం మీరు అనవసరమయిన విషయానికి ప్రాధాన్యత యిస్తున్నారు. వయసు పెరిగేకొద్దీ మథన తగ్గిపోతుందని మాత్రం చెప్పగలను. మీ సంతోషమనేది మీ ప్రవర్తన; మీ సర్దుకుపోయే గుణం, మీ భర్త ఎలాటి వాడొస్తాడు అన్న అదృష్టం, మీ మనస్తత్వం వగయిరాలమీద ఆధారపడి వుంటుంది తప్ప గత అనుభవాల మీద కాదు.

## కె.యస్. లత, విజయనగరం

ప్ర : నేనూ, నా స్నేహితురాలు ఒకే అబ్బాయిని ప్రేమించాము. ఈ సమస్య తీరేదెలా?

జ : సమస్య మీది కాదు అతనిది.

**వి.ఎం., పల్లె**

ప్ర : నేను హాస్టల్ నుంచి మా ఊరొచ్చినప్పుడల్లా ఊరంతా తిరిగే దాన్ని. అప్పుడు నాకో అబ్బాయి పరిచయం అయ్యాడు. దాదాపు అయిదు సంవత్సరాలు ప్రతీ సంవత్సరం శలవుల్లో కలుసుకునే వాళ్ళం. 1985లో మా పరిచయం అయింది. '91లో నేను మేజర్ని అయ్యాను. నా డిప్లొమా కూడా పూర్తయ్యింది. ఆరు సంవత్సరాల గాఢ స్నేహం తర్వాత మేము పెద్దలకు తెలియకుండా రిజిష్టర్ మారేజ్ చేసుకున్నాము. చేసుకున్న ఒక నెలదాకా ఎవరిళ్ళల్లో వాళ్ళం వుండిపోయాం. ఆ నెలరోజులూ నేను ఎన్నో కలల్లో తేలిపోయేదాన్ని. తెలిసీ తెలియని వయసులో పడిన ఆకర్షణకి ప్రేమ అని పేరు పెట్టుకుని తరువాత పెద్దవాళ్ళు కుదిర్చిన సంబంధం చేసుకునే అబ్బాయిలు, అమ్మాయిలకన్నా మేమెంతో సిన్సియర్ అని పొంగి పోయేదాన్ని.

వాళ్ళు మా ఇంటికొచ్చి నన్ను తీసుకువెళ్ళారు. పెద్ద గొడవ జరి గింది. అమ్మ బాగా ఏడ్చింది.

అయినా తనతో వెళ్ళిపోయాను.

నెల గడిచింది. కొత్తలో బాగానే మూవ్ అయినా తరువాత వాళ్ళ అమ్మ, నాన్న, చెల్లి, తమ్ముడూ అదోలా ట్రీట్ చేసేవారు. వాళ్ళింట్లో నేను కూడా ఎడ్జస్టు కాలేకపోయాను. వాళ్ళ ఇల్లు, ఆ భోజనం, ఆ బందో బస్తు వీటిమధ్య తను డ్యూటీకి వెళ్ళిపోతే నాకు ఛండాలమయిన బోర్ కొట్టేది.

ఇలా వ్రాస్తున్నానని నన్ను మీరు స్థిరంలేనిదాన్ని అనుకోకండి. నాకు ఒక్క పని చేతకాదు, నిజమే. వంటచేయటం, అంట్లుతోమడం Infact నాకు అలవాటులేవు. వాళ్ళ అమ్మ నన్నూ, మా అమ్మనూ తిడుతూ వుండేది. మామూలు తిట్లు కావు. చాలా సంస్కారహీనమైన తిట్లు. మా ఇంట్లో పనిమనుష్యులు కూడా అలాంటి మాటలు వాడరు. నన్ను వీధిలోకి కూడా వెళ్ళనిచ్చేవారుకాదు. టి.వి.గానీ, కనీసం మాగజైన్స్ కానీ వుండేవి

కావు. నేను చాలా బాధపడేదాన్ని, స్నేహితుల్తో సరదాగా గడిపే నాకు ఈ బందిఖానా ఏడుపొచ్చేది. పద్దెనిమిది సంవత్సరాలు హాస్టల్‌లో వున్న నాకు కొత్తగా హోమ్‌సిక్ ప్రారంభమైంది. మా ఇద్దరిమధ్యా పొరలు కూడా తొలగిపోయాయి. దీనంతటికీ కారణం అతనిని నేనూ, నేనని అతనూ ద్వేషించుకునే స్థితికి వచ్చాక నేను మా ఇంటికి వచ్చేశాను. తరువాత పోలీసు కేసులూ అవీ అయ్యాయి. మా ఇంట్లోవాళ్ళు ఏమీ అనలేదు. చుట్టుపక్కల వాళ్ళు యీ ఆర్నెల్లూ మా వాళ్ళని చాలా హింసించారట. నేను తిరిగొచ్చాక నా ముందే "డబ్బున్న వాళ్ళు ఏం చేసినా బయటపడవు" అని అనటం మొదలుపెట్టారు. ఆ తరువాత నాకు తెలిసిన విషయాలు నేను మీకు వ్రాయ లేను క్షమించండి. ఇది జరిగి సంవత్సరం అయ్యింది. ఇప్పుడు అతను నా కళ్ళముందే వేరే అమ్మాయితో తిరుగుతున్నాడు. నా స్టడీస్ అర్ధాంతరంగా ఆగిపోయాయి. నా జీవితం నాకే ప్రశ్నగా కనబడుతోంది. ఇక్కడ అందరూ నన్ను బాగానే చూసుకుంటున్నారు. కానీ నా ఆరోగ్యం క్షీణించి పోయింది. 21 ఏళ్ళ వయసులో అందరూ ఎంతో హుషారుగా వుంటారు. నేను మాత్రం అసలు చదవలేకపోతున్నాను. నాకు చెల్లి తప్ప స్నేహితు లెవరూ లేరు. మా ఊళ్ళో వాళ్ళు "వాళ్ళకేం లక్షలుపోసి ఇంకొకడ్ని కొంటారు" అంటారు.

నేను అంతా పోగొట్టుకున్నాను. ఆరోగ్యం, పేరు, చదువు- అంతా నేను వీధిలో తలెత్తుకు తిరగలేకపోతున్నాను. నేనేంచేయాలి? అసలీ తప్పె వరిది? అతనిదా? నా మూర్ఖత్వానిదా?

జ : మాది! అవును! మాదే! రచయితలూ, దర్శకులూ అందరిదీ? పదహారేళ్ళ తెలిసీ తెలియని వయసులో ప్రేమించకపోతే అదో నేరంగా కృత్రిమ వాతావరణం రంగుల్లో చూపించే దౌర్భాగ్యులందరిదీ. ఇద్దరు వ్యక్తులు కలిసి వుండాలంటే కేవలం సాయంత్రాలు కలుసుకోవటంకాదు. డబ్బు, అర్హత, సంస్కారం వీటిల్లోను కనీస అసమానత వుండకూడ దన్న సత్యం విస్మరించేలా చేసే కలల వ్యాపారులది. తప్పెవరిదే అన్న విషయం వదిలెయ్యండి. మీరు వెంటనే చేయవలసింది ముందు

ఆ ఊరు వదిలి పెట్టడం. కొత్త వాతావరణంలో కొత్త జీవితం మొదలు పెట్టటం! మీ మానసిక శూన్యతనుంచి బయటపడటానికి యిది చాలా ముఖ్యం!

విడాకులు తీసుకుని చట్టపరంగా స్వేచ్ఛాజీవి అవ్వండి మీరు చదువులో బ్రిలియంట్ కాబట్టి.

కొత్త వాతావరణంలో మీకు చదువు ఒక సమస్యకాదు. మీ ఆశయం ఐ.ఏ.ఎస్. కూడా అసాధ్యమేమీ కాదు. అదృష్టవశాత్తు మీ తల్లిదండ్రులు మిమ్మల్ని అర్థం చేసుకున్నారు. హైదరాబాద్, మద్రాస్‌లాంటి పట్టణాలలో ఒక డైమార్సితో మీ చుట్టూ అవమానకరమైన సంభాషణ జరగదు. పట్టణాల్లో అదో అడ్వాంటేజీ. మిమ్మల్ని అర్థం చేసుకోగలిగే కొత్త స్నేహితుల్ని ఏర్పరచుకోండి. అన్నింటికన్నా ముఖ్యంగా- ధైర్యం తెచ్చుకోండి.

మీ ఎనిమిది పేజీల ఉత్తరంలో చాలా గిల్టీ ఫీలింగ్ కనిపించింది. దాన్ని పోగొట్టుకోండి. ఇక మీ రెండవ వివాహం సంగతంటారా- దాని గురించి ఆలోచన అనవసరం. రెండు మూడు సంవత్సరాలు పోయాక ఆలోచించుకోవచ్చు. ఆలోగా మీ ఆస్థిగురించి కాకుండా మిమ్మల్ని మీరుగా ప్రేమించే వ్యక్తి దొరక్కపోడు. దొరక్కపోయినా జీవితం ఆగిపోదు అన్న నమ్మకం అప్పటికి మీకొస్తుంది.

**విద్యాసాగర్, విశాఖపట్నం**

ప్ర : నేను డిగ్రీ చదువుతున్నాను. విజయవాడలో చదివేటప్పుడు ఓ అమ్మాయిని ప్రేమించాను. ఆమె పెద్దలు 'ఆడపిల్లలు ఇంట్లోనే వుండాలి' అనే భావాన్ని ఉగ్గుపాలతో పోసి ఆమెను పెంచారు. నేనే ఆమె మొదటి స్నేహితుడ్ని, ఆమె ఆలోచనలను కూడా సరిచేసినది నేనే. అబి ప్రాయాలలో దగ్గరైనా మేమెప్పుడూ మా హద్దులు దాటలేదు. మా ప్రేమ ఇంట్లో తెలిసింది. మా అన్నలు ఆమె చదువు కూడా పూర్తి కానీ, అపుడు మీ ఇద్దరి పెళ్ళి చేస్తాము" అని నమ్మించారు. ఆ అమ్మాయి ఇంటికి వెళ్ళి,

ఆమె తల్లిదండ్రులకు మా ప్రేమ గురించి చెప్పారు. దాంతో వాళ్ళు ఆమెను రోజూ చావబాదుతున్నారు. ఆ అమ్మాయి దెబ్బలు తింటుందని తెలిసీ నేను భరాయించలేకపోతున్నాను. "నీకు ఈ బాధలన్నీ నావల్లనే కదా! నన్ను మర్చిపో" అని చెప్పానామెకు. "నా లైఫ్‌లో మొదటిసారి ఓ మనిషిలా చూసింది నువ్వే. నన్ను మనిషిలా మార్చింది కూడా నువ్వే. అలాంటి నిన్ను మరిచిపోవటంకంటే ఇలా చావటమే నాకిష్టం" అని సమాధానమిచ్చింది. మా వాళ్ళని బాధ పెట్టలేను. ఆ అమ్మాయిని మరచిపోలేను గతంలో ఒకసారి పేరు ఓ పధ్నాలుగు సంవత్సరాల కూతురున్న పేరెంట్స్‌కు యిచ్చిన సమాధానంలో "మీ అమ్మాయి కొన్నాళ్ళయ్యాక ఆ వయసులో ప్రేమించానా అని నవ్వుకుంటుంది" అన్నారు సార్! మాది ప్రేమ కాదా? అసలు ప్రేమ మా వయసులో వుండదా? మేము విడిపోవటమే శ్రేయస్కరమా? అందరూ మమ్మల్ని విడదీయాలని చూస్తున్నారు. బ్రతికినా, చచ్చినా ఇద్దరం కలిసే అన్న మా సూత్రం తప్పా? ఆ అమ్మాయికి నేనంటే పిచ్చిప్రేమ. ఏదో ప్రేమించుకోవాలని మేము దగ్గరవలేదు. ఏక్సిడెంటల్‌గా కలిశాము. దగ్గరయ్యాము. ఆ అమ్మాయి అలా చావు దెబ్బలు తింటూ కష్టాలు పడుతుంటే భరాయించలేకపోతున్నాను. మేము విడిపోతే చావే శరణ్యం. ప్రేమ అంటే ఇరవై అయిదు, ముప్పై సంవత్సరాల మన మధ్యలోనే రావాలా? మా వయసులోది ప్రేమ కాదా? సరియైన సలహా ఇవ్వగలరు.

జ : మీరు ఆ అమ్మాయి ఆలోచనలు సరిచేసింది నేనే అని రాశారు. ప్రతివారూ తమ అభిప్రాయాలు కరెక్టనీ, తమ అభిప్రాయాలు అనుసరించే వారందరూ కరెక్టయిన పంథాలోనే నడుస్తున్నారనీ అనుకుంటారు. ఆ అమ్మాయి ఒక రకంగా నాలుగు గోడల మధ్య పెరుగుతున్నది. కాబట్టి మీరు మీ డిగ్రీ పరిజ్ఞానంతో మీ అభిప్రాయాలు మీకు చెపితే ఇద్దరూ పరస్పరం నచ్చారు కాబట్టి ఆ అభిప్రాయాలే సరయినవి అనుకునే భావనలో వున్నారు. అసలు ఒకరి అభిప్రాయాలు సరియైనవి, మరొకరివి కావు అని ఈ ప్రపంచంలో ఏమీలేవు. ఎదుటివారి అభిప్రాయాలు చాలా కరెక్టు అనుకుని ఇన్‌ఫ్లుయెన్స్ కాబడటమే ప్రేమకి తొలిమెట్టు.

ఆ అమ్మాయిని రోజూ ఆమె తల్లిదండ్రులు చావబాదుతున్నారు అని కూడా రాశారు. రోజూ పాల ప్యాకెట్ తెచ్చుకోవటం, టి. వి చూడటంలా అదో ప్రోగ్రామ్ చేసుకుని టైమ్‌టేబుల్ వేసుకుని వాళ్ళింట్లో వాళ్ళు ఆమెను చావబాదారు. మీ టాపిక్ ఏదో విధంగా ప్రతిరోజూ వాళ్ళింట్లో చర్చకి వస్తూ వుండి వుంటుంది. దాంతో ఆ అమ్మాయి ఆ అబ్బాయిని తప్ప మరెవ్వరినీ పెళ్ళి చేసుకోను అని మొండిగా వాదిస్తూ ఉండవచ్చు. ఇక్కడే తెలివితేటలు కావాలి.

అలా కాకుండా మీ ఇద్దరూ కలిసి చర్చించుకుని మీ గమ్యాలు పెట్టుకోండి. మీరు ఉద్యోగం తెచ్చుకోవటం, డబ్బు బాగా సంపాదించటం ఆ అమ్మాయి బాగా చదువుకోవటం లాంటివి. అవి సాధించాక అప్పటికి కూడా ఈ ప్రేమభావం మీ మధ్య ఇలాగే వుంటే, అప్పుడు మీరు పెళ్ళి చేసుకోకుండా ఆపగలిగేవాళ్ళు వుండరు. ఈ లోపులోనే మీ ఇద్దరిమధ్య ఆకర్షణ తగ్గితే అప్పుడు ఈ సంఘటన మీ ఇద్దరిలో ఓ 'మధురస్మృతి'లా మిగిలిపోతుంది. ఏది ఏమైనా కూడా ముందు వ్యక్తిత్వాన్ని సంపాదించుకోకుండా ప్రేమిస్తే ఇచ్చే ఇబ్బందులు ఇవి.

మేము విడిపోవటం శ్రేయస్కరమా అన్నారు. రోజూ తన్నులు తినటంకన్నా, స్వంతంగా కాళ్ళమీద నిలబడగల్గే శక్తి వచ్చేవరకూ దూరం దూరంగా వుండటం మంచిది కదా! కొంతకాలం తరువాత ఎలాగూ కలిసి జీవితం గడపబోతున్నాం. అంతవరకూ మా లక్ష్యం సాధించాలి అన్న పట్టుదల మీలో ప్రేమనీ, పరస్పర నమ్మకాన్నీ పెంచుతుంది. అదే నిజమైన ప్రేమ.

## జి. వి. వి. ఎస్. ప్రసాద్, పశ్చిమ గోదావరిజిల్లా

ప్ర : ఒకమ్మాయి నన్ను కవ్వించి స్నేహం చేసుకుంది. ఆమెతో మనస్ఫూర్తిగా స్నేహం చేశాను. ఎక్కడా హద్దు మీరలేదు. ఆ అమ్మాయికి వివాహమైన రోజు నేను సూసైడ్‌కి ప్రయత్నించాను. ఇప్పుడా అమ్మాయి చెల్లెలు ఆదేరకంగా ప్రవర్తిస్తుంది. నేనేం చేయాలి?

జ : ఆ అమ్మాయితో కూడా హద్దుమీరకుండా స్నేహం చేయాలి. ఆ అమ్మాయి పెళ్ళవుతున్న రోజు సూసైడ్ చేసుకోకుండా మరో చెల్లెలు వుందేమో వాకబు చేయాలి.

**ఎం. బి. యస్., పార్వతీపురం**

ప్ర : మా అక్క కూతురంటే నాకు 5 శాతం యిష్టం వుండేది. మా బంధువులందరూ "ఆ అమ్మాయి నీక్కాబోయే పెళ్ళాం" అంటూ హిప్నటైజ్ చేసి ఆ ఇష్టాన్ని 50 శాతానికి పెంచారు. నేనా అమ్మాయిని ...."నీకు నేనంటే ఇష్టమా? మధు (మా చిన్నాన్న కొడుకు) అంటే ఇష్టమా?" అడిగాను. "ఇద్దరూ ఇష్టమే" అంది. అలాకాదు సరి అయిన సమాధానం కావాలి అంటే ఏ స్వీటంటే ఇష్టమంటే అన్ని స్వీట్లూ ఇష్టమే అంటాంకదా అది. నేనేం చేయాలి?

జ : ఆమె రెండు యాభై శాతాలు నిండిపోయాయి కాబట్టి మీ మిగిలిన యాభై శాతంలో ఓ పది స్వీట్లు నింపుకోవాలి.

**మీరా, హైదరాబాద్**

ప్ర : నేను చదువుకునే రోజుల్లో ఒక కుర్రాడికి మనసిచ్చాను. మేమిద్దరం పెళ్ళి చేసుకోవాలనుకున్నాము. కానీ ఏడు సంవత్సరాల 'పరిచయా'నంతరం అతను తన తల్లి బెదిరింపులకు భయపడి వేరొక పెళ్ళి చేసుకున్నాడు. ఆ తరువాత రెండు సంవత్సరాలకు నేనంటే ఇష్టపడే వ్యక్తికి నా గతం గురించి చెప్పి అతనికి భార్యనయ్యాను. మా కిద్దరు పిల్లలు. అంతా బాగానే వుంది, కాని నాకు అప్పుడప్పుడు అతను గుర్తుకు వస్తూనే వున్నాడు. ఆ సమయంలో- నేను నా భర్తకు నాకు తెలీకుండానే అన్యాయం చేస్తున్నానా అనే అనుమానం వస్తుంది. ఎందుకిలా జరుగుతుంది? ప్రేమించి మోసం చేసిన వాడిని కనీసం అసహ్యించుకోలేక పోతున్నాను. ఇన్ని సంవత్సరాలు అతనిని కలవకపోయినా, అతన్ని కలవాలని, అతనితో మాట్లాడాలని కోరిక నాలో కలుగుతున్నది. మొదటి ప్రేమలో అంత మత్తు ఉందా?

జ : ఒక సంఘటన యొక్క ప్రభావం మనిషి మనస్తత్వంమీద రక రకాలుగా వుంటుంది. ఉదాహరణకు ఇద్దరు వ్యక్తులు బాగా పరిచయమైన ప్పుడు వారి మధ్య గొడవచ్చాక కొంతకాలం దూరంగా వుండాలనుకుం టారు. అది కోపం స్థాయి అలా కొంతకాలం గడిచాక, ఆ గాయంమానాక ఒకరినొకరు ఒకసారి చూడాలి అని మళ్ళీ తహతహలాడతారు. అలా కాకుండా ఒక వ్యక్తి రెండో వ్యక్తికి ద్రోహంచేస్తే, అతనిమీద మొదటి వ్యక్తికి అసహ్యం పుడుతుంది. ఇలా కోపం, అసహ్యం, స్నేహం ఇవన్నీ రకరకాల స్థాయి భావాలు. కాబట్టి మనం వర్తమాన భావం, భవిష్యత్తులో మరో విధంగా మారవచ్చు. దీనిలో తప్పేమిలేదు. మీ ఏడు సంవత్సరాల స్నేహం ఇప్పుడు మళ్ళీ గుర్తొస్తుందంటున్నారు. బహుశా మీకు గుర్తొచ్చేది ఆ వ్యక్తయి వుండడు. అతనితో పంచుకున్న అనుభవాలు అయివుంటాయి. ఆ విధంగా మిమ్మల్నిమీరు విశ్లేషించుకోండి. ప్రస్తుతం బాధపడు (పెడు) తున్న ఈ సమస్యకన్నా పెద్ద సమస్య ఏదీ మీకు లేకపోవడంవల్ల ఆ పాత భావానికున్న మధురిమను వర్తమానంలో ఆపాదించుకుంటున్నారు. అదే మీ భర్త మీ పాత స్నేహితుడి గురించి విసిగించి వుంటే ఆ ఆలో చన వచ్చి వుండేది కాదు. జనరల్‌గా మనం ఫస్టుక్లాస్ కంపార్టుమెంట్‌లో ప్రయాణిస్తే మరోసారి ఏ. సి. లో వెళ్ళాలనిపిస్తుంది. ఏ. సి. కంపార్టు మెంట్‌లో వెళితే, ఏరోప్లేన్‌లో వెళ్ళాలని వుంటుంది. కాబట్టి మీ సుఖమైన జీవితం ఇంకా సుఖమయం కాలేదేమో అన్న అనుమానంతో ఆ పాత మధురిమను ప్రస్తుతం అద్దాలనుకోవడం మీ అత్యాశ అవుతుంది. వర్త మానంలో మీరు మీ భర్తతోనూ, అతను అతని భార్యతోనూ కంపర్టబుల్ గానే వున్నాడు. అయినా 'అతనితో మాట్లాడాలి' అన్న మీ మానసిక ప్రక్రియ- అతనితో మరో థ్రిల్ అనుభవిద్దాం అనే మీ ఆలోచనకు మొదటి మెట్టు. ఇలాంటి ఆలోచనలు మనలో కలిగితే తర్వాత విచారించ వలసి వస్తుంది. అతన్ని ఒక్కసారి కలవాలని వుంది అని వ్రాశారు. ఈ కలయిక మరో కలయికకు దారితీస్తుందేమో ఆలోచించండి.

## భాగ్యశ్రీ, హైదరాబాద్

ప్ర : నా వయసు పదహారు సంవత్సరాలు. మా ఇంటిదగ్గర కిరణ్ అనే యువకుడు నాతో సైగలతో మాట్లాడేవాడు. కొన్ని రోజులు చూసి నేను కూడా సైగలతో మాట్లాడుతున్నాను. నన్ను ప్రేమిస్తున్నానని ఉత్తరం రాశాడు. అతన్ని ప్రేమించే ధైర్యం లేక పెండ్లి నిశ్చయం అయింది అని చెప్పాను. కానీ అతన్ని చూడకుండా ఒక్కరోజు కూడా వుండలేను. ఇదే విధంగా డాక్టర్ (Rajesh) రాజాతో కూడా పరిచయం ఏర్పడి స్నేహంగా, ప్రేమగా మారింది. రాజాకు పెండ్లయింది. ముగ్గురు ఆడపిల్లలు. కానీ అతడు నన్ను వదులుకోవటానికి సిద్ధంగాలేడు. నేను కూడా ఎవరి ప్రేమని తిరస్కరించాలో తెలీక మానసికమైన బాధతో కృంగిపోతున్నాను. ఇద్దరిని పెండ్లిచేసుకునే ఉద్దేశం నాకు లేదు. కానీ ఇద్దరినీ విడువలేను. నాకు సలహా చెప్పరూ.

జ : నేను కాదు మీ ప్రియుళ్ళే చెపుతారు. ముందు కిరణ్ దగ్గరికి వెళ్ళి రాజా గురించి చెప్పండి. "ఫలానా డాక్టర్ ముగ్గురు ఆడపిల్లల తండ్రి నన్ను ప్రేమించాడు. నా స్నేహితుడిగా నీ సలహా ఏమిటి?" అని అడగండి. అలాగే డాక్టర్ దగ్గరికి వెళ్ళి "కిరణ్ అనే ఇంటర్మీడియట్ కుర్రాడిని ప్రేమించటం పట్ల మీ అభిప్రాయం ఏమిటి?" అని సలహా అడగండి.

వాళ్ళిద్దరూ తమకుతామే చాలా పెద్దరికాన్ని ఆపాదించుకొని మీకేం చెపుతారో ముందు వినండి. తరువాత కిరణ్ దగ్గరికి వెళ్ళి డాక్టర్ రాజా ఏం చెప్పాడో అతనికి చెప్పండి. డాక్టర్ రాజా దగ్గరికి వెళ్ళి కిరణ్ అతడిని ఏ విధంగా మోసగాడు అన్నాడో వివరించండి. ఆ తరువాత వాళ్ళిద్దరూ ఒకర్నొకరు (మీ దగ్గర) ఎలా తిట్టారో వింటే, ఉల్లిపాయ పొరలు విడిపోయినట్లు అసలు వ్యక్తిత్వాలు బయటపడతాయి. మీకు మానవ సంబంధాల నగ్న స్వరూపాలు తెలియడం ప్రారంభిస్తాయి. దాన్నే 'మెచ్యూరిటీ' అంటారు.

## రామ్‌చంద్, రాయవరం

ప్ర : నాకే అర్థంకాని నా మనస్తత్వాన్ని ఎవరితో చెప్పుకోవాలో అర్థంకాక సతమతమవుతున్న నాకు మీరు సలహా చెప్పగలరని రాస్తున్నాను.

నేను మూడేళ్ళక్రితం ఒక అమ్మాయిని (నా క్లాస్‌మేట్) ప్రేమించాను. నా ప్రేమ విషయం ఆవిడతో చెప్పడంగానీ, వేరే విధంగా ప్రవర్తించటం కానీ చెయ్యలేదు. మేము చదువురీత్యా విడిపోయినా, ప్రతిరోజూ ఆ అమ్మాయి నా మనసులో మెదులుతూనే వుంది. ఇప్పటికిది జరిగి సంవత్సరం అయింది.

ఈమధ్య మరో ఇద్దరు అమ్మాయిలు మనసులోనికి ప్రవేశిస్తుంటే కాదనలేకపోతున్నాను. నేను ముందుగా ప్రేమించిన అమ్మాయీ, మళ్ళీ క్లాస్‌మేట్స్ అయ్యే అవకాశం కనిపిస్తూ వుంది. ఆమెకు నా ప్రేమను తెలియజేయాలని కూడా అనుకున్నాను. అలా అని అ ఇద్దరి అమ్మాయిల మూవ్‌మెంట్స్‌కి రియాక్టు కాకుండా వుండలేకపోతున్నాను. ఈ విపరీతమయిన ధోరణి ఎంతమంది మీదయినా కలగొచ్చా? అసలు నాది ప్రేమే కదా? (ఈ రెండవ ప్రశ్న కేవలం నా కలంనుంచి రాసిందే కాని నేను అనుకోవడంలేదు అని గ్రహించగలరు.)

జ : బాల్యంనుంచి యవ్వనంలోకి ప్రవేశిస్తున్న సమయంలో అతనికి ఒక రకమైన ప్రత్యేకత వస్తున్నదని ప్రతి ఒక్కరూ అనుకుంటారు. తనని ఎవరైనా "గుర్తిస్తే" బావుణ్ణు అన్న భావన అంతర్లీనంగా ఏర్పడుతుంది. అందుకే పధ్నాలుగేళ్ళ అమ్మాయిగానీ, పదహారేళ్ళ అబ్బాయిగానీ అవతలి సెక్సు నుంచి చిన్న అభినందననో పరిచయాన్ని ఆశిస్తూ చూపునో, గమనించినప్పుడు అది తనకు 'గుర్తింపు'గా భావించి పొంగిపోతాడు.

ఈ 'గుర్తింపు' పొందాలనే తపన మగవాళ్ళలో ఒక రకంగాను, ఆడవారిలో ఒక రకంగానూ పరిణతి చెందుతుంది. మొగవాళ్ళ చేత గుర్తింపు పొందటానికి "స్త్రీ" అన్న ఒక్క క్వాలిఫికేషన్ చాలు. కాస్త

బావుంటే, ఎంతోమంది మగవాళ్ళు ఆమె పరిచయాన్ని ఆశిస్తూ సిగ్నల్ని పంపుతారు. ఈ విధంగా స్త్రీయొక్క 'ఈగో' అతి తొందర్లో సంతృప్తి చెంది, ఈ మగవాళ్ళ నుంచి ఎలా తప్పించుకోవాలీ అన్న డిఫెన్స్లో పడుతుంది. తరతరాల్నించీ రక్తంలో జీర్ణించుకుపోయిన భయం, భక్తి, సిగ్గు, బిడియం కూడా ఈ డిఫెన్సుకి దోహదం చేస్తాయి.

మగవాడి విషయంలో అలాకాదు. కళాకారుడు తన ఆడియన్స్ నుంచి మెచ్చుకోళ్ళని పెద్ద ఎత్తున ఎలా ఆశిస్తాడో, పురుషుడు కూడా ఆ వయసులో స్త్రీనుంచి గుర్తింపుని అలా ఆశిస్తాడు. కొందరు మగవాళ్ళు ఒక్కొక్క స్త్రీ చేత గుర్తింపబడడాన్ని ఒక్కొక్క విజయంగా భావిస్తే కొందరు మొగవాళ్ళు దీన్నే "ప్రేమ" అనుకుంటారు.

మీరు ఈ రకమయిన స్థితిలో వున్నారని నేను భావిస్తున్నాను. ఒక అమ్మాయిని మీరు ఆల్రెడీ ప్రేమించివున్నప్పుడు, మరో యిద్దరు అమ్మాయిల గుర్తింపుని మీరు ఆ కారణంచేత కాదనలేకపోతున్నారు. ఇందులో తప్పేంలేదు. ఆ యిద్దరమ్మాయిలూ మీలో దేన్ని చూసి మిమ్మల్ని ఇష్టపడుతున్నారో తెలుసుకోండి. ఉదాహరణకి మీలో ఏ చిత్రలేఖనమనే కళో వుండి, దాన్ని వాళ్ళు ఇష్టపడుతున్నారనుకోండి. మీరింకా ఆ కళని బాగా అభివృద్ధి చెందేలా కృషిచేస్తే కొన్ని లక్షలమంది చేత గుర్తింపబడతారు. ఈ అంతర్గతమైన వాంఛే మిమ్మల్ని గొప్పవాళ్ళని చేస్తుంది. ఇంకో రకంగా చెప్పాలంటే ఒక అమ్మాయిచేత మెప్పు పొందాలన్న మీ వాంఛా పూరితమైన కోర్కెని, మీలో నిబిడీకృతమైన కళని బయటికి తీసే ఆయుధంగా వాడుకుంటున్నారన్నమాట. అణుశక్తి మంచికీ, చెడుకీ ఉపయోగపడుతుందని చెప్పాలనే నా ఉద్దేశ్యం.

పైధేదీ లేకుండా, ఆ ఇద్దరమ్మాయిలు కేవలం మిమ్మల్ని అవేలబుల్ అబ్బాయిగా యిష్టపడుతున్నారనుకోండి! అప్పుడు వాళ్ళిద్దరికీ మీ మొదటి ప్రేమ సంగతి తెలిసేలా చేసి ఆ అమ్మాయిని మీరింకా ప్రేమిస్తున్న సంగతి తెలిసేలా చేయండి. అప్పుడు వారు మరో తాజా సరుకు

కోసం వెళ్ళిపోతారు. మీలో వాళ్ళని ఇంతకాలం ఆకర్షిస్తున్న గుణం యింత బలహీనమైనదా? అన్న వాస్తవం మీకు తెలిసి యిప్పటివరకూ ప్రేమపట్ల మీకున్న భ్రమలు కొన్ని తొలగిపోతాయి.

మీ ప్రేమ విషయం తెలిసి కూడా ఆ యిద్దరూ మిమ్మల్ని యిష్ట పడుతున్నారనుకోండి- స్నేహం సాగించండి. కనీసం మీలో గిల్టీ ఫీలింగుం డదు. ఇటువంటి సరదాలన్నీ సమాంతరంగా నడుస్తున్నా చదువుని మాత్రం నిర్లక్ష్యం చేయకండి.

**రాము, మార్తాండ్**

ప్ర : ఏదో కాలేజీ లైఫ్ హుషారుగా గడుపుదాం అని సరదాకి ఓ అమ్మాయిని ప్రేమించాను. శారీరకంగా ఇద్దరం దగ్గరయ్యాం. ఇన్ని రోజులు కూడా సుఖపడ్డాము. ఆ అమ్మాయి నాకు చాలా వస్తువులు, అంటే వాచీ, డ్రస్ వగైరాలు ప్రజంట్ చేసింది. ఏదో సరదాగా రోజులు గడుస్తు న్నాయనుకున్నాను. ప్రస్తుతం నేను కాలేజీనుంచి వెళ్ళిపోతున్నాను. ఆ అమ్మాయి ఏడుస్తున్నది. ఆ అమ్మాయిని వదిలించుకోవాలంటే ఏం చేయాలో చెప్పండి. సరదా అనుకున్నది యిలా తయారయింది సార్.

జ : మీరు ఆ అమ్మాయిని సరదాగా ప్రేమించాను అన్నారు. కానీ ప్రేమ ఎప్పుడూ సరదాగా ప్రారంభమవదు. ఒక స్ట్రాంగ్ ఫీలింగ్‌తో ఆక ర్షణగా ప్రారంభమై ప్రేమ అనే భావం స్త్రీ పురుషుల మధ్య ఏర్పడుతుంది. దానికి పర్యవసానంగా స్త్రీ పురుషులు 'పెళ్ళి' అన్న గమ్యం పెట్టుకుంటే మంచిదే కానీ స్త్రీ ఒకరకంగా, పురుషుడు ఒకరకంగా ఆలోచిస్తేనే కష్టం. అపుడు మగవాడు అఫెన్స్ ఆడటానికి చూస్తే, స్త్రీ డిఫెన్స్‌లా వుండడం ప్రారంభిస్తుంది. వారిద్దరూ దగ్గరయ్యాక (ఆ స్త్రీ గురించి అంతా తెలిసి పోయాక) ఆమెని వదిలి మరో కొత్త (ఫ్రెష్) అమ్మాయిని పెళ్ళి కూతు రుగా తన జీవితంలోకి ఆహ్వానించాలనుకుంటాడు పురుషుడు వెరయిటీ కోసం.

మీరు "సరదా"గా ప్రేమించిన అమ్మాయి మీకు వాచీ, ఉంగరం,

వగైరాలు ప్రజంట్ చేసిందని చెప్తున్నారు అంటే ఆమె అంతర్గతంగా "మిమ్మల్ని ప్రేమిస్తున్నాను" అని ఏదో విధంగా మీకు తెలియజేస్తూనే వచ్చిందన్నమాట. కాని దాన్ని మీరు గుర్తించినట్టు లేదు. ఒకవేళ ఓ అమ్మాయి మిమ్మల్ని ప్రేమిస్తోంది" అనే మీ మేల్ ఈగోను సంతృప్తి పరుచుకోవటానికే మీరు ప్రాముఖ్యత యిస్తూ మీ మాటల్లో "పెళ్ళి" అనే మాట ఎక్కడా రాకుండా జాగ్రత్తపడి కథ నడిపి వుంటారు. ఆ అమ్మాయి కూడా స్త్రీ సహజమైన బిడియంతో "పెళ్ళి" అనే మాట మీ. మధ్య సంభాషణల్లోకి తీసుకురాకుండా వుండి వుండవచ్చు. కానీ ఆమె మనసులో ఆ భావం వున్నదని మీకు తెలుసు. తెలియదు అని మీరనుకోవడం మీ ఆత్మ వంచన అవుతుంది.

మనం ఒక కిరాణాకొట్టుకు వెళ్ళి సరుకులు తీసుకున్నాక డబ్బులు ఇచ్చాము అని మనం అంటే, ఇవ్వలేదని ఆ కొట్టువాడంటాడు. ఇచ్చామో లేదో మన మనసుకే తెలుసు. కొట్టువాడికీ మనకీ మధ్య సాక్ష్యం ఏదీ వుండదు.

ఓ చిన్న విషయానికే న్యాయస్థానం ఏమీ చేయలేనప్పుడు ఇంత పెద్ద పెద్ద విషయాలను పూర్తి న్యాయంతో పరిష్కరించలేరు. మీ మనసుకు మీరే సాక్షి.

ఇంతకాలం మీరు ఎలాగూ ఆమెతో నటించారు. ఇప్పుడు ఆమె నుంచి విడిపోవాలని మీరు నిర్ణయించుకున్నానని మీ ఉత్తరంలో తెలిపారు. కనీసం యీ విడిపోయే చివరి క్షణంలోనైనా సిన్సియర్‌గా వుండండి. ఇంత కాలం ఆమెపట్ల మీకున్న ఆలోచనలు, ఉద్దేశాలు ఆమెకు తెలపండి. దాని వల్ల ఆమె భావి వైవాహిక జీవితం బాగా వుండే స్కోప్ వుంది. లేకుంటే మీ ఆలోచనలతోనే గడిపే ప్రమాదముంది. అలా కాకుండా ఆమె మీ పట్ల పెంచుకున్న నమ్మకాన్ని అర్థం చేసుకుని, మీరు మీ భావాలను మార్చుకుని ఆమెను వివాహం చేసుకుంటే బాగుంటుంది. అయితే "మిమ్మల్ని ఆ పిల్ల ట్రాప్ చేసి పెళ్ళి చేసుకుంది" అనే ఫీలింగ్ మీలో కలిగితే మాత్రం మీ ఇద్దరి జీవితాలు నరకమవుతాయి.

ఈ వివాహం జరగకపోతే ఆ అదృష్టం మీదికాదు, ఆ పిల్లదీ. ఎందుకంటే ఇంత జరిగాక మీ మాటలు నిజమో అబద్ధమో అనే సందిగ్ధత ఆమెకు మిగతా జీవితంలో వుండదు కాబట్టి.

## డి.యస్., కొస్గి

ప్ర: మా పెళ్ళై పన్నెండు సంవత్సరాలైంది. నాకు ఇద్దరు పిల్లలు. మా ఆయన టీచర్. పెళ్ళినాటికి నేను పదిహేను సంవత్సరాల వయసులో వున్నాను. పెళ్ళయిన తరువాత మూడు సంవత్సరాలు పుట్టింటి లోనే వుండి చదువుకున్నాను. ఆ వయసులో నాకు శృంగారం గురించి తెలియదు. పైగా నేను భయంతో అప్పట్లో ఆయనతో సరిగ్గా మాట్లాడలేక పోయేదాన్ని. నా సమస్య ఏమిటంటే ఇప్పుడు ఆయన నన్ను అనుమానిస్తున్నారు. మా ఇంట్లో అత్తగారు, మామగారితోపాటు నలుగురు తోడికోడళ్ళము వున్నాము. మరుదులతోను, మిగతా అందరితోనూ బాగానే వుండగలుగుతున్నాను. కానీ మా ఆయనే నేను ఏ మాట మాట్లాడినా, ఏ పని చేసినా పెడర్థం తీస్తారు. మాటలతో నన్ను బాధ పెడతారు. "మీ అమ్మ వాళ్ళ దగ్గరకు పోతే నాతో మాట్లాడవు. నీకు అక్కడ డిమాండ్ పెరుగుతుంది" అంటూ నన్ను దెప్పుతారు. అందరిముందూ అవమానం చేస్తారు. ఉద్యోగం చేస్తానంటే వద్దంటారు. మా తోడికోడళ్ళకు చదువురాదు. నన్ను ఆ ఇంట్లో ఎలా మెలగమంటారు?

జ: "నల్లంచు తెల్లచీర" నవల్లో కొత్తగా గృహిణి అయిన స్త్రీకి-శృంగారం తెలిసి పురుషుడికి ఆనందం ఇవ్వడం నేర్చుకునేసరికి అతడికి ఆమె పట్ల ఆసక్తిపోయి నిర్లిప్తత ఏర్పడటం గురించి వివరంగా రాశాను. ఇటువంటి పరిస్థితులకు కారణం- సెక్స్ ఎడ్యుకేషన్ సరిగ్గా లేకపోవటం. భార్యాభర్తల మధ్య జరిగేది అది శృంగారం కాదని, కేవలం పక్కింటి వాడితోనో, పాలవాడితోనో చేస్తేనే థ్రిల్ వస్తుందనీ మన రచయితలూ, రచయిత్రులూ తమ రచనల్లో రాయటం- పెళ్ళికిముందు అటువంటి విష

యాలు తెలుసుకోవాలనుకున్నా, చర్చించినా అదో పాపం అని పెద్దలు ఆంక్షలు పెట్టడం- దానితో స్త్రీ సహజంగా చీకట్లో వుండిపోతుంది. పురుషుడు అలాకాదు, మొదటినుంచీ అన్నీ తెలుసుకుంటాడు. మీవి రెండు సమస్యలు. మీరు "సరిగ్గా మా ఆయనతో మాట్లాడలేకపోయాను, శృంగారము తెలీదు" అన్నారు. ఆ సమస్య ఇప్పుడు వుందో లేదో రాయలేదు. ఈ కొత్త సమస్య వచ్చి పాత సమస్యను పోగొట్టిందో లేదో కూడా రాయలేదు. రెండు వేరు వేరు సమస్యలు రాశారు.

మీ ముగ్గురు తోడికోడళ్ళకు చదువు లేదంటున్నారు. మీరొక్కరే చదువుకున్నారు కాబట్టి ఇన్ఫీరియార్టీ కాంప్లెక్స్ వారిలో ఉండి ఉంటుంది. ఆ కాంప్లెక్స్‌ని సరిదిద్దుకోవటం కోసం వారు మిమ్మల్ని మానసికంగా హింసపెడుతూ ఉండవచ్చు. అలాగే మీ ఆయనలో కూడా ఓ విధమైన అభద్రతా భావం ఉండి ఉండవచ్చు. అందువలన తనను తాను కవర్ చేసుకోవటం కోసం మిమ్మల్ని దెప్పడమూ, ద్వంద్వార్థపు మాటలు అనడం జరుగుతూ వుండి ఉంటాయి కాబట్టి వాటిని పట్టించుకోకుండా వీలైనంత వరకూ మీ పనేదో మీరు చేసుకుంటూ పోతే ఏ గొడవా వుండదు. మీ ప్రపంచాన్ని మీరు నిర్మించుకోండి. అంటే పుస్తకాలు చదవటం, చిన్న చిన్న పనులు చేసి డబ్బు సంపాదించటం లాంటివి చేసుకుంటే మీకు ఇండివిడ్యువాలిటీ అలవడుతుంది. ఈలోపు ఎలాగూ మీ పిల్లలు పెద్దవాళ్లు అవుతారు. వాళ్ళ పెళ్ళిళ్ళు- పేరంటాలతోను, కొత్త మనుష్యులు ఇంట్లోకి రావటంతోను మీపైన కొత్త బాధ్యతలు పడతాయి. దానితో అప్పటికి ఆటోమాటిక్‌గా ఆ సమస్య సాల్వ్ అయిపోతుంది. వీలైతే కొంత జాణతనంతోనూ, లౌక్యంతోనూ మీ చుట్టూ వున్నవారిని (భర్తతో సహా) ఆకట్టుకోడానికి ప్రయత్నించండి.

**దివ్య**

ప్ర : మాది ఒక సాంప్రదాయమైన కుటుంబం. లక్షాధికారులం. నేను పదో తరగతి చదివే రోజుల్లో మా నాన్నగారి దగ్గర పి.ఏ.గా పని

చేసే చుట్టాలబ్బాయి నన్ను 'ఐ లవ్యూ' అన్నాడు. నేను రిప్లై యివ్వలేదు. అతడు నిద్రమాత్రలు మింగగానే సరే అన్నాను. అతడి నిజాయితీకి, మంచితనానికి దగ్గరయ్యాను. అతడు పదో క్లాసు చదివి తర్వాత మానేశాడు. నేను బి. కాం. పాసయ్యాను. అతడికి తాగుడు, చైన్ స్మోకింగ్ అలవాటుందని తర్వాత తెలిసింది. ఒక ఊపిరితిత్తి పాడయిం దని డాక్టర్లు చెప్పారు. నేను ఎంత చెప్పినా- అతనా అలవాట్లు మాను కోవటంలేదు. అతనిపట్ల ప్రేమ, అలవాట్లపట్ల అసహ్యం పెరగసాగాయి. అతడు శారీరక సంబంధం ఏర్పడే పరిస్థితి కలగచేసినా నేను వప్పుకో లేదు. కొన్ని సంబంధాలు తిరగ్గొట్టాను, కొన్ని అతడు చెడగొట్టాడు. ఈ మధ్య అతను 'నీకు పెళ్ళయితే నీ లెటర్స్ బయట పెడతాను' అని బెది రిస్తున్నాడు. అదికూడా నా మీద ప్రేమే అనుకుంటున్నాను. అతనితో వెళ్ళిపోదామా అంటే నేను మా అమ్మా నాన్నలను వదిలి వుండలేను. ఈ విషయమంతా మా అన్నలకు తెలిసిందంటే అతన్ని చంపేస్తారు. ఏం చెయ్యాలి?

జ : అన్నిటికన్నా ముందు మీ ద్వంద్వ ప్రవృత్తి వదిలిపెట్టాలి. ఆ తర్వాత అతనిలో ఏం చూసి ప్రేమిస్తున్నారో విశ్లేషించుకోవాలి. నిద్ర మాత్రలు మింగినవాడు మీరు 'ఐ లవ్యూ' అనగానే 'ముత్యమంత ముద్దు' సినిమాలోలా ఎలా బ్రతికాడో వాకబు చెయ్యాలి. ఆ టెక్నిక్ తెలుసు కొన్నాక "నువ్వు తాగుడు మానకపోతే నేను నిద్రమాత్రలు మింగుతాను" అని అతనిలాగే నటించాలి. అప్పటికీ తాగుడు మానెయ్యకపోతే అమ్మా, నాన్నలే బెటరని గ్రహించాలి.

అప్పుడతన్ని ప్రేమించటం మానేసి పెద్దవాళ్ళు చూపించిన సంబం ధం చేసుకోవాలి. అతను మిమ్మల్ని బెదిరిస్తే 'మీ అన్నయ్య'లకు ఆ విష యం చెప్పాలి. చెప్పేముందు అతన్ని చంపకూడదనీ, కేవలం కాలో, చెయ్యో తీసేస్తే చాలని వాగ్దానం తీసుకోవాలి. అతడు తాగుడు వదిలేసి, మీరతన్ని వివాహం చేసుకొంటే మీ డిగ్రీతో ఉద్యోగం సంపాదించి అతని ఊపిరితిత్తులు బాగుచేసుకొనే ఓపిక వున్నదేమో పరిశీలించుకోవాలి. మీ

కోసం, మీ ఆస్థి కోసం అతను తాగుడు వదిలిపెట్టినట్లు నటించి పెళ్ళయిన తర్వాత తిరిగి మొదలుపెడితే మళ్ళీ మీరు 'సలహా' అంటూ నాకు వ్రాయాల్సి వుంటుంది.

## పి నాగేశ్వరరావు, హైద్రాబాద్

ప్ర : నేను ఇంటర్మీడియట్ చదువుతుండగా నాకో అమ్మాయితో పరిచయం అయ్యింది. అప్పటివరకూ నేనో ముభావిని. ఎవరితో మాట్లాడా లన్నా బిడియం, భయం, జంకు. ఆ అమ్మాయి పరిచయంతో పుస్తకాలు చదవటం నేర్చుకున్నాను. కొత్త కొత్త విషయాలు తెలుసుకొన్నాను. నాతో ఎంతో ఫ్రెండ్లీగా మూవ్ అయ్యేది. చేతికి గోరింటాకు పెట్టేది. ఇద్దరం కలిసి సినిమాలకు వెళ్ళేవాళ్ళం. నాకు తలనొప్పి అని చెప్తే జండూబామ్ వ్రాసేది. ఆమె ఇంతలో ఓ కుర్రాడిని ప్రేమించింది అన్న విషయం నాకు తెలిసింది. నాతో స్నేహానికి ముందే ప్రేమించిందట. అందుకని నేను నా ప్రేమని త్యాగం చేయాలనుకున్నాను. కానీ నేను ఆమెనుంచి ఆశించింది కేవలం నుదుటిమీద ప్రేమగా ఒక ముద్దు. అది లిఖితపూర్వకంగా ఆమెకు తెలిపాను. ఎటువంటి రెస్పాన్స్ లేదు. ఆ తర్వాత ఆమెకు తను ప్రేమిం చిన వ్యక్తితో వివాహమైంది. మరో అటువంటి వ్యక్తి నాకు తారసపడ రేమో. నా జీవితంలో జరిగిన యీ వాస్తవ సంఘటనపై నేను ఓ నవల వ్రాద్దామనుకుంటున్నాను. ముగింపు చెప్పండి. ఈ నవల థీమ్‌పై మీ అభి ప్రాయం చెప్పగలరా?

జ : ఏ రచయితయినా తన తొలి రచనల్లో తన జీవితపు అనుభ వాల్ని, అనుభూతులను ప్రతిబింబిస్తాడు. అంతవరకూ ఓ.కె.

నవలకి కారెక్టరైజేషన్ ముఖ్యం. మీరు వ్రాద్దామనుకొన్న నవలలో రెండు ముఖ్యమైన పాత్రలున్నాయి. ఒకటి మీరు. రెండు ఆ అమ్మాయి. రెండు పాత్రలు బలహీనంగా వున్నాయి. ఆ అమ్మాయిని మీరు అంతర్గత ముగా ప్రేమిస్తున్నా ఆశించింది మాత్రం కేవలం నుదుటి మీద ముద్దు. వేరొకరిని ప్రేమించిందని తెలిసిన తర్వాత హీరో పాత్ర (మీరు యీ నవ

లలో హీరో అనుకొంటే) త్యాగం చేయాలి తప్ప 'నాకొక ముద్దు యిచ్చి వెళ్ళిపో' అని హీరోయిన్ అనకూడదు.

అలాగే మీ హీరోయిన్ ఎవరినో ప్రేమించి, మీ చేతికి గోరింటాకు పెట్టి యింకో కుర్రాడిని మళ్ళీ ప్రేమించి వివాహం చేసుకొంది. చాలా బల హీనమైన కారెక్టరైజేషన్. వాస్తవంలో మనం ప్రవర్తించే విధానానికి, నవ లలో పాత్రలు ప్రవర్తించే విధానానికి కొంచెం తేడా వుంటుంది. పాఠకుడు తానెలా వుందామనుకున్నాడో నవల్లో చూడటానికి ప్రయత్నిస్తాడే తప్ప తానెలా బ్రతుకుతున్నాడో నవల్లో చూడటానికి అంత యిష్టపడడు. నిజ జీవితంలో మనిషి ప్రవర్తన చాలా కాంప్లికేటెడ్‌గా వుంటుంది. నవలలో దాన్ని చిత్రీకరిస్తూ ఆ ప్రవర్తనని సమర్థించటం (జెస్టిపై) చాలా కష్టం. ఎప్పుడయితే రచయిత తన పాత్రల్లో (కనీసం ముఖ్యమైన కొన్ని పాత్రలు) ప్రవర్తనని జెస్టిపై చేయలేడో అప్పుడు నవల ఫెయిలవుతుంది. ముఖ్యంగా మీరు క్రొత్తగా రచనలు చేయాలనుకొంటున్నారు. కాబట్టి ఇటు వంటి క్లిష్టమైన వాస్తవాలు కాకుండా సూటిగా ప్రవర్తించే పాత్రల్ని తీసు కొంటే మీ పని సులభమవుతుంది.

ఉదాహరణకి 'దేవదాసు' నవల తీసుకోండి. పార్వతి వివాహం చేసుకున్నాక భర్తను కూడా ప్రేమించిందనో, లేక దేవదాసు పార్వతిని మర్చిపోయి, ఇంకో అమ్మాయిని వివాహమాడాడనో వ్రాస్తే, నిజ జీవితా నికి రచయిత చాలా కష్టపడవలసి వస్తుంది. చాలా రచనల్లో జీవితపు నెగిటివ్ కోణాన్ని చివరివరకు చిత్రీకరించి, చివర్లో పాజిటివ్ దృక్పథం వైపు వెళ్ళటమే కనబడుతుంది. ఇలాంటి క్లిష్టమైన పాత్ర పోషణ యిప్పు డిప్పుడే రచనా వ్యాసాంగంలోకి అడుగుపెడుతున్న మీకు తగదని నా ఉద్దేశ్యం.

మీ నాలుగు పేజీల ఉత్తరంలో శైలి చెప్పదల్చుకున్న విషయాన్ని సూటిగా చెప్పటం బావున్నాయి. అందుకే అంత వివరంగా వ్రాయవలసి వచ్చింది. బెస్టాఫ్‌లక్.

**మురళీధర్, విశాఖపట్నం**

ప్ర : నా వయస్సు 20 సంవత్సరములు. నా మరదలుకి 18 సంవత్సరాలు. మేమిద్దరం పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాము. నేనా అమ్మాయిని ప్రాణంకన్నా ఎక్కువగా ప్రేమిస్తున్నాను. మా ఇంట్లో వాళ్ళకి కూడా ఇది యిష్టమే! కానీ ఆ అమ్మాయి చాలామంది మగవాళ్ళతో మాట్లాడుతుంది. ఫ్రీగా గడుపుతుంది. అదేమిటంటే ఫ్రెండ్‌షిప్ అంటూ అంటుంది. నేను రోడ్డుమీదకు వస్తే, "ఒరేయ్! నీ మరదలు రోడ్డుమీద ఎవడితోనో మాట్లాడుతూ ఇప్పుడే ఇలా వెళ్ళిందిరా" అంటాడు. ఇంకొకడు తను నా మరదలని తెలియక, "పిట్ట భలే మాట్లాడుతుందిరా! వాడుకొని వదిలెయ్యాలి" అన్నాడు. మొన్న నాకు పిచ్చెక్కేట్టు వుంది. సినిమాకి వెళ్ళినప్పుడు 'నీవు వాళ్ళతో స్నేహాలు మానెయ్యి. చూసినవాళ్ళు వేరేలా అర్థం చేసుకుంటారు' అన్నాను. దానికి ఆమె "నీకు నా మీద నమ్మకం లేదా?" అని కన్నీరు పెట్టుకుంది. నాకు తన శీలంమీద నమ్మకం వుంది. ఆ మాట చెప్పాను. 'నువ్వు నన్ను నమ్మితే చాలు ప్రపంచం ఏమనుకున్నా ఫర్వాలేదు' అంటుంది. పైకి ఏమీ అనలేను. కానీ జెలసీతో చచ్చిపోతున్నాను. దయచేసి మీరు నవ్వుకోవద్దు.

జ : ఇందులో నవ్వుకోవటానికి ఏమీలేదు. మీరు మీది అనుకున్న వస్తువు మిగతావారికి ఇయర్లీ ఎవలిబుల్ వస్తువులా కనబడటంతో వచ్చిన బాధ యిది. చాలా సహేతుకమైనదిగా దీన్ని ఆ అమ్మాయి అర్థం చేసుకోకపోవటం దురదృష్టకరం. అయితే ఇందులో మీ బాధ్యత కూడా కొంత వుంది. "నీ సమక్షంలో తప్ప, పరోక్షంగా నీ పెదవుల నవ్వు కూడా అసహనంగా, అవసరం లేనిదిగా కనబడుతుందనే.... భావన మీరు ఆ అమ్మాయిలో కలిగించలేకపోయారు. పద్దెనిమిది ఏళ్ళ వయసు తొలి ప్రేమలో పడ్డ అమ్మాయికి, సాటి అబ్బాయితో కాదు కదా! తోటి అమ్మాయిల్తో కూడా మాట్లాడబుద్ధికాదు. పరధ్యానంగా వుండటాలు, పదిమందిలో వున్నా అ అబ్బాయి గురించే నిశ్శబ్దంగా ఆలోచించటాలు ప్రేమ లక్ష

బాలు. మీరు అంత గాఢమైన ప్రేమలో ఆ అమ్మాయిని దింపలేకపోయా రేమో అనిపిస్తుంది.

ఆ అమ్మాయి మిగతా కుర్రాళ్ళతో ఏం మాట్లాడుతుందో? తన కెరీర్ విషయమా? తనకు తెలియని వైజ్ఞానిక విషయాలా? మీరు చెప్పలేని ప్రాచీన సంగతులా? ఎందుకు వారితో పరిచయాన్ని ఆశిస్తుంది? ఇవన్నీ కనుక్కోండి. మీ జెలసీ తగ్గవచ్చు. ఆ అమ్మాయి మగ స్నేహితులు నిజముగా గొప్పవాళ్ళయితే "ఆ అమ్మాయి శీలం మీద నాకు నమ్మక ముంది" అన్నారు. శీలం అంటే ఏమిటి? శారీరకమా? అదే శీలం అయితే మీరు ఈరోజు ఇంత బాధపడరు. ఎవరో భగ్న ప్రేమికుడు అన్నాడట— "నువ్వు నాలుగు గంటలు పరాయి పురుషుడితో గడుపు. కానీ ఆ కాలంలో నాలుగు సెకనులు అయినా నా జ్ఞాపకాన్ని నీ మనసునుంచి వేరుచేయకు" అని. ఈ వయసులో మీకింత శల్య పరీక్ష వద్దుగానీ మీ ప్రవర్తన ద్వారా, చర్యలద్వారా మీ మనోగతం ఆ అమ్మాయికి తెలిసేలా చేయండి.

"నువ్వు నన్ను నమ్మితే చాలు. ఈ ప్రపంచం ఏమనుకున్నా ఫర్వాలేదు" అని ఆ అమ్మాయి అన్నదన్నారు. మనం చేస్తున్నదీ, చేసిందీ ప్రపంచానికి తెలిసిపోయిందీ అని మనకి తెలిసిన తర్వాత "నాకీ ప్రపంచం అంటే లెక్కలేదు" అని మనం అనటం సహజం. దాన్ని వెలికి తీయ టానికి ప్రయత్నించండి.

అదికూడా సఫలం కాకపోతే మీరు కూడా ఆ అమ్మాయిలాగే ప్రవర్తిస్తూ ఆ అమ్మాయి కళ్ళపడండి. మీ బాధ తనకి అనుభవం అవు తుంది. ఏదో హిందీ సినిమాలోలా.

**జె. అమితేశ్వరి, మచిలీపట్నం**

ప్ర : నా వయసు 15 సంవత్సరాలు. నేను ప్రేమించి పెళ్ళి చేసు కోవాలని నా యొక్క కోరిక. కానీ మా నాన్నగారికి ఇటువంటివి యిష్టం ఉండవు. నాకు మానవత్వం వున్న మనిషి, చదువు, సంస్కారంగల మగవాడు కావాలి. అలా వున్నవాళ్ళు కూడా లైన్ వేస్తారు. కానీ వాళ్ళు ఒక ఊరినుంచి ట్రాన్స్‌ఫర్‌వల్ల మారిపోతారు. దానితో మా బంధం తెగి

పోతుంది. నాకు మా ఎదురింటిలో వున్న రాజా అనే అబ్బాయి లైన్ వేస్తున్నాడు. సిగ్నల్స్ కూడా ఇస్తాడు. అతనితో ఎలా మాట్లాడాలో తెలియదు. అతను మాట్లాడితే నాకు ఏం మాట్లాడాలో తెలియదు. నా సమస్యకి పరిష్కారం కావాలి.

జ : మీ సమస్య అతనితో ఎలా మాట్లాడాలా అనా? లేక ప్రేమించి పెళ్ళి చేసుకోవటం ఎలా అనా? మీ సమస్య రెండోది అయితే, ముందు మీరు మీ చదువు పూర్తిచేయవలసి వుంటుంది. మీ తండ్రిగారికి ఇలాంటివి ఇష్టం ఉండవు. కాబట్టి, మీరు ప్రేమించిన వ్యక్తిని వివాహం చేసుకునే ధైర్యసాహసాలు ముందు పెంపొందించుకోవాలి. పెళ్ళికి ముందు మీ జీవిత భాగస్వామితో కలసి చర్చించి, అర్థం చేసుకొని సాయంత్రాలు ఆహ్లాదకరంగా చేసుకొని, ఆ తర్వాత అతన్ని వివాహమాడాలన్న మీ కోరిక తీరాలంటే ముందు మీరు వ్యక్తిత్వం పెంపొందించుకోవాలి. అన్నిటి కన్నా ముందు ప్రేమించడం అంటే 'లైను వేయటం', 'సిగ్నల్స్ పంపటం' అన్న దురభిప్రాయం నుంచి బయటపడాలి. 'చదువు, సంస్కారం ఉన్న వాళ్ళు కూడా నాకు లైను వేశారు' అని వ్రాశారు. బహుశా మీరను కున్నంత సంస్కారం వారిలో లేదేమో అనిపిస్తుంది. తాను వివాహ మాడాలి అనుకున్న అమ్మాయికి ఏ యువకుడూ లైను వేయడు. అభిమా నించి, అర్థం చేసుకుని దగ్గర అవటానికి ప్రయత్నిస్తాడు.

ముందు ప్రేమించి, తరువాత పెళ్ళాడాలి అన్న మీ కోరికలో మరో రిస్కు వుంది. ఒక యువకుడిని ఎన్నుకొని, అతనితో స్నేహం చేసిన కొంతకాలానికి అతన్ని మీరు మీ భర్తగా చేసుకోవటానికి, తగిన వ్యక్తిగా మీరు భావించకపోతే, మరో వ్యక్తిని మళ్ళీ ఎన్నుకోవాల్సి వస్తుంది. ట్రాన్స్‌ఫర్లు (ఈ పదం మీరే వాడారు) అయినట్టు మీ జీవిత కార్యాలయం నుంచి ఓ పదిమంది ప్రేమికులు వెళ్ళిపోగానే మీకు ఈ వ్యవహారమంతా బోరు కొడుతుంది. చివరికి మీ తండ్రిగారు చూపిం

చిన సంబంధమే చేసుకుంటారు. ఎందుకంటే అప్పటికి ప్రే
మీ నాజూకు, స్వచ్ఛమైన భావం పోయి, ఏ రాయి అయితేనే పె
గొట్టుకోటానికి అన్న భయంకరమైన మనస్తత్వం డెవలప్ అవుతుంది.

## ఆర్. ఆనంద్, అనంతపూర్

ప్ర : నా వయస్సు ఇరవై ఒక్క సంవత్సరాలు. నాకో విచిత్రమైన సమస్య వచ్చింది. మా క్లాస్‌మేట్ ఒకమ్మాయి నన్ను పిచ్చిగా అభిమానిస్తున్నట్లు సెకండియర్‌లో లెటర్స్ ద్వారా తెలియజేసింది. వారానికి అయిదు నిముషాలు ఆమెతో మాట్లాడితే చాలనేది. ఆమె అందంగా వుండదు. నా మీద అంత అభిమానం ఏ కారణంగా పెంచుకుందో తెలియదు. స్వచ్ఛమైన స్నేహమే కదా ఆమె కోరుకునేది అని ఆవిడతో పరిచయం పెంచుకున్నాను. మొదటి పరిచయంలోనే ఆమె చాలా అమాయకురాలనీ, నన్ను విపరీతంగా అభిమానిస్తోందనీ అర్థమైంది. ఆవిడ ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్‌తో బాధబడుతున్నట్లుండేది. ఎవరితోనూ కలవదు. వేరే ప్రపంచంలో బ్రతుకుతున్నట్లుండేది. ఇలా ఆవిడమీద లేని యిష్టాన్ని చూపించడం, బాధపడడం నాకు యిబ్బందిగా వుంది. నాకు ఆవిడమీద ఏ రకమయిన యిష్టం లేదు జాలి తప్ప. కొన్నాళ్ళ తర్వాత ఆవిడతో ఫ్రెండ్‌షిప్ కట్ చేస్తున్నట్లు చెప్పాను. ఆవిడ "షాక్" ఫీలయి ఏడ్చింది. నేను మాట్లాడక పోతే చచ్చిపోతానని బెదిరించింది. ఆమెది నిజంగా స్వచ్ఛమైన అభిమానమేనా? లేక ప్రేమా? అన్నది యిప్పటికీ సందేహాస్పదంగానే వుంది. ఇప్పుడు నా భయమంతా ఆమె జీవితం గురించే, ఆవిడ బారినుండి తప్పించుకోవటానికి నేను యింకొకళ్ళని ప్రేమిస్తున్నట్లుగా మా ఫ్రెండ్స్ చేత అబద్ధం చెప్పించాను. అయినా ఆమె నమ్మలేదు. ఆమె నన్ను పూర్తిగా మర్చిపోవాలంటే ఏం చేయాలి? ఆమె అందమైనదే అయితే మీరు 'లేడీస్

హాస్టల్'లో వ్రాసినట్లుగా ఈ అవకాశాన్ని వాడుకోవటానికి ఎవడో ఒకడు ప్రయత్నించేవాడు. ఇలా జరగడానికి అవకాశం లేదు. ఇప్పుడు నా తక్షణ కర్తవ్యం ఏమిటి?

జ : మీ మొదటి పరిచయంలోనే ఆమెపట్ల మీకు ఏ భావముందో చెప్పి వుండరు. ఆ విషయం ఇప్పుడు కన్వీనియంట్‌గా కవర్ చేసుకుంటున్న ప్రయత్నం మీ ఉత్తరంలో స్పష్టంగా కనపడుతున్నది. ఇప్పటికైనా ఆమెపట్ల మీకే ఫీలింగ్ లేదని, కేవలం జాలే వుందని, అసలు మీది స్వచ్ఛమైన స్నేహం కానేకాదని, ఆమెకు అర్థమయ్యేటట్లు చెప్పండి. అంతేకానీ ఫ్రెండ్‌షిప్‌లో కట్ చేసినట్లు చెప్పడాలు, వెల్డింగ్ చేస్తున్నట్లు మాట్లాడటాలు స్నేహంలో వుండవు.

మీరన్నట్లు మీది స్వచ్ఛమైన స్నేహమే అయితే 'లేడీస్ హాస్టల్'లో వ్రాసినట్లు ఆమె అందంగా వుందా? అందహీనంగా వుందా? అన్న సమస్యే తలెత్తదు. తప్పు ఆవిడలో కాదు. మీలో వుంది.

# వివాహం తరువాత సమస్యలు

వివాహం తరువాత వచ్చే అన్ని సమస్యలకి ఒకటే కారణం.

మనం వూహించిన వ్యక్తి మనతో జీవితం పంచుకునే వ్యక్తి వేర్వేరు వ్యక్తిత్వాలు, వేర్వేరు అభిరుచులు, బలహీనతలూ కలిగివుండటం.

దీని ఆధారంగా కలం పేరుతో నేను వ్రాసిన ఒక కథ ఈ క్రింద యిస్తున్నాను చదవండి. ఆ కథ పేరు "ఉల్లిపాయ".

కథ తరువాత అనుబంధంగా యిచ్చిన ప్రశ్నోత్తరాల్లో వేర్వేరు వివాహానంతర సమస్యలు, వాటికి నా పరిధిలో యిచ్చిన సమాధానాలు పొందుపరచబడ్డాయి.

# ఉల్లిపాయ

"ఈ ప్రపంచంలో అన్నిటికన్నా అందమైన పక్షి ఏది?" అని క్లాసులో టీచర్ అడిగినప్పుడు, లేచి నిలబడి "కాకి" అన్నాను.

క్లాసంతా ఘొల్లుమంది. ఇది జరిగి పది సంవత్సరాలైనా నాకు బాగా గుర్తు. ఇప్పటికీ నా అభిప్రాయంలో మార్పులేదు. కాకి-కాకిలాగే కనబడి, కాకిలాగే ప్రవర్తిస్తుంది. లోకులు కాకులు అంటారు కానీ కాదు, లోకులు డేగలు. కోడిపెట్టల్ని చంపే డేగలు. లోకులు నెమళ్ళు తమ అందాన్ని చూసి తామే మురిసిపోతారు.

ఇంకో విషయం కూడా వుంది. ఎక్కువ వున్నాయి కాబట్టి కాకుల విలువ తెలియటం లేదుగానీ, ఒకటి, రెండు కాకులు మాత్రమే వుండి, వాటిని జూపార్కులో పెడితే, "ఆహా, ఎంత అందంగా వున్నాయో అని, వాటి కళ్ళెంత అందంగా మెరిసిపోతున్నాయో" అనుకోమూ.

మనుష్యులకి కూడా ఇది వర్తిస్తుందేమోననుకుంటాను అందమయిన శరీరంతోపాటు, మనసుకి కూడా మార్కులు వేయాలి కదా. కానీ మనసుని శోధించాలంటే అది చాలా శ్రమ, కాలంతో కూడిన పని.

పైకి కనపడే అందంగానీ, చదువు, తెలివితేటలు, డబ్బు వుంటే, వాళ్ళు నెమళ్ళ జాతిలోకి వస్తారు. మిగతా జనం వీళ్ళ కంపెనీ, స్నేహం కోరుకుంటారు. నెమలి శరీరంలో కాకి మనసు వుండొచ్చేమో అనుకోరు. అంత లోతుగా వెళ్ళే అవసరం లేదుకూడా.

ఎందుకంటే-మానవ సంబంధాలన్నీ ఉల్లిపాయలాంటివి కాబట్టి.

★ ★ ★ ★

థామస్‌ని నేను మొదటి చూపులోనే ఇష్టపడ్డాను. అతడికి అందం, డబ్బుతోపాటు చదువు కూడా వుంది. పైగా టేబుల్ టెన్నిస్ కూడా బాగా ఆడేవాడు. ఈ నాలుగిట్లో రెండు చాలనుకుంటాను- అమ్మాయిలు అతని స్నేహం కోసం అర్రులు సాచటానికి. ఇందులో సిగ్గేముంది

చెప్పుకోవటానికి? నేను కూడా అతని 'కంపెనీ' అంటే యిష్టపడేదాన్ని. అతను కూడా మా పట్ల ఏ విధమయిన చొరవ తీసుకునేవాడు కాదు. అమ్మాయి లందరూ ఒకరిపట్ల ఒకరం మనసులో అసూయపడుతూనే, అతని కంపెనీలో గుంపులు గుంపులుగా, స్వచ్ఛమయిన మనసుతో వుండే వాళ్ళం.

ఆ సమయంలోనే మానవ సంబంధాల గురించి సుసాన్ స్మిత్ వ్రాసిన పుస్తకం ఒకటి చదివాను. బియ్యేలో సోషియాలజీ మాది. చివరి సంవత్సరం చదువుతున్నాను.

ఆ పుస్తకం చదవగానే నా మెదడు పొరలు విచ్చుకున్నట్టు అనిపించింది. సాహిత్యానికి సామాజికపరమైన బాధ్యత ఎంత వుందో నాకు తెలీదుగానీ, చదివే వారి వ్యక్తిత్వం మీద, దాని ప్రభావం చూపించకపోతే అది వృధా.

సుసాన్ స్మిత్ వ్రాసిన ఒక వాక్యం నన్ను అమితంగా ఆకట్టుకుంది. 'ఒక అమ్మాయికీ, ఒక అబ్బాయికీ మధ్య స్నేహం వున్నప్పుడు, ఆ అమ్మాయికి మరో అబ్బాయితో కూడా ఇలాటి స్నేహమే వుందని తెలిసీ, ఆ మొదటి అమ్మాయి ఏ విధమైన ఈర్ష్యపడకపోతే, అది స్వచ్ఛమైన స్నేహం' అట!

థామస్ చుట్టూ తిరిగే మా అందరిదీ స్వచ్ఛమైన స్నేహం కాదని ఎప్పుడయితే నాకు స్పృహ కలిగిందో, నేను ఆ వలయం నుంచి బయట కొచ్చాను. దాంతో నాకు సోషియాలజీ మీద మరిన్ని పుస్తకాలు చదివే వీలు కలిగింది.

ఒకరోజు క్లాసులో నన్ను లెక్చరర్ 'మానవ సంబంధాల గురించి ఒక ఉదాహరణ చెప్పమన్నారు'. నాకు ఆ సబ్జెక్ట్ మీద వున్న ఉత్సాహం ఆమెకు తెలుసు. "మానవ సంబంధాలన్నీ ఉల్లిపాయలాంటివి" అన్నాను లేచి నిలబడి.

పదిహేను సంవత్సరాల క్రితం అలాగే క్లాసంతా ఘొల్లుమంది. నా మీదున్న గౌరవంతో, లెక్చరర్, తాను నవ్వకుండా, "ఎందుకలా అనుకుంటున్నావు?" అంది. నేను గొంతు సవరించుకుని అన్నాను. "ఇద్దరు కాలేజీ అమ్మాయిలు సినిమాలు కెళుతూ, వీళ్ళింట్లోనో, వాళ్ళింట్లోనో గంటల తరబడి గడుపుతూ తమది గాఢమైన స్నేహం అనుకుంటారు. ఒక ఇల్లాలు నెలాఖర్లో తనకి చేబదులిచ్చే పక్కింటి పిన్నిగారు చాలా గొప్పవ్యక్తి అనుకుంటుంది. ఒక పార్టీలో కలుసుకునే యువకులు తాము స్నేహితులుగా సాయంత్రాన్ని ఎంజాయ్ చేస్తారు. మార్నింగ్ వాక్‌కి వెళ్ళే వృద్ధులు తమది మంచి కంపెనీ అనుకుంటారు. ఈ రకంగా మనుష్యులందరూ నిరపాయకరమైన, తమని యిబ్బంది పెట్టని సంబంధాల్లోనే జీవిస్తారు. సమస్యని ఎదుర్కోవలసి వచ్చినప్పుడు మనిషి పొరలు తొలగుతాయి. పొరలు తొలిగేకొద్దీ స్నేహపు సాంద్రత తగ్గిపోతుంది. అందుకే భార్యాభర్తలు చాలామంది మంచి స్నేహితులు కాలేరు...." అని అన్నాను. "మానవ సంబంధాలన్నీ ఉల్లిపాయ లాంటివి. బంగారు రంగులో మెరిసే తొక్కపైనుంటేనే అవి బాగుంటాయి. లేకపోతే కన్నీళ్ళు తెప్పిస్తాయి" అన్నాను. క్లాసంతా మౌనంగా వుండిపోయింది. ఇప్పుడెవరూ నవ్వటం లేదు. లెక్చరర్ అభినందిస్తున్నట్టు చూసింది.

ఆ సాయంత్రం థామస్ నుండి నాకు ప్రేమలేఖ వచ్చింది.

★ ★ ★ ★

"నీ సెంటిమెంట్ ఏమిటో నాకు అర్థం కావడంలేదు" అన్నాడు థామస్ కారు డ్రైవ్ చేస్తూ. నేను నవ్వి అతడి భుజంమీద తలవాల్చి- "నువ్వు గుర్తించావు కదా! అది చాలు" అన్నాడు. హనీమూన్‌కి గోవా వెళుతున్నాం. వెళ్ళేముందు భద్రాద్రి రాముణ్ని చూడాలని పట్టుపట్టాను. అదీ గొడవ.

పది అడుగుల దూరంలో ఏముందో కూడా కనబడకుండా చీకటి, వర్షం. కారు అద్దాలన్నీ పైకి ఎత్తేసినా, బయట గాలి హోరు లోపలికి వినబడుతుంది. థామస్ చాలా జాగ్రత్తగా డ్రైవ్ చేస్తున్నాడు.

థామస్ మేము గోవాలో గడపబోయే హనీమూన్ గురించి వర్ణిస్తు న్నాడు. చాలా ఎగ్జయిటింగ్‌గా వున్నాడు.

థామస్ నుంచి ప్రేమలేఖ వచ్చాక మా స్నేహం గట్టిపడింది. ఎమ్మే చదవటానికి యిద్దరం వాల్తేరు వెళ్ళాం. రామకృష్ణా బీచ్‌లో ఎన్నో సాయంత్రాలు సముద్రం పక్కనే కూర్చుని కబుర్లు చెప్పుకునే వాళ్ళం. అతడు నాకు ప్రేమలేఖ ఎందుకు వ్రాసిందీ కూడా చెప్పాడు. నేను ఆ సర్కిల్‌లోంచి బయటకు రావడం తను గమనించాడట, కారణం మాత్రం తెలియదట! అప్పటికే నేనంటే బాగా అభిమానం వుండటంతో నా వెలితి బాగా ఫీలవుతూ, అప్పుడే తెలుసుకున్నాడట తను నన్ను ప్రేమిస్తున్నా డని!

నేను చాలా గర్వంగా ఫీలయ్యాను. మా ప్రేమ విషయం తెలిసి మిగతా అమ్మాయిలు దూరంగా వెళ్ళిపోయారు. మేమిద్దరం ఒకర్నొకరం "బాగా అర్థం చేసుకున్నాక" మా ఇంట్లో అతన్ని పరిచయం చేశాను.... థామస్ తండ్రి మా వాళ్ళకి తెలుసట. మా వాళ్ళకి అభ్యంతరం లేక పోయింది. మతం వేరయినా మా నాన్నగారి హోదా, డబ్బు థామస్ తల్లి తండ్రులని కూడా వొప్పించింది అనుకుంటాను. మొత్తంమీద ఏ అవాం తరమూ లేకుండా ఒప్పందం జరిగిపోయింది. ఆ తరువాత ఇద్దరం ఎమ్మే చదవటానికి వైజాగ్ వెళ్ళాం.

ఆ రెండు సంవత్సరాలూ నా జీవితపు అతి సంతోషకరమైన దినాలు. థామస్ నిజంగా హి-మాన్! నేను సముద్రాన్ని చూస్తూ కూర్చు నుంటే, అతను నన్ను చూస్తూ కూర్చునేవాడు. నా స్పర్శ కోసం అర్రులు సాచేవాడు. కానీ వివాహం జరిగేవరకూ దూరంగానే వున్నాం యిద్దరం. మనసులు కలిశాక చిటికెన వేలు ముట్టుకుంటే ఏదో అవుతుందని కాదు గానీ, పెళ్ళయ్యేవరకూ ఆ అపురూపమైన అనుభూతిని దాచుకోవాలని నా ఉద్దేశ్యం. థామస్ ఎన్నో కబుర్లు చెప్పేవాడు. ప్రతిరోజూ సాయంకాలం కోసం ఎదురు చూసేదాన్ని, మమ్మల్ని 'బెస్టు పెయిర్' అనేవాళ్ళు. ఆ వేసవిలో మా వివాహం జరిగింది.

హనీమూన్ వెళ్ళేముందు భద్రాచలం వెళ్ళాలన్న నా నిర్ణయాన్ని విని థామస్ ఆశ్చర్యపోయాడు. కాస్త విసుగ్గా "నీకు మతిపోయింది...." అన్నాడు.

నేను నవ్వి "మన జీవితాల్లో ఆనందం ఇచ్చే సంఘటనలన్నీ మతి లేకుండా చేసేవే. ఎక్కడైతే స్పృహ వుంటుందో, అక్కడ ఆనందం వుండదు" అన్నాను. థామస్ కూడా నవ్వేసి "సిల్లీ గర్ల్" అన్నాడు.

ఫలితమే ఈ ప్రయాణం.

వర్షం మరింత ఎక్కువైంది. ఉన్నట్టుండి థామస్ కారు పక్కకి తీసి ఆపుచేశాడు. నన్ను డ్రైవ్ చెయ్యమంటున్నాడేమో అనుకుని కళ్ళు విప్పి, అతడి భుజంమీద నుంచి తలతీశాను. రోడ్డుకి ఎదురుగా అన్నీ నీళ్ళు ఎక్కడో కట్ట తెగినట్టు- అంతా జలమయంగా వుంది. నా కెందుకో భయం వేసింది, నీరు మావైపుకే వస్తోంది. ఆ నీటిలోకి కారు తీసుకెళ్ళటం రిస్కు. పావుగంట అలాగే కారులో కూర్చున్నాం.

థామస్ తరువాత కారు వెనక్కి తిప్పి పోనివ్వసాగాడు. అతడిని ఆ క్షణం మాట్లాడిస్తే తిడతాడని వూరుకున్నాను.

"ఇటు రాకపోతే ఈపాటికి గోవాలో వుండేవాళ్ళం" అన్నాడు. నేను మాట్లాడలేదు. ఇంతదూరం వచ్చి వెనక్కి వెళ్ళవలసి రావటం నాకు బాధగానే వుంది. కానీ ఎలా వెళ్ళగలం? ఈపాటికి భద్రాచలం సగం మునిగి వుంటుంది.

'ఇలాంటి ప్రయాణాలు వర్షాకాలంలో పెట్టుకోకూడదు. వేసవికాలం అయితే బావుంటుంది' అన్నాడు.

'అసలు పెళ్ళిళ్ళు వర్షాకాలంలో పెట్టుకోకూడదు. శీతాకాలం అయితే బావుంటుంది' అన్నాను వాతావరణాన్ని తేలికచేయటం కోసం. థామస్ నవ్వి, నన్ను దగ్గరకు తీసుకుని పెదవులమీద గాఢంగా ముద్దు పెట్టుకుంటూ, ఎందుకో తలతిప్పి రోడ్డువైపు చూసి సడెన్‌బ్రేక్ వేశాడు.

అటు కూడా నీళ్ళు! పాము జరజరా పాకినట్టు రోడ్డు కడ్డంగా వెళ్తున్నాయి. 'డామిట్' అంటూ థామస్ తనలో విసుక్కున్నాడు.

మేము చూస్తూ వుండగానే నీళ్ళు చక్రాల్ని ముంచేవరకూ వచ్చాయి. అలాగే రివర్స్ చేసుకుంటూ వెనక్కి ప్రయాణం చేశాం. కొంతదూరం వెళ్ళేసరికి రోడ్డు మునిగిపోయింది. దూరంగా విశాలమైన మైదానం, అంతా నీళ్ళు. ఏది గోదావరో, ఏది రోడ్డో తెలియనంతగా నీళ్ళు. క్షణ క్షణానికి నీటిమట్టం పెరుగుతోంది. థామస్ అలాగే కారుని పక్కగా కోసి, ఎడమవైపుకి తిప్పాడు. అటు రోడ్డు కాస్త ఎత్తుగా ఒక గుట్టమీదకి దారితీస్తుంది. ఆ గుట్టవరకూ వెళ్ళేక మరో పెద్దగుట్టలాంటిది కనబడింది.

ఆ గుట్టమీద ఇంట్లో ఒక చిన్న దీపం వెలుగుతోంది.

★ ★ ★ ★

ఆ వృద్ధుణ్ని చూడగానే నాకు గన్స్ ఆఫ్ నవరోన్ అనే సినిమాలో అంథోని క్విన్ గుర్తొచ్చాడు.

తెల్లటి గెడ్డం, తైలసంస్కారం లేని జుట్టు, గాజు కళ్ళు....

అంత వర్షపు చీకట్లో మమ్మల్ని చూసి ఆశ్చర్యపోయినా, లోపలికి ఆహ్వానించాడు.

చాలా చిన్న గది అది. కారు గ్యారేజీలా వుంది. ఒకమూల చెక్క అల్మరా, కుక్కిమంచం, చుట్టూ గోడలు లేవు. పైన కూడా రేకులే అవటంతో వర్షపు చినుకులు మా హృదయంమీద దేనితోనో కొడుతున్నట్టు శబ్దం చేస్తూ జారిపోతున్నాయి. ఆ గదంతా వర్షపు వాసనతో ఇబ్బందిగా వుంది. కారు క్రింద ఆపుచేసి గుట్టపైకి ఎక్కి రావటంతో పూర్తిగా తడిసి పోయాం యిద్దరం. అతడు మాకు తల తుడుచుకోవటానికి ఒక గుడ్డ ఇచ్చాడు. పాత కార్లు తుడిచే గుడ్డలా వుంది. థామస్ దానిని ముట్టు కోవటానికి కూడా ఇష్టపడలేదు. అలాగే కూర్చున్నాడు.

"ఏ ఊరు వెళ్ళాలి బాబూ?" అని అడిగాడు.

"భద్రాచలం!"

"మరిటు వచ్చారేమిటి?"

ఆ వృద్ధుడి మాటల్లో తేలిందేమిటంటే మేము రెండు కిలోమీటర్లు

తప్పుదార్లో వచ్చాం. అటు వెళ్ళినా చేరుకోలేకపోయేవాళ్ళమేమో— అది వేరే సంగతి! ఆ షెడ్డులో ఒక మూల పంటలకి కొట్టే మందుడబ్బాలు వుండటంతో కడుపులో తిప్పుతోంది. ఇప్పట్లో వర్షం తగ్గే సూచనలు లేవు.

నేను తలెత్తి కిటికీలోంచి చూడటానికి ప్రయత్నించాను. కన్ను పొడుచుకున్నా కనపడని చీకటి. అంతలో నిముషంపాటు, ఆగకుండా మెరిసింది. ఆ మెరుపు వెలుగులో చూసిన దృశ్యానికి నా గుండె ఒక్క క్షణం ఆగి కొట్టుకోవటం ప్రారంభించింది. కారు వరకూ నీళ్ళు వచ్చేశాయి. ఒకవేళ వర్షం తగ్గినా మేము ఇప్పట్లో వెళ్ళటం దాదాపు అసంభవం.

నా వెనకనుంచి ఆ దృశ్యం చూసిన థామస్ కూడా ఆ విషయం గుర్తించినట్టున్నాడు.

"ఈ రాత్రికి ఇక్కడే వుండిపోవాల్సి వచ్చేట్టుంది" అన్నాడు.

వృద్ధుడు కల్పించుకొని- "గోదారి అంతే బాబూ! గంటల్లో పెరుగుద్ది, తగ్గటం కూడా అంతే" అన్నాడు. నేను థామస్‌ని కూర్చోమన్నట్టు సైగచేశాను. 'ఈ మంచంమీదా?' అన్నట్టు నా వైపు చూశాడు. నేనింకా రెట్టించలేదు.

"కొంచెం టీ పెట్టి ఇత్తునా" అన్నాడు వృద్ధుడు. అతని పేరు రామయ్యని చెప్పాడు.

"వొద్దు వొద్దు" కంగారుగా అన్నాడు థామస్. అక్కడ వున్న పాత్రల్ని చూసి అని వుంటాడు. బహుశా....నాకా క్షణం వేడి టీ తాగాలనిపించింది. బాగా ఆకలిగా కూడా వుంది. అప్పుడే నాకు గుర్తొచ్చింది. కార్లో బిస్కట్లు, ఫ్లాస్క్‌లో టీ వున్నాయని థామస్‌తో ఆ విషయమే చెప్పాను.

"ఇప్పుడెవరెళ్ళి తీసుకొస్తారు?" మొహం చిట్లించి అడిగాడు.

"నే తెత్తునా?" రామయ్య లేచాడు. వొద్దన్నాడు థామస్.

"నాకు కారు తలుపు తెరవటం తెలుసు బాబూ" అన్నాడు అతడు. నేను ఛివాలున తలెత్తాను. థామస్ మరింత ఇబ్బందిపడి- "వద్దులే వర్షంగా వుంది కదా" అన్నాడు. నేను లేచి, రాత్రిలోపులో వాటి అవసరం ఎలానూ పడుతుంది. "తడిచి వున్నాం కాబట్టి ఇప్పుడే వెళ్ళి తెచ్చుకుంటే మంచిది" అని తాళాలు తీసుకొని బయటకొచ్చాను. రామయ్య కూడా నాతో వచ్చాడు బయట గాలీ, వర్షం శరీరాన్ని వణికించేస్తుంది. ఇద్దరం దాదాపు పరిగెత్తు కుంటూ వెళ్ళి కార్లోంచి కావలసినవి తెచ్చుకున్నాం.

మేము వచ్చేసరికి థామస్ మంచం మీద కూర్చుని వున్నాడు.

★ ★ ★ ★

రామయ్య క్రింద పడుకున్నాడు. నేను మంచంమీద. థామస్ ఆ రాత్రి నిద్రపోనన్నాడు. రెండే దుప్పట్లున్నాయి. థామస్‌కి వాటిమీద పడుకోవటం ఇష్టంలేదు.

పది నిమిషాలు గడిచేసరికి రామయ్య ఊపిరి తీస్తున్నప్పుడల్లా అదోలాంటి శబ్దం వచ్చి, క్రమంగా ఎక్కువయ్యింది. మరో రెండు నిము షాలు గడిచేసరికి రామయ్య లేచి కూర్చుని ఆయాసపడసాగాడు. అతడికి ఉబ్బసం అని అర్థమైంది.

థామస్ నాతో ఇంగ్లీషులో "ఈ రాత్రి ఇంత దరిద్రంగా గడుస్తుం దని నేననుకోలేదు. మన పెళ్ళి అయిన నాలుగో రోజు...." అన్నాడు. నేనేం మాట్లాడను? ఏం మాట్లాడినా మొత్తం తప్పంతా నా మీద తోసేసి తిట్టేట్టూ వుంది అతని మూడ్. అందుకనే నేను మాట్లాడలేదు. అతను మళ్ళీ ఇంగ్లీషులోనే "ఈ ముసలోడు రాత్రంతా దగ్గుతూ మనల్ని చంపే ట్టున్నాడు. అస్తమానం ఈ పిల్లికూతలంటే భలే చిరాకు నాకు" అన్నాడు. రామయ్యకి మేము మాట్లాడుతున్నది అర్థంకాలేదు. అంతలో మరింత పెద్ద దగ్గుతెర వచ్చింది. నేను నీళ్ళు తీసుకెళ్ళి ఇచ్చాను.

రామయ్య లేచి- "ఈ దగ్గు తగ్గదమ్మా, నేను బయట పడు కుంటాను" అన్నాడు. పాముకాటు తగిలిన దానిలా 'ఏమిటి?' అన్నాను ఉలిక్కిపడి.

"బయట ఇంకో చిన్నగది వుంది. అక్కడ పడుకుంటాను" అని లేచాడు. నేనేదో అనబోతుంటే థామస్ లేచి "చూద్దాం పద రామయ్యా" అంటూ తీసుకెళ్ళాడు. ఆ నిశ్శబ్దంలో రెండు మూడు నిమిషాలు కూర్చు న్నాను. థామస్ వచ్చి తలుపు దగ్గరికి వేసి నవ్వేడు. మంచం దగ్గరికి వచ్చి నన్ను సుతారంగా జరిపి పక్కన చేరాడు.

ఏ మంచాన్ని ముట్టుకోవటానికి కూడా అసహ్యపడ్డాడో ఆ మంచమూ దుప్పటీ అవసరాన్ని తీర్చాయి. 'డైరీలో వ్రాసుకోవటానిక్కి చాలా మంచి ఎక్స్‌పీరియన్స్ కదూ' అన్నాడు కన్నుకొట్టి. నేను మాట్లాడ లేదు. కుక్కిమంచం అవటంతో కదలటానికి వీల్లేకపోయింది. బయట నుంచి దగ్గు వినపడుతుంది. థామస్ నా ప్రక్కనే నిద్రపోతున్నాడు. అప్పటివరకూ వున్న చిరాకు పోయినట్టుంది.

నేను లేచి బయటకొచ్చాను. ఒకవైపు చలి- దానికితోడు వర్షం.

గోదారిగాలి సూదులు గుచ్చుతున్నట్టు వుంది.

మా షెడ్డు పైకప్పు కాస్త ముందుకొస్తే, దానికి ఒక పక్క మరో రేకు అడ్డుపెట్టారు. ఆ క్రింద- పచ్చగడ్డిమీద మూడంకేవేసి పడుకుని దగ్గుతున్నాడు ఆ వృద్ధుడు. ఆ కళ్ళల్లో అప్రయత్నంగా నీళ్ళు తిరిగాయి. 'లోపలికి రా' అన్నాను. అతను కళ్ళు విప్పి నన్ను చూసి దిగ్గున లేచి కూర్చుని ఏదో చెప్పబోయాడు. 'లోపలికి రా' అన్నాను క్లుప్తంగా. అతను లేస్తూ వుండగా లోపల ఏదో పడిన చప్పుడు....ఇద్దరం కంగా రుగా లోపలికి వెళ్ళాం.

థామస్ కాళ్ళు మంచానికేసి కొట్టుకుంటున్నాడు. మొదటిసారిగా నేనతన్ని అలా చూడటం....

రామకృష్ణాపురం బీచ్‌లో రెండు సంవత్సరాలు ఏ సాయంత్రమూ

రాని ఫిట్స్ మొదటిసారిగా వచ్చి, నన్ను కలవరపెట్టాయి. ప్రతి సాయంత్రమూ నీట్‌గా తయారయి వచ్చే థామస్ ఇప్పుడు-

రామయ్య అతని నోరు చుట్టూ శుభ్రంగా తుడిచి, ఒక మూలనుంచి ఏదో తీసి ముక్కు దగ్గిర పిండాడు. నాతో 'కంగారుపడొద్దు' అన్నాడు. నేనేం కంగారు పడటంలేదు. మా నాన్నగారు డాక్టరు, ఇవన్నీ మామూలే. నేను ఆలోచిస్తుంది- థామస్ ఈ విషయం నాకు ఎందుకు చెప్పలేదా? అని. నాకెందుకో విశాఖపట్టణం బీచ్‌లో మేము గడిపిన అందమైన సాయంత్రాలు గుర్తొచ్చాయి. మేము మా అందమైన మొహాల్ని (బెటర్ సైడ్ ఆఫ్ ది ఫేస్) చూపించుకుంటూ వచ్చాం ఇన్నాళ్ళూ.

రామయ్య రసం పిండి, మిగతాది విసిరేస్తూండగా చూశాను. ఉల్లిపాయ....ఫిట్స్‌కి అది చాలా మంచిదని అతను చెప్పాడు. వెంటనే ఉపశమనమిస్తుందట!

★ ★ ★ ★

ఆ మరుసటిరోజు ప్రొద్దున్న థామస్ చాలా రిలాక్సింగ్‌గా కనబడ్డాడు. బహుశా ఫెళ్ళున ఎండ కాయటం వల్ల నేమో.

బయట ఇంకా నీళ్ళు అలాగే వున్నాయి. దూరంగా ఒక చిన్న బ్రిడ్జి చూపించి అది పూర్తిగా కనబడితే నీళ్ళు తగ్గిపోయినట్టే, మేము వెళ్ళిపోవచ్చు అని చెప్పాడు రామయ్య. మాకు ఆ వర్రీ ఇక లేదు. రాత్రి చీకటి, వర్షం అవటంతో భయపడ్డాముగానీ, ఆ దృశ్యం మనోహరంగా వుంది. నేను కారులోంచి బ్రెడ్డు, అరటిపళ్ళు తెచ్చాను.

"కోడిగుడ్లు దొరుకుతాయా?" థామస్ అడిగాడు.

చుట్టూ నీళ్ళు, మధ్య కొండమీద మేము. ఈ పరిస్థితుల్లో ఆ అసందర్భమైన కోరికేమిటి అని అడిగాను. బ్రెడ్‌లోకి ఆమ్లెట్ బావుంటుందని జవాబు ఇచ్చాడు. రామయ్య తెస్తానని చెప్పి తేచాడు. పక్క ఊళ్ళో దొరుకుతాయట. మమ్మల్ని సంతోషపెట్టడమే అతనికి బాగా సంతోషాన్నిస్తుందని తెలుస్తోంది.

రామయ్య బయటికి వెళ్ళగానే థామస్ తిరిగి తలుపువేశాడు. వొద్ద న్నాను. నవ్వి "చుట్టూ నీళ్ళ-దూరంగా పాపికొండలు-మళ్ళీ యిలాంటి అనుభవం రాదు" అన్నాడు. గుడ్లుకోసం పంపటం అనేది కూడా ఒక నెపం అని అర్థమైంది.

రామయ్య రావటానికి రెండు గంటలు పట్టింది. నడుమువరకూ వస్త్రం ఎగ్గట్టి, మొలలోతు నీళ్ళలో రెండు కిలోమీటర్లు నడిచి వెళ్ళొచ్చి గుడ్లు తీసుకొచ్చాడు. ఇంకో పొట్లాం కూడా వుంది అతని చేతిలో, ఏమిటని అడిగాను.

"విప్ప పూలు అమ్మా! ఇక్కడ ప్రసిద్ధి. నా గుర్తుగా వుంచండి" అన్నాడు.

థామస్ ఈ లోపులో పొయ్యిముందు కూర్చుని ఆమ్లెట్లు వేయటం మొదలుపెట్టాడు. రామన్న గిన్నెలే వాడటం చూసి "ఇది కూడా మన డైరీలో వ్రాసుకోవాలి థామస్" అన్నాను. ఇద్దరం బ్రెడ్-అమ్లెట్ తిని కొంచెం బ్రెడ్ మిగిలితే రామయ్యకిచ్చాం.

రామయ్య చెప్పింది నిజమే. గోదావరి నీరు చాలా తొందరగా తగ్గిపోతోంది.

థామస్ బయట ఫోటోలు తీస్తున్నాడు. మా ఆల్బమ్‌లో రహస్యంగా పెట్టుకొని నవ్వుకోవటానికి. ఆ కుక్కి మంచాన్ని కూడా ఫోటో తీశాడు. చాలా హుషారుగా వున్నాడు.

బాగా లేనిది రామయ్యే. మా అతిథి మర్యాదలు చూడటంతో బాగా నలిగిపోయాడు అతడు. రాత్రి బయట పడక, ప్రొద్దున్నే నీళ్ళల్లో నడక ఆ వృద్ధుడుని తిరిగి ఉబ్బసానికి గురిచేశాయి. ఛాతీ ఎగిరెగిరి పడుతోంది.

"దగ్గర్లో డాక్టర్లు ఎవరూ లేరా?" అని అడిగాను. లేరన్నాడు. అయినా ఇది తనకి అలవాటే అనీ, కంగారుపడే అవసరంలేదనీ అన్నాడు.

ఇంతలో థామస్ హడావుడిగా వచ్చి "నీళ్ళు తగ్గిపోయాయి పద" అన్నాడు.

కిటికీలోంచి ఆ విషయం స్పష్టంగా తెలుస్తోంది. థామస్ వంగి క్యారి

యర్ గిన్నెలు గబగబా సర్దుకున్నాడు. "ఏమిటింత హడావుడి?" అని అడిగాను.

"మనం వెంటనే హైదరాబాద్ వెళితే మరో గంటలో గోవా వెళ్ళే విమానం వుంది. రాత్రికల్లా గోవాలో వుండొచ్చు" అన్నాడు.

"లేకపోతే హైదరాబాద్‌లో వుంటాం. అంతే! రాత్రి ఎక్కడికి పోదుగా" అన్నాను.

అతను నుదురు చిట్లించి "ఏమిటి నీ వుద్దేశ్యం?" అన్నాడు. మా సంభాషణ ఇంగ్లీషులో జరుగుతోంది. నేనన్నాను. "చూడు థామస్! అతను లేచే స్థితిలో లేడు. మనకి యిన్ని మర్యాదలు చేశాడు. ఇతనికి కాస్త అన్నం వండిపెట్టి వెళదాం."

థామస్‌లో అలాంటి ఎక్స్‌ప్రెషన్స్ నేనెప్పుడూ చూడలేదు. నన్ను నిజంగా మతి వుండే మాట్లాడుతున్నావా అన్నట్టు కళ్ళు పెద్దవి చేసి చూశాడు. తరువాత "పద....వంటా లేదు, స్నానం లేదు" అన్నాడు. తరువాత జేబులోంచి పర్సు తీసి ఓ యాభై నోటు తీసి తాత తల దగ్గర పెడుతూ "వుంచు యీ డబ్బు....థాంక్యూ....వెళ్ళొస్తాం...." అని నన్ను తీసుకొచ్చి కారు ఎక్కించాడు.

కారు రివర్సు చేస్తూ అన్నాడు. "అతనికి వంట చేస్తావా? ఇంకా నయం.... అతను భోజనం చేసేవరకూ వుందాం అన్నావ్ కాదు! ఆ వుబ్బసము రెండ్రోజులవరకూ తగ్గకపోతే రెండ్రోజులు యిక్కడే వుంటావా?"

నేను మాట్లాడలేదు.

కారు గుట్ట దిగుతోంది. "ఎవర్నెక్కడుంచాలో అక్కడ వుంచాలి. అసలు మనకి ఆతిథ్యం యివ్వడమే వాడి జీవితంలో ఒక గొప్ప వరం" నవ్వాడు. "నీ వాలకం చూస్తుంటే నేనిలా బలవంతంగా లాక్కొని రాక పోయి వుంటే డాక్టర్‌ని పిలిపించి ట్రీట్‌మెంట్ కూడా యిప్పించి వుండే దానివేమో కదా!"

కారు మెయిన్‌రోడ్డు మీదకు వస్తుండగా లీలగా "బాబుగారూ.... బాబుగారూ" అని వినబడటంతో తలతిప్పి చూశాము. రామయ్య గుట్ట

క్రిందకి పరిగెత్తుకు వస్తున్నాడు. ఉబ్బసం వలన ఊపిరాడక కష్టపడుతూ అంత కష్టంలోనూ ఎలాగో వీలు చూసుకుని మాట్లాడగలిగాడు. "బాబు గారికి మధ్యలో ఎక్కడయినా ఫిట్సొస్తాయేమో యిది వుంచండి" అని నా చేతిలో పెట్టాడు ఉల్లిపాయ.

నేనేదో అనబోయేటంతలో థామస్ ఒక్క జెర్కుతో కారును ముందుకు కదిలించాడు. వెనుక రామయ్య రొప్పుతూ నిలబడి వున్నాడు.

థామస్ నా చేతిలోంచి దాన్ని తీసుకుంటూ "నేనేమన్నా క్రానిక్ ఫిట్స్ పేషెంట్ ననుకున్నాడా ఇడియెట్!" అంటూ విసురుగా బయటకు విసిరేశాడు. రోడ్డుపక్కనున్న పెద్ద బండరాయికి తగిలి అది పొరలు పొరలుగా విడిపోయింది.

నా మనసులాగా....

(వి. విజయలక్ష్మి అన్న పేరుతో వ్రాసినది)

## ఎల్., కనిగిరి

ప్ర: నా వయసు ఇరవై రెండు సంవత్సరాలు. డిగ్రీ మధ్యలో వుండగానే మా తల్లిదండ్రులు నా పెళ్ళిచేశారు-మేనరికం. పెళ్ళికి పూర్వం మావారు వైజాగ్‌లో ఓ కంపెనీలో పనిచేసేవారు. మా మ్యారేజ్ తరువాత కూడా అక్కడ సెటిల్ అవుదామనుకున్నాం. కానీ మా రెండో బావగారు చనిపోవడంతో మేము స్వగ్రామానికి తిరిగిరాక తప్పలేదు. అమ్మగారిల్లు, అత్తగారిల్లు ఒకే ఊరిలో-కాకపోతే వీధుల తేడా. ఇక మా కష్టాలు ప్రారంభం అంతా మా అత్తగారివల్లనే. ఆమెదే ఇంట్లో పెత్తనం. హిట్లర్‌లా ఆజ్ఞలు జారీచేస్తుంది. మేము చచ్చినట్లు వినాల్సిందే. ఎక్కడయినా పొరపాటు జరిగిందా ఆ రోజు యింట్లో ప్రపంచయుద్ధం జరిగేది. మావారితో కలిపి వాళ్ళు మొత్తం అయిదుగురు అన్నదమ్ములు. ఒకాయన పోయారు. మరొకాయనకు క్షయ. ఇద్దరికింకా పెళ్ళికాలేదు. అంతా కలిసే వుంటాం. రోజూ మా కుటుంబ సభ్యులలో ఎవరో ఒకరు మా అత్తగారి

ఆజ్ఞాపాలనలో పొరపాటు చేసేవారు. అలా రోజు యిల్లు ఓ రణరంగంలా అవుతున్నది. దానికి తగ్గట్టు మా ఆయన వాళ్ళమ్మకి ఎప్పుడూ ఎడ్డెమంటే తడ్డెమంటారు. ఏ పనయినా ఓ సవాల్‌గా తీసుకోవాలంటారు మావారు. "మాకు మీకంటే వయసెక్కువ, అన్ని విషయాలలోనూ అనుభవం ఎక్కువ కాబట్టి మేము చెప్పిందే వేదం" అనే మనస్తత్వం మా అత్త గారిది. మా పెద్ద తోడికోడలు యీ బాధలన్నీ భరాయిస్తూ తొమ్మిది సంవత్సరాల నుండి మా అత్తగారింట్లో వుంది. దాంతో ఆమె మెంటల్‌గా మారింది. ఒక సంవత్సరం హాస్పిటల్లో వుండి వైద్యం చేయించుకుంది. మేము వేరు కాపురం పెడదామంటే 'తమ్ముడు కూతురని చేసుకుంటే గట్టిగా మూడు సంవత్సరాలుకూడా కలిసి వుండకుండా విడివడింది' అని మా అత్త గారు దెప్పుతుంది అని భయం. మా నాన్నగారు స్కూల్ టీచర్. వున్నం తలో మమ్మల్ని బాగానే పెంచారు. మా గతంలో మేమెప్పుడూ ఎవరిచేతా చిన్న మాట కూడా పడలేదు. అలాంటి వాతావరణంలోంచి వచ్చిన నేను ఈ వాతావరణంలో యిమడలేకపోతున్నాను. ఇప్పటికే నా స్నేహితురాళ్ళు నాలో చాలా మార్పొచ్చిందంటున్నారు. మా అమ్మగారయితే ఏకంగా "ఇంక ఎంతకాలం- ఓర్చుకోమ్మా! మీరు కాకపోతే ఆ పెద్దవాళ్ళని ఎవరు చూస్తారు?" అంటుంది. మావారికి వాళ్ళ ఆస్తిమీద మక్కువ. మా నాన్న గారికి మీ కూతురు చాలా ఘటికురాలు అంటారేమోనని భయం. మీ సమా ధానం?

జ : మీ ఉత్తరంలో ఎక్కడా మీ సమస్యపట్ల మీ భర్తగారి ప్రతి స్పందన ఎట్లా వుందో వివరించలేదు. జరుగుతున్న విషయాలకి ఆయన ప్రత్యక్ష సాక్షా? ఆయన మీ అత్తగారికి సపోర్టు చేస్తున్నారా? తనేమో మీ అత్తగారికి వ్యతిరేకంగా వుంటారని వ్రాశారు. కాబట్టి మీభర్త మీకు సపోర్టు చేస్తున్నప్పుడు మీకు ఏ విధమైన సమస్య వుంది? మీ సమస్యల్లా మీ అత్త గారితోనే గదా? మీ తోడికోడలు మెంటల్ హాస్పిటల్లో చేరిన విషయం మీ భర్తగారికి కూడా తెలిసే వుంటుంది. తన భార్య ఆ స్థితిలో కెళ్ళకుండా

చూసుకోవలసిన బాధ్యత ఆయనదే. ఈ విషయం ఆయనకు వివరించి చెప్పండి.

మీ తోడికోడలు హాస్పిటల్లో వుండి వచ్చిందని తెలిసి కూడా మీ తల్లిదండ్రులు మిమ్మల్ని మీ అత్తగారితోనే కలిసి వుండమంటున్నారంటే సామాజికపరమైన భయం వారిలో అంతర్గతంగా వుందన్న మాట. ముసలివారిని మనం జాగ్రత్తగా చూసుకోవాలి. నిజమే కాని వారు పూర్తిగా మన ఆనందాన్ని హరించే వ్యక్తులుగా మారితే, వారికి దూరంగా వుండటమే మంచిది. మీ గురించి ఎవరేమనుకుంటారో అని భయపడనవసరం లేదు. ఎందుకంటే మనం బాధల్లో వున్నప్పుడు ఆ 'అనుకునే' వ్యక్తులెవరూ మనకు సహాయం చెయ్యరు. మీరు విడిపోయాక, కొన్ని రోజులు చెవులు కొరుక్కుంటారు. తరువాత అందరూ దానికి అలవాటు పడిపోతారు.

అయితే మీరు విడిపోవటానికి ముందు మీరు మీ అత్తగారింట్లో మీ స్థానాన్ని నిలుపుకోవటానికి ప్రయత్నించండి సామదాన భేదోపాయాలు ఉపయోగించండి. ఆత్మీయుల మధ్య యిలాంటి వేమిటి అంటారా? ఒక కొత్త వ్యక్తి ఇంట్లోకి వచ్చినప్పుడు 'ఎవరి స్థానం ఏమిటి?' అన్న విషయమై ఇలాంటి అంతర్గత యుద్ధాలు జరగడం సహజమే. నిరంతరం యుద్ధం చేస్తూ యవ్వనపు రోజుల్లో ఆనందాన్ని హరింపజేసుకోవటం కన్నా అటో ఇటో తేల్చుకోవటమే మంచిది. ఎంతమంది కొత్త దంపతులు 'ఎ....వ....రి....కో....స....మో....' తమ కొత్త ఆనందాన్ని ఈ రకంగా పోగొట్టుకుని తరువాత తరువాత దాన్ని పోగొట్టుకున్నామో అని బాధపడటం సహజం. జీవితంలో తిరిగి రానిది బాల్యమొకటే కాదు, కొత్త దాంపత్యం కూడా.

**అరుణ, గుంటూరు**

ప్ర : మాది జాయింటు కుటుంబం. మా అత్తగారు, మామగార్లతో కలిసి వుంటాం. మా వివాహం జరిగి సంవత్సరమైంది. మా ప్రతి విష

యంలోను అత్తగారు కల్పించుకుంటారు. ప్రతిరోజు ఏ కూర వండాలి లాంటి సంగతులు సరే. అమ్మాయికి ఆఫీసునుంచి వచ్చేటప్పుడు కాసిని మల్లెపూలు తీసుకురాకూడదు? అని అందరిముందు అంటారు. మాకు సంబంధించిన ప్రతి విషయంలో కూడా తన పంతమే నెగ్గాలంటారు. నేను ఏ పని చేసినా విమర్శించటమే ఆవిడ పని. ఇంకా ఆయనకి నా మీద కోపం రావటం కోసం.

జ : మీ ఉత్తరంలో మొదటి పది వాక్యాలు చదివితే బాగా నవ్వొచ్చింది. ఒక కామెడీ నవలకి మంచి ప్లాటు అవుతుందనిపించింది. కానీ తరువాత మీరు చెప్పిన సంఘటనలు అన్నీ చదువుతూ వుంటే, మానసికంగా మీరు ఎంత హింస అనుభవిస్తున్నారో అర్థమైంది. నిజమే పైకి చిన్న సంఘటనలుగా కనిపించేవి, మనసును కత్తికంటే పదునుగా కోసేస్తాయి. ఇక సమస్యని మీ అత్తగారి వైపునుంచి ఆలోచిస్తే, ఒక్కడే కొడుకు కాబట్టి, ఆవిడ అధికారాన్నీ, ఆప్యాయతనీ వదులుకోవటానికి ఇష్టపడటం లేదు అనిపిస్తుంది. వేరే కాపురం ప్రసక్తి రాగానే మీవారు ఇరిటేట్ అయిన విధానం చూస్తూంటే, ఆయనకు తన తల్లిదండ్రులపట్ల (అవసరమైన దానికంటే ఎక్కువ వల్లమాలిన ప్రేమ) ప్రేమ వుందని అర్థమైపోతుంది. అయినా తల్లీ, కొడుకులను విడగొట్టడం అంత మంచి ఆలోచన కాదు కూడా. మీరో కొత్త వ్యూహం పన్నండి. మీ అత్తగారిపట్ల అవసరమైన దానికన్నా ఎక్కువ ఆప్యాయత చూపండి. ఆమె అభిరుచులు గుర్తించి (పాతకాలం సినిమాలు వగైరా) ఆవిడ సమయం అటు వెళ్ళేలా చూడండి. మీ మామగారు మీకు సపోర్టు చేసేలా చూసుకోండి. గుర్రాన్ని (కొడుకుని) రక్షించుకునే ప్రయత్నంలో రాజుని (భర్తని) కోల్పోతున్నానేమో అనే ఓడిపోతున్న ఫీలింగ్ ఆవిడలో అంతర్గతంగా కలిగేలా చూడండి. సంధి ప్రయత్నాలు ఆవిడే ప్రారంభిస్తారు. లౌక్యపూరితమైన అతి మంచితనం కొన్ని పరిస్థితుల్లో తప్పదు. బహుశా ఆవిడ ఒక రకమైన సైకో-పాంథెటిక్ స్థితిలో వున్నారేమో అనిపిస్తుంది. ఒక మన

వడినో, మనవరాల్నో యివ్వటం కూడా యీ సమస్యకి కొంత పరిష్కారం చూపించవచ్చు.

ఆర్., రాజమండ్రి

ప్ర : మా పెళ్ళయి 15 సంవత్సరాలు అయింది. మూడు సంవత్సరాల క్రితం సొంతంగా ఫ్యాక్టరీ పెట్టుకొన్నాం. అది ఎక్కడో మారుమూల గ్రామంలో వుండటంతో ఆయన వారానికి ఒకసారి ఇంటికి వస్తూ మిగిలిన రోజులు అక్కడే వుంటున్నారు. మేం కూడా వచ్చేస్తామని అన్నాం. (నేను, పిల్లలు) పిల్లల చదువు పాడవుతుందని తీసుకు వెళ్ళలేదు. పెద్దబాబుకి 14 సంవత్సరాలు, పాపకి 10. మా చుట్టుప్రక్కలవాళ్ళు, ఆయన అక్కడ యింకో యిల్లు పెట్టే వుంటారని అంటున్నారు. నా స్నేహితురాలు కూడా, "ఈ మగవాళ్ళని నమ్మకూడదు, ఆ తరువాత బాధపడి ప్రయోజనం లేదు" అంటుంది. నాకు ఆయనమీద పూర్తి నమ్మకం వుంది. అయితే ఆయన నిర్లక్ష్యాన్ని (పదిహేను రోజులకి, ఇరవై రోజులకి రావటాన్ని) భరించలేకపోతున్నాను.

అలాగని పిల్లల్ని అక్కడికి తీసుకువెళ్ళి గబ్బిలాయిలుగా చేయటం నాకు యిష్టంలేదు. నేను ఎక్కువగా చదువుకోలేదు. కాబట్టి నా ఉత్తరంలో తప్పులుంటే మన్నించండి. నా స్నేహితురాలి మాటలే నాకు తరచూ గుర్తొస్తున్నాయి ఈ మధ్య....

జ : మనకి కొన్ని సమస్యలుండటం, వాటికి కొన్ని (సెట్) ముగింపులుండటం మనం చేసుకొన్న దురదృష్టం. చప్పున ఒక నిర్ణయానికి వచ్చేసి, ఆ నిర్ణయాన్ని అవతలి వాళ్ళమీద రుద్దేస్తారు. 'స్త్రీ ఒంటరిగా ఎంత తెలివైనదో, గుంపులో వున్నప్పుడు అంత వ్యక్తిత్వం లేనిది' అని నేనే ఎక్కడో వ్రాశాను. మీ వారు అక్కడో యిల్లు పెట్టేశారు అనే నిర్ణయానికి మీ చుట్టుప్రక్కల వాళ్ళు యెలా రాగలిగారు? ఫ్యాక్టరీ అభివృద్ధి చేయాలనే తపన కావొచ్చు, లేదా శ్రమ ఎక్కువై వారానికొకసారి ప్రయాణం చేయాలంటే బద్ధకం కావొచ్చు కాబట్టి. ఆయన రెండో యింటి గురించి అనవసరంగా ఏవేవో ఆపోహల్తో బాధపడకండి.

అంతకన్నా బాధపడవలసిన 'నిజం' వేరొకటి వుంది. వారానికొక సారి వస్తానన్నారాయన. 15-20 రోజులవరకు రావటంలేదు అన్న నిజం ఇంకో రకంగా చెప్పాలి అంటే-తన భార్యా, పిల్లల్ని చూడకుండా వుండ గలగడం అనే గుణాన్ని ఆయన క్రమంగా అలవాటు చేసుకొంటున్నారన్న మాట.

దీనికి మీరు బాధపడవలసింది.

'ఆయన రెండో ఇల్లు పెట్టకపోతే చాలు, నన్ను పిల్లల్తో యిలా దూరంగా ఉంచినా ఫర్వాలేదు' అన్నది అంత ఆరోగ్యకరమైన ఆలోచన కాదు. జీవితం చాలా చిన్నది. దాన్ని భగవంతుడు కేవలం ఆనందించ టానికే మనకిచ్చాడు. అర్థంలేని త్యాగాల్తో, అనుమానాల్తో పాడు చేసు కోవటానికి కాదు. మీ పెద్దవాడిని మంచి హాస్టల్‌లో వుంచండి. ఈ వయ స్సులో హాస్టల్‌లో ఉండటం వల్ల సరియైన వ్యక్తిత్వం అలవడుతుంది. పల్లెటూళ్ళో చదివినవాళ్ళు గబ్బిలాయిలుగా తయారు అవుతారు అనేది కూడా తప్పు ఆలోచనే. మీ పాపని మీతో పాటూ తీసుకెళ్ళండి. చెప్పా నుగా జీవితం చాలా చిన్నది.

## కృష్ణవేణి, ముంబాయి

ప్ర: మాది అనుకోకపోతే పెద్ద సమస్య కాదు. అనుకుంటేనే సమస్య. పెద్దలు కుదిర్చిన సంబంధమే చేసుకున్నాం. పెళ్ళయి ఎనిమిది సంవత్సరాలయింది. ఆయన నన్ను బాగానే చూసుకుంటారు. ఇద్దరు పిల్లలు కూడాను. ఫైనాన్షియల్‌గా ఏ సమస్యాలేదు. ఆయనకు పెద్దగా దురలవాట్లు ఏమీలేవు. ఎప్పుడన్నా సిగరెట్ తాగుతారు. అప్పుడప్పుడూ పార్టీలకు వెళుతుంటారు. ఇటీవలకాలంలో అంటే గత ఏడాదినుంచి ఆయనలో నేను గమనించిన మార్పు నన్నుగాని, ఇంటి విషయాలుగాని పెద్ద పట్టించుకోవ టంలేదు. సాయంత్రం ఏ తొమ్మిది గంటలకో, పది గంటలకో యింటి కొస్తారు. మళ్ళీ ఉదయమే ఆఫీసుకి వెళ్ళిపోతారు. అంతా రొటీన్‌గా జరుగు

తుంది. పెళ్ళయిన పదేళ్ళకే ఇలా జరిగితే తరువాత తరువాత ఏం జరుగు తుందోనని నాకు చాలా భయంగా వుంది. దీన్నుంచి బయట పడటం ఎలా?

జ : పురుషుడి జీవితంతో పెళ్ళి అనేది ఒక 'ఫేజ్' మాత్రమే....! భార్య ఒక భాగం మాత్రమే! కానీ స్త్రీకి పెళ్ళయిన తర్వాత భర్తే జీవిత మంతా. ఇక్కడే యిద్దరిమధ్యా 'కమ్యూనికేషన్ గ్యాప్' వస్తుంది. ముప్పై ఏళ్ళు దాటాక పురుషుడు తన ప్రపంచాన్ని మరింత విస్తృతపరచుకోవాలని చూస్తాడు. అది వ్యాపారపరంగాగానీ, ఆఫీసుపరంగాగానీ, ఏ విధంగా నయినా కావచ్చు. దాంతోపాటుగా అతనికి ఇంట్లో అంతవరకూ కనిపించిన కొత్తదనంపోతుంది. మీరింకా చాలా అదృష్టవంతులు. ఎందుకంటే మీ భర్త కేమీ దురలవాట్లు లేవని రాశారు కాబట్టి. పోతే మీ 'మొనాటినీ'ని బ్రేక్ చెయ్యాలంటే ఫిక్స్‌డ్ టార్గెట్ కింద సంవత్సరానికి రెండుసార్లు భర్తతో పాటు కనీసం వారం రోజులు బయటకు వెళ్ళటం అనే ప్రోగ్రాం పెట్టుకో వాలి. అలాగే భర్తను 'హోల్డు' చేయటం అనేది కూడా ఓ టెక్నిక్! దీని గురించి "మీరు మంచి అమ్మాయి కాదు" అనే మానసిక విశ్లేషణ పుస్తకము (నవసాహితి ప్రచురణ)లో వివరించాను. ఇది కొంతవరకూ మీకు ఉప యోగపడవచ్చు.

మీరు జీవితాన్ని రొటీన్‌గా ఫీలవుతున్నారని మీ భర్తకు తెలిసేలా చేయండి. కమ్యూనికేషన్ లేకపోవటంవల్లే ఇలాంటి చిన్న చిన్న బాధలు మొదలవుతాయి. వీటిని మొదటిలోనే త్రుంచేయకపోతే మహావృక్షాలై మన లను బాధపెట్టే ప్రమాదముంది. మీ ఇంటిలో చిన్న చిన్న పార్టీలివ్వటం, మీ భర్తతో కలిసి పార్టీలకు వెళ్ళడం అలా మీరు వేరు, మీ భర్తవేరు అన్నట్లుగా కాకుండా, మీ భర్తతో మీరూ భాగమే అని అంతర్గత చర్యల ద్వారా ఆయనకి అప్పుడప్పుడు తెలియపరచడం ద్వారా కూడా మీ 'హౌస్'ని మీ 'హోమ్'గా మార్చుకునే అవకాశముంది.

( మనిషి పేరు లేదు, ఊరు పేరు లేదు )

ప్ర : మా వారికి రెండువేల రూపాయల జీతం. మా కిద్దరు పిల్లలు. పై సంపాదన ఏమీలేదు. ఎంతో సర్దుకుని వాడినా, పొదుపు చేసినా, నెలా ఖరు వచ్చేసరికి డబ్బులకోసం యిబ్బందిపడవలసి వస్తుంది. పెళ్ళయి ఏడు సంవత్సరాలవుతున్నా యింతవరకూ ఏ మాత్రం ఆస్తి కూడగట్టుకోలేదు. ముందు ముందు పిల్లలు పెద్దవారవుతున్న కొద్దీ మరిన్ని ఖర్చులుంటాయి. ఈ పరిస్థితులలో నేను ఏం చేయాలి....? నాకర్థం కావటంలేదు. సలహా యివ్వగలరు.

జ : 'ఖర్చు' అనే రాక్షసితో పోరాడాలంటే మనిషికి "బడ్జెట్" అనే ఆయుధం కావాలి. ఈ బడ్జెటింగ్ దేశానికో, రాష్ట్రానికో మాత్రమే కాకుండా, వ్యక్తిగతంగా కూడా అవసరం. మనిషికి మూడు రకాలయిన అవసరాలుంటాయి. 1) లగ్జరీలు, 2) కంఫర్ట్సు, 3) నెససిటీస్! వీటిలో ఈ చివరిది అన్నింటికన్నా ముఖ్యమైనది. తిండి, బట్ట, పిల్లల చదువు, ఆరోగ్యము వగైరాలన్నీ దానిలోకే వస్తాయి. వీటిలో కొన్ని అవసరమయిన దానికన్నా ఎక్కువ ఖర్చుని యిముడ్చుకుంటాయి. ఉదాహరణకు-ఇల్లు అవసరమే కానీ మీ కొస్తున్న జీతానికి పదిహేను వందల రూపాయల అద్దె ఇల్లు అవసరమా? ఏడు వందలతో సరిపెట్టుకోవాలా? అన్నది ముందు నిర్ణయించుకోవాలి. అలాగే ప్రతి పండుగకీ ఒక చీర నిత్యవసరమా? లేక మానసికానందమా....? అన్నది కూడా మన నిర్ణయం మీద ఆధారపడి వుంటుంది. ఒకోసారి 'కంఫోర్టు' కూడా "నిత్యావసరం"గా మారుతుంది. ఉదాహరణకి సంవత్సరానికొకసారి వచ్చే 'దీపావళి'కి పిల్లలకి కనీసం వందరూపాయల సామాను కొనిపెట్టకపోతే ఎందుకు బ్రతకటం....? అనే కోర్కెలు బలీయమైన నిత్యావసరంగా మారుతుంది. ఇటువంటి సమయాల లోనే కంఫర్టుకీ, నిత్యావసరానికీ మధ్య ఓ రేఖ గీసి నిర్ణయించుకోవాలి. దీనికొరకు మనం నిర్దాక్షిణ్యంగా కొన్ని కోర్కెలను చంపుకోవాల్సి వస్తుంది.

ఇదంతా ఎందుకంటే ప్రస్తుతం మీకున్న ఖర్చులకంటే భవిష్యత్తులో ఖర్చులు ఎక్కువగా వుంటాయి. కాబట్టి పిల్లలు పెద్దవుతున్న కొద్దీ ఫీజులు, డొనేషన్‌లు, మీరు పెద్దవుతున్న కొద్దీ పనిమనిషి ఖర్చు, ఆస్పత్రి ఖర్చులు....ఇవన్నీ రాక్షసుల్లా మీ ముందుకు రాబోతున్నాయి.

నెలకి నాలుగు సినిమాలు చూడటం మనిషికి ఆనందాన్నిస్తే, అది నిత్యావసరంగా మారుతుంది. అదే సమయాన్ని ఏ కుట్టు, అల్లికలకో, మరేదో ఆదాయాన్నిచ్చే వృత్తిగానో మార్చుకోగలిగితే, మీకు పై సంపాదన కూడా కొద్దిగా వుంటుంది ఖర్చు కూడా తగ్గుతుంది. ఇలా కొంతకాలానికి ఇటువంటి పనులలో వున్న ఆనందం, సినిమాలవల్ల వచ్చే ఆనందాన్ని అధిగమిస్తుంది.

ఈ "ఖర్చు" అనే మంటకి "చుట్టాలు" అనే ఆజ్యం బాగా తోడవుతూ వుంటుంది. చుట్టాలు వచ్చేటప్పుడుగానీ, వెళ్ళేటప్పుడుగానీ పెట్టే ఖర్చు మన బడ్జెట్‌ని చెదపురుగుల్లా తినేస్తుంది. అయితే యిక్కడ మనమొక విషయం తెలుసుకోవాలి. శెలవులు రాగానే మనం ఎవరో ఒకరి ఇంటికి పిల్లలతోపాటు వెళ్ళి వుంటే, అవతలి వారికి మన ఇంటిలో వారంపాటు గడపటానికి అవకాశం యిస్తున్నామన్నమాట! ఇలాంటి చేదు వాస్తవాలను మనం అంగీకరించవలసి వుంటుంది. పిల్లలతో శెలవుల్లో బంధువులింటికి వెళ్ళటం ఆనందమే! కానీ దానికి చెల్లించవలసిన 'మూల్యం' పిల్లల ట్యూషన్ ఫీజు కాకూడదు కదా!

అదే బడ్జెటింగ్ అంటే!

## వైవాహేతర సంబంధాలు

ఏదో నవల్లో- బహుశా నా మొదటి నవల 'ఋషి'లో ననుకుంటాను.... "మనిషికి థ్రిల్ యిచ్చినంత ఆనందం మరేదీ యివ్వదు" అని వ్రాశాను. (థ్రిల్ కన్నా గొప్పది) లేదు. కొంతమందికి పేకాటలో థ్రిల్ దొరుకుతుంది. కొంతమందికి ఒక మంచి భావాన్ని అక్షరరూపంలోకి

మారిస్తే థ్రిల్ దొరుకుతుంది. మరికొందరికి డబ్బు సంపాదనలో థ్రిల్ దొరుకుతుంది.

కొందరికి పరాయి వ్యక్తి ప్రేమ గెలవగలిగితే థ్రిల్ దొరుకుతుంది.

ఇంకేదో నవల్లో ఒక పాత్ర వుంటుంది. "ప్రతిరోజూ అదే అన్నం, అదే కూరలు అయితే బోరుకొడుతుంది. కాబట్టి నెలకోసారో, రెండుసార్లో బిర్యానీ తింటాం. నా వైవాహికేతర సంబంధాలు కూడా అలాటివే" అనీ.

'అవును.... నీ భార్యకూడా అలాగే అనుకుంటూ వుంటానని మొన్న రాత్రి నాతో చెప్పింది' అనుకుంటాడు మనసులో ఎదుటి స్నేహితుడు.

ప్రతిసారీ మంచినీళ్ళు తాగితే బోరుకొడుతుందని రాత్రిళ్ళు విస్కీ తాగి, ప్రతిసారీ సిగరెట్ తాగితే బోరుకొడుతుందని గంజాయి తాగటం అలవాటు చేసుకొని, ప్రతిరోజూ ఆఫీసుకెళితే బోరుకొడుతుందని ఆదివారాలు రేసుల కెళ్ళి.... ఇక దీనికి అంతెక్కడ?

ఈ మానసిక వ్యభిచారం గురించి ఆ రోజులలోనే చిలకమర్తి లక్ష్మీనరసింహం వారు 'మణి మంజరి' అనే నవలలో విశదీకరించారు.

'ఈ రోజులలో పతివ్రతలు నిజముగా కలరా? సీతా దమయంతులున్నారా?' అని రాజు కొలువులో సామంతుల్ని అడుగుతాడు.

'సుగుణవంతులు, దుర్గుణవంతులు ప్రపంచ మున్నంతకాలమూ వుందురు. ఈ కాలములో కూడా మహాపతివ్రతలు చాలామంది కలరు. వ్యాస వాల్మీకి వంటి ప్రముఖులు సత్యదూరములగు వర్ణనలు చేసి పాఠకులకు భ్రమ పెట్టలేదు.'

అప్పుడు చిలకమర్తివారు మరొక పాత్రచేత ఈ విధముగా చెప్పిస్తారు.... 'ఎక్కడి స్త్రీ లెక్కడి పాతివ్రత్యము....? పాతివ్రత్యము ప్రముఖుల మనసులలో వున్నది. లోకానుభవములేని మూఢుల మనసులో వున్నది....రూపము లేని స్త్రీల యందున్నది. అంతేకానీ లోకమున

లేదు. వీలుకాక కొందరు స్త్రీలు అప్రదిష్ట సంభవించునని, కొందరు స్త్రీలు పరపురుష సహవాసము చేయకయుందురుగానీ, మనసులలో వాంఛ లేక కాదు. వీలు కలిగిన పక్షమున నొక్క పతివ్రతయూ లోకమున నుండదు. పురుషులే విధముగా అనేక స్త్రీలను వివాహమాడి భోగపరాయణులగు చున్నారో, స్త్రీలు కూడా నట్లే బహు పురుష సహవాసము చేయవలయునని కోరుచుందురు."

ఈ విధంగా సాగుతుంది. మణిమంజరి.... ఆ పాత్ర చెప్పింది పూర్తిగా నిజం కాకపోయినా, కొంతవరకూ నిజం!

వైవాహికేతర సంబంధాలు ఎందుకేర్పడతాయి?

ముఖ్యంగా రెండు కారణాలవల్ల — ఒకటి అసంతృప్తి. రెండు థ్రిల్! ఇందులో మొదటిది స్త్రీలకు, రెండోది పురుషులకి ఎక్కువగా అన్వయిస్తుంది. భర్తతో సుఖంగా కాపురం చేసుకునే స్త్రీలు వైవాహికేతర సంబంధాలకు ఎక్కువగా యిష్టపడరు. జీవితం మరీ రొటీన్ అయిపోవటమో, పరాయి మగవాడు తరచూ పొగిడి, ఆమెలో అణగారిపోయిన కోరికల్ని తట్టి లేపటం వల్లనో, పిల్లలు లేవపోవటం వలన ప్రపంచం దృష్టిలో చులకన భావం యేర్పడుతుందన్న భయం వల్లనో, తన కోర్కెలకీ, అభిరుచులకీ సరిపోయిన మగవాడు వివాహం తరువాత పరిచయం అవటం వల్లనో యీ సంబంధాలు ఏర్పడతాయి. నిత్యం ప్రియుడు ఆమెతో కలిసి వుండడు కాబట్టి తన వూహల్లో మగవాడిని ఎలా వూహించుకుంటుందో, అలాగే ప్రియుడు కనబడుతూ వుంటాడు. తనకే విధమైన బాధ్యతలూ లేవు కాబట్టి మగవాడు కూడా దీన్ని ఆనందంగానే స్వీకరిస్తాడు. స్త్రీ దీన్నే నిజమైన ప్రేమగా భావించి, యీ ప్రేమ భావన వల్ల నిత్య జీవితములో సుఖాన్ని అనుభవిస్తూ, బాధల్ని అధిగమిస్తుంది. చాలా చేదుగా వున్నా, చాలామంది విషయంలో యిది నిజం. కొందరు స్త్రీలు దీనికి ఎక్సెప్షన్ అయినా, చాలావరకూ జరిగేది యిదే!

పురుషుడికి సంబంధించినంతవరకూ పరాయి స్త్రీతో సంబంధం అతడి మేల్ ఇగోని సంతృప్తిని పరుస్తుంది. వంటింట్లో మసకబారి, పడక

మీద అస్తవ్యస్తంగా పడుకునే భార్యకన్నా, మల్లెపూవులా (వున్న రెండు మూడు గంటలు) నాజూగ్గా, శుభ్రంగా కనబడే ప్రియురాలే నిజమైన స్త్రీగా అతను భావిస్తాడు. తన భావాలకి, బాధలకి ఔట్‌లెట్‌లా భావిస్తాడు. తమ జీవితంలో జరిగిన అద్భుతమైన సంఘటనగా ప్రియురాల్ని భావించి, ఆమె ఒడిలో తల పెట్టుకొని ఏడవటం, పిక్నిక్‌లకు తీసుకెళ్ళటం లాంటివి సాగిస్తాడు.

ఇద్దరూ దీన్ని 'ప్రేమ' అని నమ్ముతూ సాగినంతకాలం సాగిస్తారు.

మరికొందరు వ్యక్తులు మరికొన్ని ప్రిన్సిపుల్స్‌తో బ్రతుకుతారు. ఒకే టైమ్‌లో ఒకే వ్యక్తిని ప్రేమించగలం అని కొందరూ, ఒకే టైంలో ఎందరినైనా ప్రేమించి, ఒకరికి తెలియకుండా మరొకర్ని అనుభవిస్తూ మరి కొందరూ, అసలు ప్రేమే లేకుండా నటించి కొందరూ.... ఇలా రకరకాలుగా యీ వ్యవహారాలు సాగుతూ వుంటాయి. ఇందులో చిత్రమైన విషయమేమిటంటే, ఒకరోజు ఒకర్ని ప్రేమించి, మరుసటిరోజు అంతే నిజాయితీ (?)గా మరొకర్ని ప్రేమించగల వ్యక్తులు కూడా వుండటం!

మరికొందరు నిరంతర ప్రేమాన్వేషితులు! వారి కలల్లో వారు బ్రతుకుతూ, భౌతికమైన శారీరక సంబంధాలు మాత్రం వేర్వేరు వ్యక్తులతో పెట్టుకుంటారు. ఇంకా కొందరు సెక్స్ మాత్రం తప్పనీ, మిగతా విషయాలు మలినపరచవనీ భావిస్తూ పవిత్రమైన స్నేహం చేస్తుంటారు.

ఈ చేదు నిజాన్ని చాలామంది వప్పుకోరు. ఇంట్లో ఇద్దరు చెల్లెళ్ళున్నా, పక్కింటి చెల్లెల్ని పవిత్రంగా ప్రేమగా కౌగిలించుకొనే అన్నయ్యలు కూడా వున్నారు.

వివాహేతర సంబంధాలు పురుషులకు ఒక విధంగానూ, స్త్రీల కొక విధంగానూ వుంటాయి. పురుషుడు వీటిని రహస్యంగా వుంచాలని అనుకోడు. స్త్రీ మాత్రం ఒకరిద్దరు స్నేహితురాళ్ళకి తప్ప మరెవరికీ తెలియనివ్వదు.

'నా జీవితంలో ఏ విధమైన సుఖమూ లేదు. నేను అనుభవిస్తున్న ఆనందం ఏదయినా వుంటే అది ఆ వ్యక్తిలో గడిపిన కొద్దిసేపే! నేను ఆ

వ్యక్తి ఆలోచనల వల్ల స్ఫూర్తి పొందుతాను. అదే విధంగా ఎక్కడున్నా సరే, ఆ వ్యక్తి నా గురించే ఆలోచిస్తూ వుంటాడన్న అనుభూతి నాకు హాయినిస్తుంది. అదే ప్రేమంటే! నా నిస్సారమైన జీవితంలో అంతకన్నా ఏం కావాలి? దీనిముందు నైతిక విలువకున్న బలం ఏపాటిది...." అని ఎవరైనా వాదిస్తే దానికి ప్రతివాదన లేదు.

ఇలాంటి బంధం ఎంతకాలం నిలుస్తుంది? అన్నదే సమస్య.

కలకాలం నిలుపుకోగల నిజాయితీ ఇద్దరిలో వుంటే సరే! ఇద్దరూ 'అవసరం' ప్రతిపాదకగా కొనసాగిస్తే మాత్రం ఎక్కువకాలం నిలవదు.

"నన్ను నన్నుగా ప్రేమించే వ్యక్తి ఇంత కాలానికి దొరికాడు....నా భావాల్ని అర్థం చేసుకుని....నా మనసుని అర్థంచేసుకుని, దాన్ని ప్రేమించే వ్యక్తి కోసం చూస్తున్నాను.... మనసున మనసై నిలవాలని.... ఒకర్నొకరు ప్రేమించుకుని, ఆ తరువాత ఇక ఆగలేని తమకం ఏర్పడితే అప్పుడు శారీరకంగా కలుసుకుని...." వగైరా స్టేట్‌మెంట్లన్నీ పెళ్ళయిన తరువాత ఏర్పడే సంబంధాల్లో వ్యక్తులు చేసుకునే ఆత్మవంచన- వివాహితుడైన మొగవాడుగానీ, మరొకరి భార్య అయిన వివాహితగానీ- వీరికి కేవలం 'అవసరం' మాత్రమే వుంటుంది. అప్పటికి 'సెక్స్' అంటే వున్న భయం గానీ, పవిత్రతగానీ వుండవు కాబట్టి. ఈ దాంపత్యేతర సంబంధాలన్నీ శారీరక సంబంధాలుగా తప్పక మారతాయి.

"మనిషి తన ఆనందం కోసం బ్రతుకుతాడు. దానికి కన్వీనియంట్‌గా తన సిద్ధాంతాలు నిర్మించుకుంటాడు-" అని నా 'థ్రిల్లర్' అనే నవలలో వ్రాశాను. ఆనందం ముఖ్యం. ఎవరికీ అపాయం జరగని ఆనందం అయితే మరీ మంచిది. దానికి ఆత్మవంచన అనవసరం అని చెప్పటమే ఇక్కడ వుద్దేశ్యం.

ఈ ఆర్టికల్ నన్ను చాలామందికి దూరం చేస్తుందనీ, చాలామంది ఈ వాదనని సమర్ధించరనీ తెలుసు.

'ఋషి'తో కొటేషన్ ద్వారా ప్రారంభించిన ఈ ఆర్టికల్‌ని 'ఋషి' లోని మరొక కొటేషన్‌తో పూర్తిచేస్తారు.

"ఈ ప్రపంచంలో కొంతమంది మంచివాళ్ళుండటానికి కారణం– వాళ్ళకు చెడిపోవటం చేతకాకపోవటమే."

★ ★ ★ ★

## రాజ్ కిరణ్, అనంతపురం

ప్ర : నా వయసు ఇరవై సంవత్సరాలు. ఏడాది క్రితం నాకు ఇద్దరు పిల్లలు వున్న ఓ గృహిణితో సంబంధం ఏర్పడింది. మొదట్లో నేను వాళ్ళింటికి వెళ్ళినప్పుడు ఆమె నేరుగా సెక్స్ ప్రస్తావనతో మాట్లాడటం, కౌగిలించుకోవటం చేసేది. మొదట కాదన్నా తరువాత కాదనలేకపోయాను. ఆమె భర్త ఇంట్లో లేనప్పుడు, అతనికి తెలియకుండా జాగ్రత్తగా మానేజ్ చేసుకొస్తున్నాను. వారింటికి వెళ్తున్న పరిచయంవల్ల ఆమె భర్తతో స్నేహం పెరిగింది. ఆమె భర్తను చూసినప్పుడల్లా ఆయన్ని మోసం చేస్తున్నాను అనే గిల్టీ ఫీలింగ్ నాలో ఏర్పడుతోంది. అయితే ఆమె భర్తకు కొద్దిరోజులుగా సెక్స్ ప్రాబ్లం వుంది. నాతో చాలాసార్లు 'నీవల్ల నాకు ఒక బిడ్డ పుట్టాలి. మేము ఎక్కడున్నా నీ ప్రతిరూపం కదలాడాలి' అంది.

ఇదంతా కేవలం ఆమెకు నా మీద వున్న అభిమానమా? లేక భర్త నుంచి సుఖంలేక నన్ను ఆశ్రయించిందా? దయచేసి నాకు ఈ విషయం స్పష్టపరిచి మానసికంగా నన్ను వుల్లాసపరచ ప్రార్థన.

జ : మీ వయసు ఇరవై సంవత్సరాలే అంటున్నారు. ఆల్రెడీ ఇద్దరు పిల్లలున్న గృహిణితో సంబంధం ఏర్పడితే, భవిష్యత్తులో మీ వివాహ సమయానికి స్త్రీలో వుండే ఏ కొత్తదనమూ మీకు కన్పించదు. అప్పుడు మిమ్మల్ని నమ్ముకుని వచ్చిన మీ భార్యకి మీరు సెకండ్‌హాండ్ మనిషిలా కన్పిస్తారు. ఇప్పటికి మీకు సున్నితమైన బంధాలపట్ల నమ్మకం పోయి, స్త్రీ అంటే 'విలాస వస్తువు' అనే భావం ఏర్పడుతుంది. ఆ తరువాత మీరు మీ భార్యతో సుమారు నలభయి సంవత్సరాలు గడపాలి. ఈ నాలుగు సంవత్సరాల ఆనందం కోసం నలభయి సంవత్సరాల మీ భావి

జీవితాన్ని మానసికంగా పాడు చేసుకుంటారేమో ఒక్కసారి ఆలోచించండి.

ఆమె భర్త లేనప్పుడు మ్యానేజ్ చేస్తున్నా అని వ్రాశారు. కానీ రేపు ఎప్పుడన్నా పట్టుబడితే, జరిగే పరిణామాలు చాలా దారుణంగా వుంటాయి. ఆమె ప్రవర్తన చూస్తుంటే అప్పటికప్పుడు ప్లేట్ మార్చేసి అంతా మీ మీద తోసేదానిలా కనబడుతుంది. కాబట్టి యీ 'రిస్క్'ని కొద్దిగా దృష్టిలో వుంచుకోండి. 1) ఆమె భర్తతో మాట్లాడుతున్నప్పుడల్లా మీకు ఏర్పడే గిల్టిఫీలింగ్. 2) ఆ అమ్మాయిది ప్రేమా? లేక తన అవసరార్థం చేస్తోందా అన్న అనుమానం. 3) ఫ్యూచర్‌పట్ల నిరాసక్తత.... ఇన్ని కాంట్రడిక్షన్స్‌తో యీ వయసులో మీరు చదువుకోకుండా వుంటే, దానివలన మీకొచ్చే లాభమేమైనా వుందా?

ఇకపోతే, మానసికంగా నన్ను ఉల్లాసపరచమన్నారు. ఇలాంటి సమాధానాలు కొద్దిగా చేదుగా వున్నా ఫ్యూచర్లో బాగుంటాయి. భర్తకు సెక్స్ ప్రాబ్లమ్స్ అని వ్రాశారు. ఆ లోటును మీరు తీరుస్తున్నారు. కాబట్టి దాన్ని 'ప్రేమ' అంటుంది. అలాగే, మీ ద్వారానే తనకి మూడో బిడ్డ పుట్టాలి. అంటుంది అని అన్నారు. రేపు ఆ బిడ్డ పుట్టాక, వాడి ప్రతి పుట్టిన రోజుకీ, 'వచ్చి వెళ్ళు' అంటూ మీరెక్కడున్నా ఆమె ఇదే ప్రేమ పేరిట ఆహ్వానించవచ్చు. భవిష్యత్తులో అలాంటి సమస్యలలో ఇరుక్కుంటారేమో ఆలోచించండి.

**రాజు, హైదరాబాద్**

ప్ర : అమ్మా, నాన్నలమీద చిన్నప్పటినుండి నాకు గౌరవం లేదు. అలాగని వాళ్ళు ఏదో తప్పు చేశారని కాదు. కాకపోతే మానసిక అవసరాలు ఇంట్లో ఎప్పుడూ తీరలేదు. డిసిప్లేన్ పేరిట తిట్టడం, ప్రక్కవాళ్ళతో పోల్చి నువ్వు ఎందుకు పనికి రావనడం....ఇలాంటివన్నీ సహజంగా అందరిళ్ళళ్ళోనూ వుండొచ్చు. కానీ మా ఇంట్లో కాస్త 'అతి' అవ్వటంవల్ల ఏదో మానసికంగా అసంతృప్తి వుండేది. ఇంట్లో రేడియో పెట్టనివ్వరు. టెన్త్ క్లాసువరకు సినిమాకెళ్ళే ధైర్యం మా అన్న తమ్ము

ళ్ళకీ ఎవ్వడికీ లేదు. పైగా నాన్న వస్తున్నారంటే ఏదో భయం. అలా చదువుతూ విద్యానగర్‌లో శ్రీ ఆర్. టి. క్వార్టర్స్‌లో ఓ రూమ్‌లో చేరాను.

ఓ రోజు సాయంత్రం కరెంట్ పోవడంవల్ల వాకిట్లో నిలబడ్డాను. ఓనర్‌గారమ్మాయి (పెద్దామె) కూర్చొనుంది. ఏదో మాట్లాడాలి కాబట్టి 'పవర్ ఇప్పుడు తీశాడేమిటండీ?' అన్నాను. 'ఏమోనండి' అంది. ఆ తరువాత ఆమె మాట్లాడుతూ తన గురించి చెప్పడం మొదలుపెట్టింది. తనకు చిన్నప్పుడే పెళ్ళయిందని, భర్త వదిలేశాడని, కళ్ళనీళ్ళు తుడుచుకుంది. స్త్రీ సహజమైన ఓదార్పు పొందే ప్రయత్నం చేస్తుందని అనుకున్నాను. తర్వాత, ఓ దశాబ్దకాలం పరిచయం వున్న స్నేహితుడిలా నన్ను ట్రీట్ చేయడం మొదలుపెట్టింది. మరో రోజు సాయంత్రం మళ్ళీ పవర్ పోయింది. ఆ సందర్భంలో 'పవర్ లేదా?' అంది మూసిన తలుపు తీస్తూ, 'చూడండి' అన్నాను. బయటనుండి చూస్తే పోయేదానికి గడప ప్రక్క నిలబడి వున్న నన్ను తాకుతూ లోపలికి చూసి మళ్ళీ నవ్వుతూ 'లేదు' అంది. ఆమె స్పర్శతో నేను ఏర్పరచుకున్న నైతికసూత్రాలపట్ల లోపల ఘర్షణ మొదలైంది. మళ్ళీ తనే కల్పించుకుని 'సిన్మాకి వెళదామా?' అంది. లోపలినుండి తిరస్కరించలేని బలహీనత. ఆ అనుభవం ఎలా వుంటుందో చూడాలనే బలమైన కోరిక. ఆ మరుసటిరోజు వెళ్ళాం. నెంబర్ ప్రకారం సీట్ వెదుకుతుంటే చెయ్యి గట్టిగా గిల్లి 'ఇంకా అర్థం కాలేదా? అటు మూలకెళదాం' అంది. కూర్చున్నాక ఓ నిమిషమాగి 'ఏదైనా మాట్లాడు' అంది, ఏకవచనంలోకి మారి మరింత చనువుగా ప్రవర్తిస్తూ.

'నువ్వే మాట్లాడు' అన్నాను. 'ఏం మాట్లాడాలి' అంటూ చెయ్యి వళ్ళో వేసింది. నాకు లోపల గుండె ఆగిపోతుందేమో అన్నంతగా భయం. పైకి మాత్రం అదే కావాలని కోరిక నన్ను తనవేపు లాక్కుంది. ఆ తరువాత "అంతా" జరగాల్సింది జరిగిపోయింది. తనకు రోజూ పాములు కలలోకి వస్తుంటాయని సినిమాహాల్లో చెప్పింది. రాత్రిళ్ళు నిద్ర సరిగ్గా పట్టదని, జ్వరంలా వస్తుందని కూడా చెప్పింది. పాములు కల అంటే ఫ్రాయిడ్ సెక్స్‌వల్ డిజైర్‌గా చెప్పడం నాకు గుర్తొచ్చింది.

చదువుదామని కూర్చుంటే యివే తలపులు రావడంతో చదువు సాగలేదు. చూస్తూండగానే పరీక్ష పోయింది. నెక్ట్స్ ఇయర్ కూడా పరిస్థితి ఇలాగే వుంటుందని భావించి ఆ ఇంటికి రెండిళ్ళ అవతల రూమ్ ఖాళీ అయితే అక్కడికి షిఫ్టు చేసి వెళ్ళాను. అమ్మ రాత్రిళ్ళు నిద్ర పట్టడము లేదని, ఏవో పాములు కలలోకి వస్తున్నాయని అందువల్ల సోమ, బుధ వారాలు శివుని పూజచేసి ఉపవాసం వుంటున్నానని అంది. నాకు సినిమా హాల్లో ఆ అమ్మాయికూడా యిలానే చెప్పింది. దాంతో అమ్మమీద గౌరవ భావం పోయింది. 'అమ్మకూడా యింతేనా?' అనే భావం నాలో మొదలయ్యింది.

ఓ నెలరోజులు గడిచింది. ఓ రోజు ఆమె ఎవరితోనో చిన్నపిల్లాడితో లెటర్ రాసి పంపించింది. ఆ పిల్లవాడు పొరపాటున పక్కరూమ్ 'రాజు' కిచ్చాడు. రాజు పూర్తిగా చదివి "పెద్ద కేసే" అన్నాడు. నా నిజాయితీని బయట పెట్టుకోవడానికి మా పాతకథ, రూమ్ మార్చిన వైనం చెప్పాను. ఆ అమ్మాయి ప్రవర్తనని తిట్టాడు.

అక్టోబర్ నెలలో ఓ రోజు రాజమండ్రి నుండి మా ఫ్రెండ్ వచ్చాడు. అతను 'సిన్మాకెళదాం' అనడంతో వెళ్ళాం. సిన్మాహాల్లో జనం అంతగా లేరు. అప్పటికే షో మొదలయి పదిహేను నిమిషాలైంది. రెండు వరుసల ముందు మూల ఓ జంట కన్పించింది. మమ్మల్ని అతనితోపాటు 'ఆమె' కూడా చూసింది. అతను రాజు. ఆ రాత్రంతా నిద్రలేదు. ఎందుకో ప్రక్క రూమ్‌వాడుకూడా నన్ను మోసం చేశాడు అన్పిస్తోంది. ఆత్మపరిశీలన చేసుకుంటే.... ఏం మోసం? 'ఆమె' నా చెల్లా? పెళ్ళామా? ఏదీ కాదు. పైగా రాజువైపు నుంచి చూసినా, వాడు నన్ను "నీ కిష్టంలేదా?" అని ప్రశ్నించినప్పుడు 'లేదు' అని చెప్పాగా. మరిప్పుడెందుకు వాడిమీద కసి. ఓ సైకియాట్రిస్టుని కలిశాను. ఆయన అంతా విని ఓ చాంతాడంత మందుల లిస్టు రాశాడు.

జిడ్డు కృష్ణమూర్తి బుక్స్ చదివాను. ఆయన చెప్పినట్లు మనం మన ఆలోచనలకు ప్రతిరూపాలమే కదా! ఇలా ఎందుకు జరుగుతుంది. సమాధానం చెప్పగలరు.

జ : ఫ్రాయిడ్ చెప్పిన సూత్రాలలో పాములు సెక్సువల్ డిజైర్స్‌కి సింబల్స్ అవ్వొచ్చేమోకానీ పాములు కలలోకి వచ్చిన వాళ్ళందరికీ అవే ఆలోచనలు వుంటాయనుకోవడం నిర్హేతుకం. మీ అమ్మగారి కలలలోకి పాములెందుకు వస్తున్నాయని అనలైజ్ చేయడం- మీకు ఏ విధంగానూ సంబంధించిన విషయం కాదు.

ఇక మీ సమస్యకొద్దాం- మంచిగా ఆలోచించటం వేరు. మంచిగా బ్రతకటం వేరు. చాలామంది మంచిగా ఆలోచిస్తూ వేరే రకంగా బ్రతుకుతూంటారు. మీది అనుకున్న ఒక 'వస్తువు' మీది కాకుండా పోవటంవల్ల వచ్చిన అసంతృప్తి మీలో అంతర్గతంగా వుంది. ఒకప్పుడు మీ కోసం ప్రయత్నం చేసిన స్త్రీ వేరే పురుషుడితో వుండటం మీరు చూశారు- మీ ఈగో దెబ్బతిన్నది.... "ఆమె నా పెళ్ళామా, చెల్లా" అనుకున్నారు- కానీ 'ఏ స్త్రీ ఎవరితో వెళ్ళినా మగవాడి మనస్సు చివుక్కుమంటుంది' (తనకా అవకాశం చిక్కలేదని) పార్కులో ఒక పెళ్ళికాని జంట కనబడితే తన గర్ల్‌ఫ్రెండ్ సంగతి మరచిపోయి....వీళ్ళు చెడిపోతున్నారనుకుంటాడు మగవాడు.

మీ స్నేహితురాలు తన సుఖం చూసుకుంది. మీ రాజు సుఖపడుతున్నాడు- మీకే ఏ సుఖం దక్కటంలేదు. మీరు ఎక్కువగా దుఃఖం గూర్చి ఆలోచిస్తున్నారు. ఈ వయసులో జిడ్డు కృష్ణమూర్తి పుస్తకాలు చదవటంతోపాటు ఒక లక్ష్యం ఏర్పరచుకుని, ఆ లక్ష్యంవైపు ఆనందప్రదంగా సాగటము ముఖ్యం.

**గీతాంజలి రవి, (ఊరి పేరు వ్రాయలేదు)**

ప్ర : ప్రస్తుతం నా వయసు ముప్పైరెండు. నా వివాహం సమయంలో నా వయసు 21 సంవత్సరాలు. నా భార్యకి పదిహేడు. అప్పట్లో నా ఆలోచనలు వేరు. నా భార్య మానసిక ఎదుగుదల వేరు. అలా వైవాహిక జీవితంలో అసంతృప్తి 'హయ్యర్ స్టడీస్'కి దారి తీసింది. యూనివర్శిటీలో 'రీసెర్చ్' చేస్తున్న సమయంలో 'విధాత్రి' పరిచయమైంది. ఆమె

నా 'రీసెర్చ్ వర్క్'లో చాలా సహాయం చేసింది. ఆ తరువాత నాకు 'ఉద్యోగం' రావడంతో ఇద్దరం విడిపోయాం. విడిపోయిన ఆ కాలంలో ఆమె చాలా డిప్రెషన్‌కి గురైంది. పెళ్ళి చేసుకోకుండా సంబంధాలు త్రిప్పి పంపుతుంది. ఆ కారణం నాకు మాత్రమే తెలుసు. "నన్ను ఏం చూసి ప్రేమించావు?" అడిగాను. 'నీ సింప్లిసిటీ' అంది. తప్పని పరిస్థితులలో ఆమెని పెళ్ళి చేసుకుంటానని ఆమెకు మాట ఇచ్చాను. ఈ విషయాలన్నీ నా భార్యకి ఆ తర్వాత చెప్పాను. నా భార్య విని వూరుకుంది. ఉన్న భార్యని, బాధ్యతల్ని తప్పించుకోలేను. నా విధాత్రిని మరువలేను ఏమి చేయాలో నాకు తోచడంలేదు. రచయితగా మీరైతేనే నా కథకి ఎలా ముగింపు చేస్తారు.

వ్యక్తిగా నేను సుఖపడాలంటే సంఘాన్ని బాధపెట్టాలి. సంఘ నియమాన్ని, నైతిక విలువల్ని పాటిస్తే సంఘం సంతోషిస్తుంది. కానీ పూర్తిగా నేను బాధపడాలి. సంఘాన్ని తృప్తి పరచటం ముఖ్యమా? లేక వ్యక్తిగత సంతోషం ముఖ్యమా?

జ : మీ పన్నెండు పేజీల ఉత్తరం చదివాక, మీ పేరు ముందు 'గీతాంజలి' తగిలించుకోవడం, మీరు ప్రేమించినావిడను 'విధాత్రీ' అని వ్రాసుకోవడం చూస్తుంటే మీలో భావుకత్వం అవసరమైనదానికంటే ఎక్కువ వుండి, మిమ్మల్ని పాడుచేస్తుంది అన్పించింది. మీ మానసిక స్థాయి వేరు అని వ్రాశారు. మీ భార్య కూడా మీ పట్ల ఈ విధమైన అసంతృప్తితోనే వుండి వుండవచ్చు. ఆమె కూడా మీ అంత గొప్పవాడిని కాక పోయినా, ఏ గుమాస్తానో తన మానసిక స్థాయిలో ప్రేమించి పెళ్ళి చేసుకుని మరో కాపురం పెట్టి, సామాజికపరంగా మీ నుంచి విడిపోకుండా వుంటూనే సాయంత్రాలు ఆమె ప్రియుడితో కాపురం చేయడానికి మీరు అంగీకరిస్తారా? అలా వొప్పుకున్న పక్షంలో మీ నలుగురు చాలా సుఖంగా వుండవచ్చు. ఇక్కడ మీ 'మేల్ ఈగో' తప్పకుండా దెబ్బ తింటుంది.

మీకు పెళ్ళయ్యిందని మీ విధాత్రికి తెలుసు కదా! అయినా మిమ్మల్ని ప్రేమించిందంటే ఆమె భవిష్యత్ కన్నా ఆకర్షణకు ప్రాముఖ్యత ఇస్తుందన్న మాట. ఈ ఆకర్షణ మీరు ఎంతకాలం నిలుపుకోగలరు అన్నది సమస్య. ఆమె కూడా చదువుకున్నది. ఆమెలో మీపట్ల "మిమ్మల్ని కాకుండా ఇంకెవరినైనా పెళ్ళి చేసుకున్నా సుఖంగా వుండేదాన్ని" అనే భావం తర్వాత ఎప్పుడయినా బయల్దేరితే అప్పటినుంచి మీకు నరకం ప్రారంభమవుతుంది. మీ 'సింప్లి సిటీ' చూసి మిమ్మల్ని ప్రేమించింది అని వ్రాశారు. బహుశా అది 'సింప్లి సిటీ' అయి వుండదు. 'ఎవేలబులిటి' అయి వుంటుంది.

మీరు విధాత్రిని పెళ్ళి చేసుకున్నా, సుగాత్రిని చేసుకున్నా సంఘ నియమాన్ని, నైతిక విలువల్ని పాటిస్తే సంఘం సంతోషిస్తుందా? లాంటి ఆలోచనలు అనవసరం. ఏ విధంగా ఇద్దరు భార్యలకు న్యాయం చేకూర్చ గలను? అన్నది మీకు మీరు వేసుకోవలసిన ప్రశ్న. అదే విధంగా ఇద్దరికీ చెరో ఇద్దరు పిల్లలు పుట్టినా కూడా మీరు పోషించవలసి వుంటుంది. అది ఆర్థికపరమైన సమస్య. ఇవి కాకుండా న్యాయం, చట్టం అనే సమస్యలు కూడా మిమ్మల్ని ఎదుర్కోవచ్చు. వీటన్నింటికన్నా ముఖ్యంగా మీ భార్య ఇక జీవితంలో మిమ్మల్ని క్షమించకపోవచ్చు.

మీ ఉత్తరం చూస్తుంటే, మీ భార్యకి విడాకులు ఇచ్చి ఆ అమ్మాయిని చేసుకునే ధైర్యం (?) కూడా మీకు వున్నట్టు కనబడటంలేదు. అయినా అభిరుచులు కలిసినంత మాత్రాన సంసారాన్ని వదులుకోవటం ప్రారంభిస్తే ఇక దానికి అంతుండదు.

ఈ ప్రపంచంలో తమ భార్యలపట్ల అసంతృప్తులైన పతులు, తమ పతుల పట్ల అసంతృప్తులైన సతులు వేరు వేరు వివాహాలు చేసుకోవడము ప్రారంభిస్తే 90 శాతం ఆడవాళ్ళు, మగవాళ్ళు మూడు నాలుగు వివాహాలు చేసుకోవలసి వస్తుంది.

వై. కల్పన, కొత్తగూడెం

ప్ర : ప్రస్తుతం నా వయసు ఇరవై నాలుగు. నా పధ్నాలుగవ ఏటనే మా తల్లిదండ్రులు నాకు పెండ్లి చేశారు. పెళ్ళి అయ్యాక అతను నేను రెండు సంవత్సరాలు కలిసి వున్నాము. ఆ తరువాత కట్నం విషయంలో పేచీలు వచ్చి విడాకులు తీసుకున్నాం. వద్దన్నా వినకుండా మాతల్లిదండ్రులు మరల వివాహం చేశారు. అతనికి మా పెళ్ళికి ముందే వివాహం అయ్యింది. ముగ్గురు పిల్లలు కూడా. ఆ విషయం మా పెళ్ళి అయ్యేవరకు మాకు తెలవకుండా వాళ్ళు దాచిపెట్టారు. కానీ పెళ్ళయిన మరుసటిరోజే అసలు సంగతి బయటపడింది. మరల విడాకులు తీసుకుని విడిపోయాము. నేను ఎనిమిదవ తరగతి వరకు చదువుకున్నాను. నా రెండో వివాహానంతరం ఓ ప్రైవేట్ హాస్పిటల్లో పనిచేయడం ప్రారంభించాను. అక్కడ నాకో స్నేహితుడు పరిచయం అయ్యాడు. అప్పుడప్పుడు నా బాధలను తెలుసుకుని అతను నన్ను ఓదారుస్తూ వుండేవాడు. అలా మా ప్రేమ మొదలయ్యింది. మా ప్రేమకు ఇది మూడో సంవత్సరం. మేమిద్దరం ప్రతి ఒక్క విషయము కూడా దాచిపెట్టుకోకుండా ఒకరికొకరం చెప్పుకుంటాం. అతను నన్ను "పెళ్ళి చేసుకుంటాను" అంటున్నాడు. నన్ను పెళ్ళి చేసుకుంటే చచ్చిపోతానని వాళ్ళ అమ్మ అతన్ని ఆపుచేస్తున్నది. వాళ్ళ అమ్మ అంటే అతనికి ప్రాణం. వాళ్ళ నాన్నగారు చనిపోయారు. 'మీ అమ్మకు ఇష్టమైన అమ్మాయిని చేసుకో' అని అతనికి చాలాసార్లు చెప్పాను. కానీ వినిపించుకోవటం లేదు. ఇలా ఎంతకాలం మేము వుంటాం? ఈ సమస్యకో పరిష్కారం చూపగలరు.

జ : ఇది మీకు మూడో వివాహం అని రాశారు. మీ కాబోయే భర్త తల్లి "ఈ వివాహం వద్దు" అని అభ్యంతరం పెట్టడంలో ఆమె భయాలు ఆమెకి వుండి వుంటాయి. అతనితో "మీ అమ్మగారికి ఇష్టమైన అమ్మాయినే చేసుకో" అని చెప్పి మీరెందుకు త్యాగం చేస్తున్నారో నా కర్థం కాలేదు. మీ ఉద్దేశ ప్రకారమే అతను మరో వివాహం చేసుకుంటే ఆ తర్వాత మీరు గుర్తుకొస్తుంటే ఆ అమ్మాయితో ఎలా సుఖంగా వుండగలడు? అప్పుడు అతను మీ దగ్గరకొచ్చి యీ విషయం చెప్పి ఇంకా దగ్గరయితే

ఆ పిల్లకు మీరు అన్యాయం చేసినట్లు కాదా? ఒకవేళ అతను సుఖంగా వుంటే, మీరు అప్పుడప్పుడూ కలుస్తూ సంతృప్తి చెందుదామనుకుంటు న్నారా? ఇలా చేసినా అతని భార్యకు ద్రోహం చేసినట్టు కాదా? ఈ రెండూ వదిలేస్తే, అతని వివాహమయ్యాక శాశ్వతంగా మీరు అతని నుంచి విడిపోదలచుకున్నారా? అలా ఒంటరిగా బ్రతకగలరా? అలా బ్రతికి సాధించేది ఏమిటి?

జీవితంలో ప్రస్తుత స్థాయికంటే ఆనందంగా గడిపే మరో స్థాయి లభిస్తుంటే రిస్క్ తీసుకోవడం మంచిది. ఎందుకంటే మీ పెళ్ళయ్యాక అతను మారి, మిమ్మల్ని బాధ లేదా మీ గతాన్ని గుర్తుచేస్తూ హింసించ డమో చేస్తుంటే అప్పుడే విడిపోవచ్చు. దీనివల్ల కొత్తగా మీరు కోల్పో యేది ఏమీ వుండదు. పోతే పెళ్ళయినాక మూడు, నాలుగు సంవత్సరాల వరకూ పిల్లలు పుట్టకుండా చూసుకోండి. ఒకవేళ మీరు విడాకులు తీసు కుంటే వాళ్ళు మీకు భారం కావచ్చు. నా వ్యక్తిగత అభిప్రాయం ఏమి టంటే మీరు ఇతన్ని చేసుకోవటం మంచిది. మొదట్లో ఆ తల్లి కాస్త ప్రతిఘటించినా తర్వాత ఒప్పుకుంటుంది.

**రాజ్‌కిరణ్, అనంతపురం**

ప్ర : నేనింతకు మునుపు ఒక ఉత్తరం రాశాను. సమాధానం ఇవ్వ లేదు.

ఒకప్పుడు నన్ను ఎంతో అభిమానించి "రాజా నీ నుంచి నాకో బిడ్డ పుట్టాలి, మేమెక్కడున్నా నీ ప్రతిరూపం మాతోపాటు కదలాలి" అన్న నా ప్రియురాలు ఇప్పుడు మూడో నెల గర్భిణి అయికూడా అబార్షన్ చేయించుకుంటానంటున్నది. ఆమె భర్తకి ఏ మాత్రం అనుమానమూ లేదు. "ఈ బిడ్డ కలిగాక కావాలంటే ఆపరేషన్ చేయించుకోవచ్చులే" అంటు న్నాడు కూడా. ఆమె వినడంలేదు. ఏమిటండీ ఇదంతా? నన్ను ప్రోత్స హించి, నాతో సెక్స్ సంబంధాలు పెట్టుకొని, మూడు నెలలపాటు గర్భం

రాకపోతే నువ్వు మొగాడివి కాదు అని ఎగతాళి పట్టించినామె యీ రోజు ఎందుకు ఇలా విముఖంగా వుంటోంది?

జ: పెళ్ళికాని యిద్దరు వ్యక్తుల మధ్య ప్రేమ 'ఆకర్షణ' వలన పుడుతుంది. పెళ్ళయిన యిద్దరి వివాహితుల మధ్య ప్రేమ అసంతృప్తి వలన పుడుతుంది. ఆకర్షణ అయినా, అసంతృప్తి అయినా సరయిన సమయంలో ప్రేమగా పరావర్తనం చెందకపోతే అది నశించిపోతుంది.

పెళ్ళయి పిల్లలున్న ఒక స్త్రీ మీ నుంచి వేరే బిడ్డను ఎందుకు కనాలనుకొంది? మీరంటే వల్లమాలిన అభిమానంతో అయి వుండవచ్చు! దీనికే 'మోజు' అని పేరు పెడితే మీకు అభ్యంతరం వుండదనుకుంటాను. ఆమె యిప్పుడు మిమ్మల్ని కాదనటానికి రెండు కారణాలు వుండి వుండవచ్చు. మొదటిది- మీ మీద ఆమెకు మోజు తగ్గిపోవటం, రెండోది- ఆమెకు అకస్మాత్తుగా తాను భర్తని మోసం చేస్తున్నానన్న ఫీలింగ్ కలగటం. పరాయి బిడ్డను తన బిడ్డగా పెంచి పెద్ద చేయటానికి చాలా జాణతనం, ఆత్మవంచన కావాలి. భవిష్యత్తులో పెద్ద మానసిక సంఘర్షణకు గురి కావల్సివస్తుంది. బహుశా అలాంటి మానసిక సంఘటన ఆమెలో యిప్పటి నుండే ప్రారంభమై వుంటుంది. భర్త దగ్గిర ఆమె కడుపులో కదితే పిండం ఆమెని ప్రశ్నిస్తూ వుండవచ్చు. ఆమెను మరొకసారి కలుసుకొని, అదే ఆఖరిసారి అని చెప్పి అయిదు నిమిషాలు మాట్లాడండి. ఆమె అభిప్రాయం తెల్సుకోవటం ద్వారా మీ అనుమానాలు పటాపంచలై పోతాయి. పరాయి సంసారంలో 'మీ అంశ' ప్రవేశపెట్టడం మీ స్వార్థం. ఆమెకి అది ఇష్టం లేనప్పుడు మీరు కూడా మర్చిపోవటం మంచిది. ఒక వ్యక్తితాలూకు 'మీరే అభిరుచుల గురించి' విశ్లేషిస్తూ మీ సమయం వృధా చేసుకోకండి.

కె,

ప్ర: దయచేసి నా పేరు ఇవ్వొద్దు. నాకు వివాహం జరిగి 8 సంవత్సరాలు అయింది. మావారు రాత్రి పదకొండు లోపు ఇంటికివచ్చి దాదాపు ఆరు సంవత్సరాలు అవుతోంది. మీరేదో నవల్లో వ్రాసినట్లు "ఒకే యింట్లో

ఇద్దరు అతిథుల్లా వుంటాం!" అలా అని కొట్టుకోం, తిట్టుకోం. ఎవరి మానాన వాళ్ళు బ్రతుకుతూ వుంటాం. నాలుగు సంవత్సరాల క్రితం మా కాలనీలోనే వుండే ఒక యువకుడితో పరిచయమైంది. అతను రీసెర్చి స్కాలరు. అతనితో పరిచయం అయిన తరువాత తెలిసింది. జీవితంలో యింత ఆనందం వున్న విషయం. ఇంతకాలం నేనేం కోల్పోయానో నాకు అర్థం అయ్యింది. అతను చాలా మంచివాడు. ఇంటలిజెంట్. నా నిస్సార మైన జీవితంలో ఏదయినా కొంతకాలం ఆనందంగా గడిపానంటే అది అతడిలో వున్న కాలమే. అతడితో పరిచయమైనాక నా భర్త నన్ను ముద్దు పెట్టుకొన్నా నాకు కంపరంగానే వుంటుంది. మీకు నామీద ఇదంతా చదివి అసహ్యం పుట్టినా సరే.... నేను పతివ్రతను కాను. నా భర్త పెళ్ళికి ముందు ఎందర్నో ప్రేమించారట. అందుకని నిర్లిప్తత! అదే పని (ప్రేమించటం) వివాహం జరిగిన తరువాత చేస్తే తప్పా? ఇప్పుడు నా స్నేహితుడు బాబా రీసెర్చి సెంటర్‌లో పెద్ద ఉద్యోగం వచ్చి వెళ్ళిపో తున్నాడు. అతను లేకుండా నేను వుండలేకపోతున్నాను. ఏం చెయ్యను?

జ : మీరు ఆరు పేజీల ఉత్తరంలో 'చివర్న రెండు ప్రశ్నలు' వున్నాయి. "నేను చేస్తున్నది తప్పా?" అన్న ప్రశ్న ఒకటి "నేనేం చేయను?" అనేది ఇంకోటి. మొదటిదానికి సమాధానం 'కాదు' అయితే రెండో ప్రశ్న ఉత్పన్నమయ్యేది కాదు. మీరు చేసేది తప్పు కాబట్టే, యిప్పుడీ క్షోభ అనుభవించబోతున్నారు. నేను చెపుతున్న ఈ 'తప్పు' అన్నమాట మీరు పాతివ్రత్యం కోల్పోవటం గురించి కాదు. మీ ప్రేమకు సంబంధించిన విషయం గురించి!

మనిషికి 'థ్రిల్' ఇచ్చినంత సంతోషం ఇంకేదీ ఇవ్వదు. ఆ థ్రిల్ ఒక వ్యసనమైతే అదే వ్యాధి అవుతుంది. మీ స్నేహితుడు చాలా మంచి వారు అంటున్నారు. మీవారు ఆఫీసుకు వెళ్ళాక అతడు మీ ఇంటికి వచ్చి నాలుగైదు గంటలు గడపటమో, మీరు అతని అవుట్‌హౌస్‌కి వెళ్ళటమో

జరిగింది. ఆ నాలుగయిదు గంటల కాలంలో తమకమూ, ఆనందమూ, ఆవేశమూ తప్ప అతని మంచిని బహిర్గతం చేసే ఏ విషయాలు మీకు కనబడ్డాయి? ఈ విషయం అలా ప్రక్కన పెట్టండి. మీ భర్త వివాహం పూర్వం ఎవర్నో ప్రేమించి జీవితం నిస్సారం చేసుకొన్నారు. మీరు వివాహానంతరం ఎవర్నో ప్రేమించి జీవితం గురించి వ్యధ చెందుతున్నారు. మీ స్నేహితుడు మిమ్మల్ని వదిలి ఎలా వెళ్ళాలా అని మధన పడు తున్నాడు. ఈ మొత్తం వ్యవహారంలో నష్టపోయింది మీరే! ఎలాగో చెపుతాను వినండి....

ఎవర్నో ప్రేమించిన మీ భర్త మీతో శారీరకంగా అవసరమైనంత వరకూ బాగానే వుంటున్నాడు. మీ స్నేహితుడు కొంతకాలానికి ఎవర్నో చేసుకొని వైవాహిక జీవితం ఎలాగూ మొదలుపెడతాడు. మీరు మాత్రం మీ భర్త ముద్దుపెట్టుకున్నా కంపరపడే స్థితికి చేరుకొన్నారు. నష్టపోయింది మీరే కదా. నేను వాదించే వాదన తప్పంటారా? మీ స్నేహితుడు కూడా మిమ్మల్ని అంతే గాఢంగా యిష్టపడుతున్నాడంటారా? అయితే యింకేం? "మా ఆయన దగ్గర విడాకులు తీసుకొంటాను. మనిద్దరం వివాహం చేసు కొందాం" అని చెప్పండి. అతను ఒప్పుకుంటే, మీ ఆయన దగ్గరకు యిద్దరూ వెళ్ళి మీ నిర్ణయం చెప్పండి. మరీ మూర్ఖుడైతే తప్ప ఆయన కాదనడు. ఒక్కసారి మీరు, మీ స్నేహితుడు ఒకటైతే, మీ అంత అదృష్టవంతులు యింకెవరూ వుండరు. ఆరువేల రూపాయల జీతగాడు, భవిష్యత్తులో భార్యగా రాబోయే అందమైన కన్నెపిల్లను వదులుకొని మిమ్మల్ని చేసుకోవటానికి వప్పుకొంటే అంతకన్నా అదృష్టం ఇంకేముంది. అలా కాకుండా, మీ మనస్సులో ఆలోచన మీ స్నేహితుడికి చెప్పగానే, "వద్దు కరుణా నీ సెక్యూరిటీ నా కుటుంబ పరువు ప్రతిష్టా" అంటూ నసి గాడా, అప్పుడు కూడా మీ అంత అదృష్టవంతులు మరొకరు వుండరు.

ఎందుకంటే ఒక గొప్ప హెలూసినేషన్ (భ్రాంతి) నుంచి మీరు బయట పడ్డారు కాబట్టి! "తరలి రాదా తనే వసంతం.... తన దరికి రాని వనాల కోసం...." అనే పాడుకోవటానికి మాత్రమే బావుండే పాట. వసంతం ఎంత ఆహ్లాదంగా వస్తుందో, గ్రీష్మానికి చోటిచ్చి అంత నిర్దయగాను వెళ్ళి పోతుంది. సామాజికపరమైన ఒప్పుకోలు లేని థ్రిల్ కూడా యిలాంటి వసంతం లాంటిదే! అనుభవించి వదిలేయటానికి పనికిరాదు.

(నేనీ సమాధానంలో రిస్కు ఫాక్టరు గురించి చర్చించలేదు. గమనించగలరు.)

—★—